# అలబ్ధకావ్య పద్యముక్తావళి

సంపాదకుడు

**డా. ఆర్. శ్రీహరి**

ఎమ్.ఏ; పిహెచ్.డి. (తెలుగు)
ఎమ్.ఏ; బి.ఓ.ఎల్. (సంస్కృతం)
పి.జి.డిప్లొమా (లింగ్విస్టిక్స్)

రీడర్, తెలుగుశాఖ

ఉస్మానియా విశ్వవిద్యాలయము

ప్రచురణము

పతంజలి పబ్లికేషన్స్

హైదరాబాద్

ALABDHA KAVYA PADYA MUKTAVALI
(An Anthology of Poems from unavailable Telugu classics)

by Dr. R. SRIHARI
Reader in Telugu, Osmania University, Hyderabad-500 007.

---

First Edition 1983



Price Rs. 30/-



For Copies:
R. ANANTALAKSHMI
16-2-836/F/2,
Madhavanagar, Saidabad,
HYDERABAD-500 659.

Printed at
MASTER ART PRINTERS
1-1-694/2/A, Gandhinagar,
HYDERABAD-500 380

---

Paper used for the printing of this book has been made available by the Convenor, State Level Committee for distribution of Paper, A. P.

# అంకితం

నాలో పరిశోధనాసక్తిని పెంచి

నా సాహిత్యజీవితానికి

మార్గదర్శకులైన

గురువరేణ్యులు

**ఆచార్య బిరుదురాజు రామరాజు గారికి**

భక్తిపూర్వకనమస్సులతో

Dr. G DHARMESWARA RAO,
M.A., Ph.D.,
LECTURER IN TELUGU,
AMARAVATHI 522020.
GUNTUR - (DIST.)

కళాప్రపూర్ణ, పద్మశ్రీ
డా. సి. నారాయణరెడ్డి
అధ్యక్షులు

అధికారభాషాసంఘం
హైదరాబాదు

# అభినందన

డా॥ శ్రీహరి స్మితపూర్వాభిభాషి. ఆ స్మితం కంటె సితంగా ఉన్న హృదయం అతనిది. విద్య, వివేకం, వినయం ముప్పిరిగొన్న ఉత్తమాధ్యాపకుడతడు. శ్రీహరి తీసుకున్న గుత్త సంస్కృతాంధ్రభాషా విద్వత్త.

వ్యాకరణంలో చేయి తిరిగిన వాయి. వ్యాకరణాల కీకారణ్యాల్లో పడి సాహిత్యాన్ని విస్మరించలేదు. నల్లగొండజిల్లా మాండలికపదకోశం తయారు చేస్తున్నారు. భాస్కరరామాయణం పైన ప్రామాణిక పరిశోధన గ్రంథం వ్రాశారు. ఇప్పుడు ఈ సంకలనం రూపంలో అలభ్యకావ్యాల్లోని ఆణిముత్యాలను హారాయమానంగా అందిస్తున్నారు.

ఈ సంపుటిలో మౌలిక ప్రతిభ ఉన్న మహాకవి సదృశులున్నారు. కేవలం ప్రతిధ్వనికారులైన కీచుగొంతుకల కవులూ ఉన్నారు. ఏమైనా అక్షరాకృతిలో పరిశీలించి బేరీజు వేయడానికి అనువుగా ఈ సంకలనం కూర్చిన శ్రీహరికి అభినందన.

సి. నారాయణరెడ్డి

డా. కే. గోపాలకృష్ణారావు
ఆచార్యులు, తెలుగుశాఖ

ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాదు

# పరిశోధనలో ప్రగతి

విశ్వవిద్యాలయాలలో రూపొందుతున్న విస్తృత విద్యా ప్రణాళికలలో పరిశోధన ఒకటి. స్నాతకోత్తర పట్టాన్ని పొందిన వారిలో కొందరు ఆరంగంలో ప్రవేశించటం ఒక ఫేషనుగా భావించటంతో దాని విలువ, స్థాయి తగ్గే ప్రమాదస్థితి ఏర్పడవచ్చు. దానిని నిరోధించుట పరిశోధనాసక్తి కల విద్యాధికుల కర్తవ్యమని ప్రత్యేకంగా చెప్పే అవసరం లేదు గురుతరమైన ఈ బాధ్యతను గుర్తించి తన్మార్గదర్శికగా 'అలభ్యకావ్యపద్యముక్తావళి' అనే సంకలన గ్రంథాన్ని రూపొందించి వెలువరించినవారు మిత్రులు డా. శ్రీహరిగారు.

సుకవి లేఖినీ ముద్రితమైన ప్రాచీన కావ్యసంపదలో ఎంతో భాగం అనేకానేక కారణాలవల్ల అంతరించిన అంశం ప్రాచీన లక్షణ గ్రంథాల్లో లక్ష్యాలుగా ఉదాహృత పద్యాలవల్ల స్పష్టం. ఆవి కవి రచనలకే కాక కవిదేశ కాలాదులకు సంబంధించిన అమూల్య విశేషాలను గుర్తించుటకు ఏకైక, ప్రధాన ఆధారాలుగా ఉన్న విషయం సర్వవిదితమే. అవి అన్నీ చెల్లాచెదరుగా లక్షణగ్రంథాల్లోను, సాహిత్య చరిత్రకారులు, పరిశోధకులు మున్నగువారి వ్యాసాల్లోను తలదాచుకోవటం వల్లను, మరల మరల ముద్రణ భాగ్యాన్ని పొందక అందుబాటులో లేనందువల్లను, నామమాత్రంగానే నిలిచి ఉన్నవి. సామాన్య పరిశోధకునకు ఎంతో శ్రమ కలిగిస్తున్న స్థితి ఇది. తెలుగులో సాహిత్య, చారిత్రక పరిశోధన పరవళ్ళు త్రొక్కిన ఈ శతాబ్ది ఆరంభంలో పండితుల పరిశ్రమ ఫలితంగా ఆ సంపద సంకలన గ్రంథ రూపంలో అవతరించి దిగ్దంతులైన పండితులకే కాక పిల్ల పరిశోధకులకును కొండంత బలాన్ని ఇచ్చింది. ప్రబంధరత్నావళి, ప్రబంధరత్నాకరము, గోలకొండ కవుల సంచిక వంటివి వాటిలో తలమానికమువంటివి. పిల్ల పరిశోధకులలో కొందరికి గోలకొండ కవుల సంచిక వంటి గ్రంథాల ఉనికి కూడ తెలియని స్థితి వచ్చింది. సంకలన గ్రంథాల ప్రాధాన్యం పరిశోధక లోకానికి అందును ప్రత్యేకంగా యువతరానికి తెలియవలసి ఉన్నది శ్రీహరి గారి గ్రంథం ఆ ప్రయోజనాన్ని తప్పకుండా సాధిస్తుంది.

అలబ్ధ కావ్యాలను గూర్చి నూత్నాంశములు వెలుగులోనికి వస్తున్నప్పుడు భాషాసాహిత్య చరిత్రలలోని కొన్ని భాగాలు పునర్నిర్మాణం పొందే అవసరం కలుగవచ్చు. భాషాచరిత్రలో విస్తృతంగాను, సాహిత్య చరిత్రలో పరిమితం గాను కనిపిస్తున్నదీ ధోరణి లక్షణ గ్రంథాల్లోని అనేక పద్యాల వల్ల మహా కవులు, తదితరులు రచించిన కావ్యాల పరిచయం నామమాత్రంగా అయినా కలుగుతున్నది. సంకలన గ్రంథాల ద్వారా ఈ ఆధారాలు బహుళ ప్రచారాన్ని పొందే అవకాశమున్నది. అథర్వణ భారతం — ఎఱ్ఱన రామాయణం — నన్నెచోడుని కళావిలాసం, తిక్కన విజయసేనం—శ్రీనాథుని గాథాసప్తశతి— నాచనసోమన, తెనాలిరామలింగకవి, భాస్కరుడు, చక్రపాణి రంగనాథుడు, పింగళి సూరన ప్రభృతుల రచనలు ఈ సరంపరలో పేర్కొనదగినవి.

పరిశోధకులు ఈ పద్యాలను పరంపరగా ఉదాహరించటంతో తృప్తి పడరాదు. ఉదాహృత పద్యాలకు వివరణాత్మకభాగం చేర్చటం, అన్ని విశేషాలు తెలిసినంత వరకు చర్చించి పరిశీలించటం చాల అవసరం. శ్రీహరిగారు ఈ అవసరాన్ని గుర్తించి అలబ్ధకావ్యాలను గూర్చి కొన్ని విశేషాలు తెలిసినంత వరకు వివరించినారు. ప్రాచీన సాహిత్యమంటే — మూతి విరుపు, ఛాందస దృక్పథం, వివరీత అవాంఛనీయ అభిప్రాయ ప్రకటనలు ప్రబలంగా ఉన్న దశలో అలబ్ధకావ్యములను గూర్చి సరియైన అవగాహన, సముచిత సానుభూతి కలిగించే అవసరం ఎంతైనా ఉన్నది. శ్రీహరిగారీ లక్ష్యాన్ని సాధించుటకు కొంతవరకు ప్రయత్నించినారు.

నేడు తెలుగులో పరిశోధనము విస్తృత పరిధిలో నూత్నాంశములపై కేంద్రీకృతమై నూత్నరంగములకు పయనిస్తున్నది. ప్రాచీన అలబ్ధ కావ్య ముల గోడుపట్టించుకొనని దశలో శ్రీహరి గారి 'అలబ్ధకావ్యపద్యముక్తావళి' ముందుచూపుతో పాటు వెనుక చూపును కలిగించి ప్రాచీన సాహిత్య సంపదను విస్మరించరాదని హెచ్చరించుచున్నది. పరిశోధకులకు ఆసక్తిని కలిగిస్తున్నది.

ఇటువంటి ఉత్తమ గ్రంథాన్ని పరిశోధనలో ప్రగతి పథానికి దర్శికగా సాహిత్య లోకానికి అందిం-సందులకు మిత్రులు శ్రీహరిగారిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను.

# అభినందన

డా. జి. ఎన్. రెడ్డి
ఆచార్యులు, తెలుగుశాఖ

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయము
తిరుపతి

ప్రాచీన తెలుగు సాహిత్య గ్రంథ రాశికి సంబంధించి గుర్తుంచుకో వలసిన ముఖ్యవిషయం గ్రంథ నష్టం. నన్నయకు పూర్వం గ్రంథరచన జరిగి వుండాలి. ఆ గ్రంథాలు ఏకారణాలవల్లనో నష్టమై పోయినాయి. నిజానికి తెలుగు సాహిత్య చరిత్ర నష్టచరిత్రతో ప్రారంభమౌతుంది. నన్నయ తర్వాత వెలసిన ప్రాచీన కావ్యరాశిలో కూడా లభ్యభాగం, నష్టభాగం సమ భాగాల్లో వున్నాయి. నష్ట భాగం సగానికి మించే వుంటుందన్నా కాదని చెప్పలేం. అంటే ప్రాచీన తెలుగు కావ్యాల్లో మనకు లభించినది సగమే. మిగిలిన సగం అలభ్యం. తెలుగు సాహిత్యానికి నష్టజాతకం వుండడం తెలుగు జాతి దురదృష్టం.

తెలుగు సాహిత్యంలో లభ్యమైన సగ భాగంలో ముద్రణ భాగ్యానికి నోచుకొన్నది అందులో సగమే. మిగిలిన సగం అముద్రితం. తాళపత్ర భాండాగారాల్లో సామాన్యుల అందుబాటుకు దూరంగా అనేక రచనలు ఈనాటికీ వెలుగుచూడకుండా వుండడం కూడా మన దురదృష్టమే.

తెలుగు తాళపత్ర గ్రంథ సేకరణ కూడా అరగొరగానే జరిగింది. శ్రమపడి సేకరిస్తే అలభ్యాలు అనుకొంటున్న ప్రాచీన కావ్యాలు కూడా కొన్ని దొరకవచ్చు. అలక్ష్యం చేస్తే ఉన్నవికూడా పోతాయి.

పరిశోధన దృష్టితో చూస్తే తెలుగులోని అలభ్య గ్రంథాల్ని గురించి ఒక మంచి సిద్ధాంత గ్రంథం వ్రాయడానికి తగినంత విషయసామగ్రి వుంది. ఇది వ్యయప్రయాసలతో కూడిన పని. అందువల్ల ఇట్టి పరిశోధన పరిశోధకులకు ఆకర్షణీయం కాదు. అయినా అట్టి పరిశోధనకు డిగ్రీ దృష్టితో

కాకుండ, కేవలం సాహిత్య సేవా భావంతో నాంది పలికిన గట్టి పరిశోధకులు డా॥శ్రీహరి,వారు మన కందించిన 'అలబ్ధకావ్యపద్యముక్తావళి' ఒక అపూర్వమైన సంపాదన. వ్యయప్రయాసల కోర్చి, బహుగ్రంథ పఠన పరిశీలనము పాటించి, అముద్రిత గ్రంథాలనేకం గవేషించి, ఈ గ్రంథాన్ని ప్రకటించిన డా॥ శ్రీహరి అన్నివిధాలా అభినందనీయులు.

ప్రాచీనకాలంలో వెలసిన సకలనీతిసమ్మతం వంటి సంకలన గ్రంథాల వల్ల, లాక్షణికులు తమ లక్షణ గ్రంథాల్లో వుదాహరించిన పద్యాల వల్ల, స్వీయ గ్రంథావతారికల్లో కవులు పేర్కొన్న తమ ఇతరరచనలవల్ల, పూర్వ కవి స్తుతిలో పూర్వకవికృతాలుగా పేర్కొన్న గ్రంథాలవల్ల, అముద్రితంగా తాళపత్ర భాండాగారాల్లో మూల్గుతున్న కృతులవల్ల అలభ్యమైన తెలుగు సాహిత్యరాశి ఎంతటిదో మనకు ప్రత్యక్షమౌతుంది. వీటిలో లక్షణ కర్తలు ఉదాహరించిన గ్రంథాలు ప్రామాణికమైనవనీ, అవి ఆనాడు పండితాదరణ పొందినవనీ భావించడం అసమంజసం కాదు. ఆ విధంగా లక్షణ గ్రంథాల్లో ప్రస్తావింపబడి, అలభ్యాలుగా వున్న పందకు మించిన ప్రాచీన గ్రంథాల నుండి డా॥ శ్రీహరి సేకరించి కూర్చిన 'పద్యముక్తావళి' ఇది. యతిప్రాసాది ఛందో విశేషాల ప్రదర్శనకో, పద ప్రయోగ విశేషతను చాటడానికో పూర్వ లాక్షణికులు, తమ పూర్వుల, సమకాలికుల కావ్యాలనుండి ఏరుకొన్న పద్యాలివి.

అందువల్ల ఈ పద్యాలన్నీ ఒక దృష్టికి విలక్షణమైనవి, ప్రత్యేకమైనవి. లాక్షణిక దృష్టిగల పండితులకే కాకుండ, చారిత్రక దృష్టిగల సాహిత్య విమర్శకులకు కూడా ఉపయోగపడే కూర్పు ఈ గ్రంథం. మన చరిత్రకారులు, తెలుగు సాహిత్య చరిత్రలో చేర్చుకోదగిన అనేక చారిత్రకాంశాలకు ఈ గ్రంథం ఆకరమౌతుందనడం అతిశయోక్తి కాదు. తెలుగులోని [illegible]
పరిశోధనకు ఈ "అలభ్యకావ్యపద్యము
ఒక అపూర్వ ప్రయత్నాన్ని, విశిష్ట
డా॥ శ్రీహరి, సాహిత్యప్రియు

డా. యస్. వి. జోగారావు
ఆచార్యులు, తెలుగుశాఖ

ఆంధ్ర విశ్వవిద్యాలయమ
విశాఖపట్టణం

# సహృదయ భూమిక

ఎంత తిండిపోతుకైనా ఎన్నాళ్ళకోగాని ఒక మంచి విందీ సం దొరుకదు. రాజుగారి కెందరు రాణులున్నా అందులో ఏ ఒకతుకో పతివ్రత కవితా రసికుల కా విధముగా ప్రాప్తించిన దిటీవల ఈ "అలబ్ధకావ్యపద ముక్తావళి."

ఇది యొక నష్టద్రవ్యప్రాప్తి. పొలికలనిలో క్షతగాత్రులైన వీరు ఒక తలో మొండెమో కన్నో ముక్కో కాలో కేలో ఏది దొరకినను ఏరుకొ ఒక వంక ఏడ్పు ముంచెత్తుకొని వచ్చుచున్నను వేరొకవంక ఎంతో సంతృ నందు ఆప్తబంధువు వలె అలబ్ధ పూర్వకావ్యములనుండి చెదురుమదురు లక్షణ గ్రంథాదులలో మాత్రము ఊపిరి నిలుపుకుంటున్న పద్యశకలము సేకరించి యొకమహాగ్రంథమును పరిథవించినారు మన శ్రీహరిగారు. బిరుదు సార్థకము చేసుకొన్నారు. ఇదియొక సాహిత్య వీరవ్రతము. మధుక నిర్మాణ మహాభినివేశము. ప్రతిఘట్టమునకును ముందు మోతాదుగ ద్ఘాతము, ఎక్కడికక్కడ అవసరమగు అధోజ్ఞాపికలు. గ్రంథాంతమున రాదిగ ఉదాహృత కావ్యసూచి, కావ్యకర్తృసూచి, పద్యానుక్రమణిక, యుక్త గ్రంథసూచి ఉట్టంకింపబడి గ్రంథమంతయు సమ్యక్పరిణాళిక రూపొందింపబడినది. ఈ గ్రంథమును చూచుటతోడనే భాస నాటక ప్రతిమాగృహమున తాతముత్తాతల చిత్తరువులను చూచి బిత్తరపో తుని చిత్తవృత్తి నన్నావహించినది. ఇది నా అనుభూతి.

[illegible]చి రెండు ముడిముక్కలు. మురారివలె గురుకు కొన్ని దొరకవచ్చు. అలస్యం చేస్తే ఉన్నా[illegible]డు శ్రీహరి. గీర్వాణాంధ్ర శబ్దశా నే చదువుల తల్లి కడకంటి తళు

పరిశోధన దృష్టితో చూస్తే తెలుగులోని అల[illegible]వాఙ్మయ వైఖరీ మాన్యు ఒక మంచి సిద్ధాంత గ్రంథం వ్రాయడానికి తగినంత [illegible] క్షోదక్షమముగా కనిపి ఇది వ్యయప్రయాసలతో కూడిన పని. అందువల్ల [illegible]ులు ఇప్పటికే వెలయిం శోధకులకు ఆకర్షణీయం కాదు. అయినా అట్టి పరిశోధన[illegible]యనకు బంధుర భవిత

డా. తూమాటి దొణప్ప
ఆచార్యులు, తెలుగుశాఖ

నాగార్జున విశ్వవిద్యాలయము
గుంటూరు

# పులుగడుగు

తెలుగునాటి వర్ధమాన పరిశోధకులు చాలమందిలో అయితే తటపటాయింపో, కాకపోతే దబాయింపో కొట్టవచ్చినట్లు గోచరించే గుణాలు. వ్యుత్పన్నుడూ, ప్రతిభా సంపన్నుడూ అయిన డాక్టర్ రవ్వా శ్రీహరి యీరెండింటికీ బహుదూరం. ఆయన నిజంగా ఒక రవ్వ ; వినయసుందరమయిన ప్రవృత్తి, వివేకపరిపాకంతో కూడిన వ్యుత్పత్తి శ్రీహరి విశిష్టతలు.

ముద్రితాముద్రితలక్షణ గ్రంథరాశిని శోధించి, కాశీదశసంపుటాలను గాలించి, పూర్వపరిశోధకుల ఉట్టంకింపులను అనుశీలించి సోహరించిన కావ్యపద్యముక్తావళి డా. శ్రీహరి సంతరించిన యీ 'అలబ్ధకావ్యపద్యముక్తావళి' ఆయా ఖండికల ముందు కూర్చిన లఘువివరణలు ఆకరాల అనుపానులను అనువర్ణించే అదనపు మెరుగులు. పాఠకులకూ, పరిశోధకులకూ ఇది ముట్టినముత్యం.

—తూమాటి దొణప్ప

డా. కే. వి. రామకోటిశాస్త్రి
ఆచార్యులు, తెలుగుశాఖ

కాకతీయ విశ్వవిద్యాలయము
వరంగల్లు

శ్రీహరిగారూ

ఇంతవరకూ లభించని తెలుగు కావ్య ప్రబంధాల్లోవిగా అక్కడక్కడ లభించిన పద్యాలను సంపాదించి మీరు తయారు చేసిన ఈ అలభ్యకావ్య పద్యముక్తావళి అనేది చాలా విలక్షణమైన గ్రంథం. అరవై రెండు మంది కవుల నూటనాలుగు కృతుల నుండి నాలుగైదు వందల పద్యాలకు తక్కువ కాకుండా సంపాదించటంలో మీరు పడ్డ శ్రమ దొడ్డది. మీ ఈ పుస్తకం చూస్తుంటే వేటూరి ప్రభాకరశాస్త్రిగారూ, దీపాల పిచ్చయ్య శాస్త్రిగారూ గుర్తు వస్తున్నారు. మీరీ సందర్భంగా ఎన్నో ముద్రితాముద్రిత లక్షణ గ్రంథాలు చాటు పద్యపుస్తకాలూ, కావ్యసంకలనాలూ, విశేష సంచికలూ, కవి చరిత్రలూ పరిశీలించి వుంటారు. మీ శ్రమను ఉపయోగించుకొంటూ తెలుగు పద్య కావ్యరచనా పరిణామ విశేషాలనూ, అందులో ప్రతిఫలించిన తెలుగు వారి జీవితఆలోచనా సంబంధ విశేషాలనూ వివరించి చెప్పే తరువాతపనికూ కొనసాగగలదని ఆశిస్తున్నాను, మరొకసారి మిమ్మల్ని అభినందిస్తున్నాను.

మీ
రామకోటిశాస్త్రి

డా. కొత్తపల్లి వీరభద్రరావు
ఆచార్యులు, తెలుగుశాఖ

హైదరాబాదు కేంద్రవిశ్వవిద్యాలయం
హైదరాబాదు

# సంభావనం

విద్వదౌషధమైన నైషధంలో శ్రీహర్ష మహాకవి నలచక్రవర్తి గుణకీర్తనం చేస్తూ ఆయన అధీతి బోధాచరణ ప్రచారణలద్వారా చతుర్దశ విద్యలకు చతుర్దశత్వాన్ని కల్పించాడని వర్ణించాడు. డాక్టర్ రవ్వా శ్రీహరి గారు—చతుర్దశ విద్యల సంగతి నాకనుభూతమైన విషయంగాని—వ్యాకరణాద్యనేకశాస్త్రాలకు చతుర్దశత్వాన్ని కల్పించారనే విషయం ప్రత్యక్షంగా తెలిసిందే. విశ్వవిద్యాలయాధ్యాపకులుగా సుప్రసిద్ధులైన శ్రీహరిగారు తమ సుగుణసుగంధాన్ని మేళవించి పద్యామోదాన్ని పొంది "ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః" అనే ఆర్యోక్తిని పరిహరించి తమ రచనాగ్రినర్తకి అయిన విద్యా సంపత్తితో చతుర్ముఖుణ్ణి సుముఖుణ్ణి చేసుకొన్నారు. ఇటువంటి వారి పరిశోధన లబ్ధమే ఈ "ఆంధ్రకావ్య పద్యముక్తావళి".

ఈ గ్రంథంలోని పద్యాలు కోకిలకూజితాలు. కోకిల కూత వినబడుతుంది గాని ప్రయత్నపూర్వకంగా పరిశీలిస్తేనేగాని అది కనబడదు. ఆ ప్రయత్నం చెయ్యలేక కూత మాత్రం విని ఆనందించే అలసుల మాదిరిగా కాక, ప్రయత్నపూర్వకంగా ఆ కవికోకిలలను పట్టుకొని మన ముందుంచారు శ్రీహరిగారు. ఈ కవులలో మనకు తెలిసిన వారు చాలామంది ఉన్నారు తెలియని వారూ ఉన్నారు. కొన్ని రచనలతో మనకు పరిచయమున్నా అవి ఫలానా వారివని తెలియదు. కొందరి విషయంలో సంశయాలున్నాయి. నేటికీ లభ్యంగాని, ఇంచుమించు, నూరు కావ్యాల పద్యాలు ఈ సంకలనంలో ఉన్నాయి. ఇవన్నీ ఎక్కడ ఉన్నాయో తెలుసుకోవడం మొదటి కష్టం. తెలుసుకొన్న తరువాత వాటిని సేకరించడం రెండో కష్టం సేకరించిన తరువాత అవి ఎవరివో నిర్ణయించడం మూడో కష్టం. ఇంక నాలుగో కష్టం ఆయా కవుల చరిత్రను వ్రాస్తూ "శీర్షిక" లకు వివరణ వ్రాయడం. ఈవిధంగా, ఇక్కడ కూడా నాలుగు దశలలో ఉన్న కష్టాల్ని అధిగమించి పండిత విమర్శకులకు, సహృదయ

పాఠకులకు పనికివచ్చే ఆనందాన్ని ఇచ్చే ''అలబ్ధకావ్య పద్యముక్తావళి''ని మనకు లభింపజేసిన శ్రీహరి గారు మన కృతజ్ఞతలకు సర్వవిధాల పాత్రులు.

పూర్వకవుల రచనల నుద్ధరించాలి అనే సంకల్పం, ఆయా రచనల క్రింద లఘూపోద్ఘాతాలు, అధోజ్ఞాపికలు, గ్రంథాంతంలో అకారాదిగ ఉదాహృత కావ్యాల సూచి, కావ్యకర్తృ సూచి, పద్యానుక్రమణిక, ఉపయుక్త గ్రంథ సూచి అనే వాటిని పరిశీలిస్తే శ్రీహరిగారు పాతపద్ధతిలో చదువుకొన్న కొత్త పండితులనీ ''కొత్తపాతల మేలుకలయిక''గా ఈ సంకలనాన్ని సంతరించారని తెలియడం లేదూ!

తెలుగులో అలబ్ధమైన సాహిత్యాన్ని గురించీ, సంకలన సాహిత్య ప్రయోజనాన్ని గురించీ వీరు వ్రాసిన 'తెలివిడి'కి 'పవ్వళం' అని పేరు పెట్టడం, కీర్తిశేషులైన శ్రీ నిడుదవోలు వారు తమ ''ప్రబంధమణి భూషణ'' పీఠికలో సూచించిన సూచన తమ ప్రయత్నానికి ప్రేరకమని వ్రాయడం శ్రీహరిగారి పాండిత్యాన్ని గురించీ, సుగుణ సంపత్తిని గురించీ నేను వ్రాసిన వాక్యాలు అక్షరాలా నిజం అని రుజువు చేస్తున్నాయా? లేదా?

ఈ గ్రంథానికి వచ్చే—తప్పక వస్తుంది-ద్వితీయ ముద్రణం, ప్రథమ ముద్రణం తరువాత లభించిన - శ్రీహరిగారు ప్రయత్నిస్తూనే ఉంటారు గనుక, తప్పక లభిస్తాయి - పద్యాలతో ఇంకా సంపూర్ణంగా ఉంటుందని విశ్వసిస్తున్నాను.

''క్రియాసిద్ధిః సత్త్వే భవతి''

—కొత్తపల్లి వీరభద్రరావు

Dr. S. Laxmanamurthy
Professor & Head

Department of English
Kakateeya University
Warangal

Dr. Srihari has made a significant contribution to Telugu research scholarship by this *Alabdha Kavya Padya Muktavali* which answers long-felt need in providing a large number of *Padyas* for ready reference The *Padyas* have been gathered with care from various works on Telugu prosody. The writers on prosody often illustrate a technical point by citing a few references from the poets of established reputation for flawless erudition. Over the years, many of their works have been lost, and we get a glimpse of their art in the *Padyas* quoted by the writers on prosody or grammar. They have selected them guided by their relevance to the subject under discussion, and not for their poetic excellence. Yet some of the quoted *Padyas* exemplify subtle turns of expression - *Chamatkara*. Therefore *Alabdha Kavya Padya Muktavali* offers a rich fare for those who enjoy Telugu poetry in *Padya* form.

Many years ago Professor Nidadavolu Venkata Rao, the doyen of Telugu research scholars urged the need of an anthology of this nature in his preface to *Prabandha Mani Bhushanamu*. Dr Srihari has now done the job with competence

Dr. Srihari has tried to present here the verses quoted from the *Kavyas* not yet found. He has left out those which were already quoted in *Prabandha Ratnavali*. Dr. Srihari can perhaps claim with some justice that he is the first to attempt an anthology based chiefly on the published as well as the unpublished works of prosody like *Andhraprayoga Ratnakaramu*.

This work has entailed a great deal of labour and careful study of manuscript material lodged in various libraries of Andhrapradesh and Tamilnadu

Dr. Srihari has made the anthology valuable by providing the sources for further reference and research. The work Would get added importance with a brief discussion of the technical points for which the 'Lakshna Karas' have quoted these verses in their works Dr. Srihari may consider the suggestion while revising the work for the next edition.

I thank Dr. Srihari for giving me the privilege to introduce the useful anthology.

-S. LAXMANA MURTHY

# ప్రవేశం

తెలుగుసాహిత్యంలో మనకు నేటికీ లభ్యంకాని ప్రాచీనకావ్యాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. లక్షణగ్రంథాలు, సంకలనగ్రంథాలు, కావ్యావతారికలు—వీటి పుణ్యమా అని మనం అలభ్యమైన ప్రాచీనకావ్యవాఙ్మయాన్ని గురించి కొంతైనా తెలుసుకోగలుగుతున్నాం. తెలుగుసాహిత్యంలో వందల కొద్ది ప్రాచీనకావ్యాలు మన కందకుండా నశించిపోయినాయనే విషయం లక్షణగ్రంథాదులవల్ల తెలిసినప్పుడు తెలుగువాళ్ళు ఇంత నష్టజాతకులా అని బాధ కలుగుతుంది. ఒకవిధంగా ప్రస్తుతం మనకు లభ్యమౌతున్న ప్రాచీన వాఙ్మయం ఎంత ఉంటుందో అలబ్ధమైన కావ్యవాఙ్మయం కూడా అంత ఉంటుందని చెప్పటం సత్యదూరం కాదేమో! తెలుగులోని అలబ్ధసాహిత్యాన్ని గురించి కొంత పరిశీలిద్దాం.

ఈ సాహిత్యాన్ని గురించి తెలుసుకోవటానికి మనకు ముఖ్యంగా క్రింద పేర్కొన్న మూడు ఆధారాలు కనిపిస్తున్నాయి.

1. కావ్యావతారికలు.
2. ఛందోవ్యాకరణగ్రంథాలు.
3. సంకలనగ్రంథాలు.

**అవతారికలు:_**

ప్రాచీనకవులను గురించీ, ప్రాచీనకావ్యాలను గురించీ అనేక విషయాలు అవతారికలవల్ల తెలుస్తున్నాయి. సంస్కృత సాహిత్యంలో అతివిరళంగా కానవచ్చే ఈ అవతారికాపద్ధతి తెలుగు సాహిత్యంలో ఒక విశిష్టమైన పద్ధతిగా భావించవచ్చు. సాహిత్యచరిత్రకు అవతారికల ఉపయోగం అనల్పం. ఆయా కవుల కావ్యావతారికలవల్ల తెలియవచ్చే అలబ్ధసాహిత్యాన్ని స్థాలీపులాకంగా పరిశీలిద్దాం.

నన్నయ ఆంధ్రమహాభారతారంభంలో రాజరాజనరేంద్రుని సభాభవనాన్ని వర్ణిస్తూ ఆ సభలో 'మృదుమధుర రసభాసురనవార్థ

వచనరచనావిశారదులైన మహాకవు'లున్నట్లుగా వర్ణించినాడు.[1] అంతేకాక 'సారమతింగవీంద్రులు' అన్న పద్యంలో [2] కవీంద్రులు తన వివిధకవితా గుణాలను ఆదరించినట్లుగా పేర్కొన్నాడు. ఈ మహాకవుల్లో ఒక్క నారాయణ భట్టుపేరు తప్ప మరో కవిపేరు గానీ, ఆ కవి రచించిన కావ్యంకానీ మనకు తెలియరావటంలేదు. 'నారాయణభట్టు' కూడా పేరుకు మాత్రమే కాని ఆయన కావ్యాలు మాత్రం తెలియవు.

తిక్కన తన తాతయైన మంత్రిభాస్కరుణ్ణి సారకవితాభిరాముడని నిర్వచనోత్తరరామాయణంలో గొప్పగా ప్రశంసించినాడు.[3] ఈ సారకవితాభిరాముని కృతులు ఏమైనట్లు? భాస్కరరామాయణాన్ని మంత్రిభాస్కరుని రచనగా అంగీకరించినా విద్యాకేళిలో కమలాననతుల్యులని కేతన పేర్కొన్న మంత్రిభాస్కరుని కుమారుల కృతులు అలభ్యమే కదా!

కేతన తన దశకుమారచరిత్రలో తిక్కనను ప్రశంసిస్తూ అతడు 'లలితనానాకావ్యములు' చెప్పినట్లుగ పేర్కొన్నాడు.[4] ఆంధ్రమహాభారతం, నిర్వచనోత్తరరామాయణం—ఈ రెండే తిక్కన కృతుల్లో నేడు లభ్యమయ్యేవి వీటితోపాటు తిక్కన మరికొన్ని లలితకావ్యాలు తప్పక చెప్పిఉంటాడు. వాటిలో ఒక్క విజయసేనం తప్ప తిక్కన కావ్యాల వివరాలు తెలియవు

ఎఱ్ఱన నృసింహపురాణంలో తన తండ్రిని "అప్రతిమాద్భుతోభయ కవిత్వ ప్రౌఢశబ్దార్థయోగాజ్ఞాసిద్ధిఘను"డని ప్రశంసిస్తూ అతడు "విజ్ఞానాత్మక వాఙ్మయంబున ముదావేశోజ్జ్వలుండయ్యెడున్"[5] అని కోరుకుంటాడు. దీన్నిబట్టి ఎఱ్ఱన తండ్రి సంస్కృతాంధ్రాల్లో గొప్పకవి అని తెలిసినా ఆయన రచించిన కావ్యాలపేర్లు మాత్రం మనకు తెలియవు.

వేమారెడ్డి ఎఱ్ఱనచే చేతోమోదమెలర్పగా రామకథ చెప్పించి అత్యుత్తమఖ్యాతిని పొందినట్లుగా హరివంశావతారిక తెలుపుతుంది.[6] చెదలువాడ మల్లన "వల్మీకభవువచో వైఖరి రామాయణంబు నాంధ్రప్రబంధంబుసేసె"—అని తన విప్రనారాయణచరిత్రావతారికలో ఎఱ్ఱన రామాయణాన్ని రచిం

1. 1—1—8. 2. 1—1—?6. 8. 1—12.
4. 1—93 5. 1—25 6. పూర్వ. 1—39;

నట్లుగా పేర్కొన్నాడు [7] లక్షణగ్రంథాలవల్ల ఎట్టిన రామాయణంలోని కొన్ని పద్యాలు లభ్యమౌతున్నా పూర్తికావ్యం మాత్రం అలభ్యమే.

శ్రీనాథుడు భీమఖండంలోనూ, కాశీఖండంలోనూ తన తాతయైన కమలనాథామాత్యుణ్ణి ఈ క్రింది విధంగా స్తుతించినాడు.

కనకక్ష్మాధరు వారిధితటీక్రాల్పట్టణాధీశ్వరున్
ఘనువిన్ బద్మపురాణ సంగ్రహకళాకావ్యప్రబంధాధిపున్
వినమత్కాకతి సార్వభౌముఁ గవితావిద్యాధరున్ గొల్తు నా
యనుగుందాతఁ బ్రదాత శ్రీకమలనాథామాత్య చూడామణిన్
(భీమఖండం 1–10)

మత్పితామహుఁ గవితాపితామహునిఁ దలఁతుఁ
గలితకావ్యకళాలాభుఁ గమలనాభుఁ
జంద్రచందనమందార పద్మకీర్తి
వరపసాహిత్యసామ్రాజ్యచక్రవర్తి (కాశీఖండం 1–20)

శ్రీనాథుడింత గొప్పగా స్తుతించిన కవితావిద్యాధరుడూ, కవితా పితామహుడూ, వరపసాహిత్యసామ్రాజ్యచక్రవర్తి ఐన కమలనాథామాత్యుడు గొప్ప సాహిత్యస్రష్టయై ఉండవలె. ఆయన పద్మపురాణసంగ్రహంకానీ ఇతరకావ్యాలు కానీ మనకు లభించలేదు.

శ్రీగిరికవి నవనాథచరిత్రను పద్యరూపంలో రచించినట్లుగ గౌరన తన ద్విపదనవనాథచరిత్రలో ఈవిధంగా తెలిపినాడు

"అవిరళయోగ విద్యాధికులైన, నవనాథవరుల పుణ్యవర్తనలు
వరఁగశ్రీగిరికవి పద్యబంధముల, విరచించినాడది ద్విపదకావ్యమునఁ
జెప్పింపవలయుఁ బ్రసిద్ధి పెంపలర"

శ్రీగిరికవి రచించిన ఈ పద్యనవనాథచరిత్ర ఇప్పుడు కానరాదు.

7. 1–13:

అనంతామాత్యుని మునిమనుమడైన బయ్యన తిక్కనచే "భవ్యభారతి" అనిపించుకున్న కవిరత్నమని భోజరాజీయంవల్ల తెలుస్తుంది.[8] తిక్కన యంతటి మహాకవిప్రశంసకు పాత్రుడైన బయ్యన సామాన్యకవియై ఉండడు. భవ్యభారతీవిలాసాన్ని చిందించే అనేకకావ్యాలు వ్రాసిఉంటాడు వాటి వివరాలేవీ మనకు తెలియవు.

జక్కన విక్రమార్కచరిత్రలో తన తాతయైన పెద్దయామాత్యుడు తజ్జ్ఞులు మెచ్చేట్లుగా తెలుగులో ప్రబంధం చెప్పినట్లుగానే కాకుండా అతని సర్వతోముఖమైన కవితావైభవాన్ని సీసమాలికలో ఎంతో గొప్పగా ప్రశంసించినాడు.[9] ఈ సీసమాలికవల్ల పెద్దయామాత్యుని కవితావైభవం తెలిసి మనకు సంతోషం కలిగినా ఆయన రచించిన ప్రబంధం పేరైనా కనీసం మనకు తెలియరాలేదే అన్న బాధ మాత్రం తప్పదు కదా!

పినవీరభద్రుడు—తన తాత, తండ్రి, సోదరుడు, తాను-గొప్పకవులమని జైమిని భారతంలోని క్రింది పద్యంలో పేర్కొన్నాడు.

"తాతయుఁ దండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువన భాసురకృతి ని
ర్మాతలు, పిల్లల మఱ్ఱిని
ఖ్యాతునిఁ బినవీరుఁ బోలఁగలరే సుకవుల్"

గోపరాజుకూడా పూర్వకవిస్తుతిలో పిల్లలమఱ్ఱివంశీయుడైన పెద్దిరాజును స్తుతించినాడు.[10] భువనభాసురకృతినిర్మాతలుగా పినవీరుడు పేర్కొన్న అతని తాతా, తండ్రీ, అన్నా వ్రాసిన కావ్యాలు మనకీనాడు లభ్యం కావు.

పిల్లలమఱ్ఱి పినవీరన వంశీయుడైన పెనుమల్లి సోమనామాత్యుడు రచించిన సీమంతినీపరిణయంలో పినవీరన ప్రశంస ఉన్న ఈ క్రింది పద్యం కానవస్తుంది.

---

8. 1–24; 9. 1–120; 10. సిం. ద్వా. i – 12.

అవతారదర్పణంబన్న కావ్యముఁ జేసె
నారూఢి నారదీయంబు పలికె
మహనీయమగు మాఘమాహాత్మ్యము రచించె
శాకుంతలము జెప్పె సరసఫణితి
నొక్క రాతిరియందు నొనరించె మధురవా
క్ప్రౌఢిచే జైమినిభారతంబు
లలితమౌ మానసోల్లాససారంబన్న
కబ్బంబు భాషించె నబ్బురముగ

మఱియు బహురూపకావ్య నిర్మాణ నిపుణుఁ
డగుచు నుతిగాంచె సకలదిగంతరములఁ
గుకవిజనగర్వతిమిరసంకోచకృత్ప్రౌ
భాతరవియైన పినవీరభద్రసుకవి. (1—45)

పై పద్యంవల్ల పినవీరన అవతారదర్పణం మొదలైన ఐదు కావ్యాలతోపాటు ఇంకెన్నో కావ్యాలు రచించినట్లుగ తెలుస్తుంది ఆ తక్కినకావ్యాల పేర్లేమిటోకూడా మనకు తెలియదు. తెలిసిన కావ్యాల్లోనూ అవతారదర్పణం, నారదీయం, మాఘమాహాత్మ్యం, మానసోల్లాసం అనేవి మనకు లభ్యం కాలేదు.

రామరాజభూషణుడు తన వసుచరిత్రలో తాను బహుసంస్కృతాంధ్ర కృతులతో రామరాయలను మెప్పించినట్లుగ తిరుమలరాయలముఖంగా తెలిపినాడు.[11] వసుచరిత్ర, కావ్యాలంకార సంగ్రహం, హరిశ్చంద్రోపాఖ్యానం తప్ప ఈతని తక్కిన సంస్కృతాంధ్రకృతులేవీ మనకు లభ్యంకాలేదు.

గోపరాజు తన ముత్తాతయైన సత్యనారయను ఆంధ్రకవితాపితామహ బిరుదాంచితుడనీ, రామాయణకృతికర్తయనీ సింహాసన ద్వాత్రింశికావతారికలో ప్రశంసించినాడు.[12] ఈతని రామాయణం నామమాత్రంగా మిగిలిపోయింది.

---

11. 1—17; 12 1—49

తెనాలిరామభద్రకవి తన ఇందుమతీ పరిణయంలో కృతిపతియైన పాలచూరి కృష్ణరాయల ముఖంగా తన పూర్వులను ప్రశంసిస్తూ చెప్పిన ఈ క్రింది పద్యం కనిపిస్తుంది.

ప్రౌఢి మీ పెదతాత పాండురంగాది స
    త్కృతులఁజేసెను రామకృష్ణసుకవి
యనుజుఁడన్నప్ప మీ పినతాత రచియించెఁ
    బటుఁగ సుదక్షిణాపరిణయంబు
మీ తాత శ్రీగిరి చాతురీవిఖ్యాతి
    శ్రీశైలమాహాత్మ్యకృతి యొనర్చె
కడిమి మీ తండ్రి యయ్యది రామకృష్ణార్యుఁ
    డవఁ గీర్తిఁగనె సంస్కృతాంధ్రములను
వారలను మించె మీ యన్న వీరరాఘ
వాఖ్యసుకవి సర్వకవితామహత్త్వమునను
విన్ననూచాన సంతాను నెన్నఁదరమె
ప్రాజ్ఞహృదయాబ్జరవి రామభద్రసుకవి.[13]

పై పద్యంవల్ల రామభద్రకవికి పినతాతయైన తెనాలి అన్నప్ప సుదక్షిణాపరిణయాన్నీ, తాతయైన తెనాలి శ్రీగిరికవి శ్రీశైలమాహాత్మ్యాన్నీ రచించినట్లుగా తెలుస్తున్నా ఈ కావ్యాలు మాత్రం మనకు లభ్యంకాలేదు. అంతేకాక రామభద్రుని తండ్రి సంస్కృతాంధ్రాల్లో కీర్తి గన్నవాడనీ, అన్నయైన వీరరాఘవకవి కవితామహత్త్వంలో రామకృష్ణాది కవులను మించిన వాడనీ పై పద్యం తెలుపుతుంది. కాని వాళ్ళు రచించిన కావ్యాలపేర్లైనా మనకు తెలియవు.

పోతన, పింగళి సూరన, శ్రీనాథుడు మొదలైన మహాకవుల చేతనూ, పొత్తపి వెంకటరమణకవి, అప్పకవి మొదలైన లాక్షణికులచేతనూ స్తుతింప

13. 1-22;

ఐడిన వేములవాడ భీమకవి మహాకవుల శ్రేణికి చెందినవాడనటంలో సందేహం లేదు. భీమకవి రాఘవపాండవీయమనే ద్వ్యర్థికావ్యాన్ని రచించినట్లుగా లోకంలో ఉన్న జనశ్రుతిని పింగళి సూరన గ్రంథస్థం చేయటమేకాక కావ్యాన్ని ఎవ్వరూ చూడలేదని కూడా చెప్పినాడు[14]. తెలుగులో ప్రథమద్వ్యర్థి కావ్యమైన భీమన రాఘవపాండవీయం లభించకపోవటం మన దురదృష్టమే. భీమకవి రచించిన నృసింహపురాణ, శతకంధరరామాయణాల్లోనుండి పద్యాలను ఉదాహరించిన లక్షణకారులు రాఘవపాండవీయంలోని ఒక్కపద్యం కూడా ఉదాహరించక పోవటంవల్ల ఆ కావ్యం అతిప్రాచీనకాలంలోనే నష్టమైపోయి ఉంటుందని భావించవచ్చు.

వెదలువాడ మల్లన తన తండ్రియైన లింగనకవి "రాజుల్ మెచ్చగ కావ్యములు చెప్పినకవి" అని విప్రనారాయణ చరిత్రలో పేర్కొన్నాడు.[15] ఈ లింగన రచించిన కావ్యాలు మనకు తెలియవు.

గణనాథుడనే కవి కుతుబ్షాహిరాజుల ఆస్థాన మహాకవీంద్రుడుగావిలసిల్లి నట్లేకాక అతడు సంస్కృతాంధ్రభాషావరకావ్యకల్పన విచక్షణుడనీ, దేవగవీ పయోఝర వద్భృగ్వచనాప్త యశోహారచ్ఛవి యనీ వాసిగాంచినట్లుగ కామినేని మల్లారెడ్డి పద్మపురాణం తెలుపుతుంది.[16] కుతుబ్షాహిరాజుల ఆస్థానంలో ఆస్థానమహాకవీంద్రపదవిని అధిష్ఠించిన గణనాథకవి తెలుగులో గొప్పకావ్యాలే రచించి ఉండవలె. కాని ఈతని ఒక్కకావ్యం పేరైనా మనకు తెలియటం లేదు.

సుప్రసిద్ధకవయిత్రి రంగాజమ్మ తన ఉషాపరిణయంలో "మహనీయ భారతరామాయణ కథా సంగ్రహణవిచక్షణయు''—అని తన్ను గురించి చెప్పుతున్న ఆశ్వాసాంత గద్యంవల్ల ఈమె భారత, భాగవత, రామాయణాలను మూడింటినీ సంగ్రహరూపంలో రచించినట్లు తెలుస్తుంది. కాని ఈమె రచనల్లో ఉషాపరిణయం, మన్నారుదాసవిలాసం తప్ప తక్కిన గ్రంథాలు లభ్యంకాలేదు.

---

14. 1-11 15. 1-20; 16. 1-25,27.

రఘునాథభూపాలుని తెలుగురామాయణాన్ని సంస్కృతీకరించిన మధుర వాణి తన రామాయణంలో ఇట్లా చెప్పుతున్నది.

సర్వోత్తరస్యాదిమసంస్కృతాంధ్ర
ప్రబంధనిర్మాణపచేళిమాని
యశాంసి భూయాంస్యవతారయంతః
సహస్రశః సంతి''

అంతేకాక 'మాధుర్యైకధురంధరాంధ్రకవితానిర్మాణసమ్మాన్య'నని సగర్వంగా చాటుకొన్నది. మధురవాణి సంతరించిన తెనుగుకృతుల పేర్లైనా మనకు తెలియటంలేదు.

తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయంలో ఛందోదర్పణం అనే పేర ఒక ఛందోగ్రంథం ఉన్నది.[17] ఇది అనంతుని పేర ప్రసిద్ధమైన ఛందస్సు కాదు. దీని కర్త ఎవ్వరో తెలియదు. ఈ ఛందఃకర్త అవతారికలో కాకంభట్టును స్తుతిస్తూ ఈ క్రిందిపద్యం చెప్పినాడు.

"ఏ కవి చెప్పె సనేకపుణ్యావల్ప
బంధురసంక్షేపభాగవతము"

కాకంభట్టు చెప్పిన సంక్షేపభాగవతప్రతి ఒక్కటైనా మనకు లభ్యం కాలేదు.

ఈ విధంగా మనం తెలుగుకావ్యావతారికలను పరిశీలించినట్లైతే తెలుగు సాహిత్యంలో నష్టమో, నష్టప్రాయమో ఐన ఎన్నో కావ్యాలను గురించీ, ఎంతోమంది కవులను గురించీ అనేకవిషయాలు తెలుసుకోవటానికి వీలౌతుంది.

---

17. నెం. 718

## ఛందోవ్యాకరణగ్రంథాలు:—

తెలుగులోని అలబ్ధ సాహిత్యాన్ని గురించి తెలుసుకోవటానికి మరో మెరుగైన ఆధారం లక్షణ గ్రంథాలు. ముఖ్యంగా ఛందోవ్యాకరణాలు. యతికో, ప్రాసకో, శబ్దస్వరూపనిర్దేశానికో లాక్షణికులు వివిధ కవుల కావ్యాల నుండి పద్యాలనూ, పద్యభాగాలనూ లక్ష్యాలుగా చూపటం జరుగుతుంది. దీనివల్ల తెలుగు సాహిత్యంలో ఇప్పటికీ లభించని ఎన్నో కావ్యాలను గురించీ, కవులను గురించీ మనం తెలుసుకోగలుగుతున్నాం. లాక్షణికులు ఉదాహరించిన కావ్యాలు సాధారణంగా పండితలోకంలో మంచి పేరున్నకవులు రచించినవే ఐఉండాలి. ఛందోవ్యాకరణాలమూలంగా మాత్రమే తెలియవచ్చిన అలభ్య కావ్యాలు ఎన్నో ఉన్నాయి. వాటిని దిగువ పేర్కొంటాను.

| కావ్యము | కవి |
|---|---|
| ఆదినారాయణచరిత్ర | కవిరాక్షసుడు |
| ఇంద్రవిజయము | నన్నయ |
| కందశతకము | భాస్కరుడు |
| కవులషష్ఠము | నంది మల్లయ, ఘంట సింగన |
| కూర్మపురాణము | మలయమారుతం మల్లన |
| కృష్ణవిలాసము | నాచన సోమన, |
| ,, | పరాతం అప్పన |
| గిరిజాకల్యాణము | పింగళి సూరన |
| చమత్కారరామాయణము | ? |
| చారుదేష్ణచరిత్ర | ? |
| చిత్రశేషభాగవతము | కళాధరకవి |
| జైమిని రామాయణము | ? |
| దశగతులు | భాస్కరుడు |
| పద్మపురాణము | అయ్యలరాజు సింగన |
| పరమభాగవతచరిత్ర | లక్షణకవి అప్పన్న |
| బలరామవిజయము | నంది సింగయ |
| బ్రహ్మాండపురాణము | కవిమాధవుడు |

| | |
|---|---|
| మహాభారతము | ? |
| మిత్రవిందాపరిణయము | చక్రపాణి రంగనాథుడు |
| ముద్రారాక్షసము | ? |
| యథావాల్మీకిరామాయణము | లక్షణకవి అప్పన్న |
| యమకశతకము | గణపవరపు వేంకటకవి |
| యయాతి చరిత్ర | రాయసం దత్తన |
| ,, | సూరపరాజు |
| రాఘవాభ్యుదయము | నన్నయ |
| రామచంద్రాభ్యుదయము | బడబాగ్నిభట్టారకుడు |
| రుక్మాంగదచరిత్ర | చెదలువాడ మల్లన |
| లక్ష్మీనారాయణవిలాసము | కవిరాక్షసుడు |
| వసంతవిలాసము | నాచన సోమన |
| వాణీవిలాసము | ముక్కు తిమ్మన |
| వామనపురాణము | నంది సింగన |
| వాసవాభ్యుదయము | శ్రీనాథుడు |
| విక్రమార్కచరిత్రము | కవిభల్లటుడు |
| విజయవిజయము | చిమ్మపూడి అమరేశ్వరుడు |
| శంతమచరిత్ర | సోమయాజి అనంతయ్య |
| శతపక్షిసంవాదము | క్షేమేంద్రుడు |
| శమంతకమణిచరిత్ర | వణుకూరి గుర్వరాజు |
| శశిబిందుచరిత్ర | చరిగొండ నృసింహకవి |
| శుద్ధాంధ్రరామాయణము | అదిదం బాలభాస్కరకవి |
| శూద్రకరాజచరిత్రము | కవిభల్లటుడు |
| శ్రీరంగమాహాత్మ్యము | తెలుగురాయలు |
| సత్యావధూప్రణయము | అల్లసాని పెద్దన |
| సునందనచరిత్ర | శ్రీనాథుడు |

| | |
|---|---|
| సునందనోపాఖ్యానము | హంకక్కి భాస్కరుడు |
| వ్మరతత్త్వసారము | ? |
| హరవిలాసము | భీమన |
| హరికథాసారము | అల్లసాని పెద్దన |
| హ(రి)రవిలాసము | నాచన సోమన |

ఛందోవ్యాకరణగ్రంథాల్లో పైన పేర్కొన్న కావ్యాలేకాక మరెన్నో అలబ్ధ కావ్యాలు ఉదాహరించబడ్డవి ఐతే అవి మనకు సంకలన గ్రంథాలమూలంగా కూడా తెలియవస్తున్నందున కేవలం లక్షణ గ్రంథాలమూలంగా తెలియవచ్చిన గ్రంథాలను మాత్రమే పైన పేర్కొనటం జరిగింది. లక్షణకారులు వీటిని ఉదాహరించక పోయినట్లైతే ఈ కావ్యాల ఉనికి, మనికి మనకు తెలిసి ఉండేవి కావు. ఈ విధంగా లక్షణకారులు తెలుగు సాహిత్యానికి, తెలుగు సాహిత్య చరిత్రకూ చేసిన ఉపకారం ఎంత దొడ్డదో మనం ఊహించుకోవచ్చు.

సంకలన గ్రంథాలు :-

తెలుగులోని అలబ్ధసాహిత్యాన్ని గురించి తెలుసు కోవటానికి సంకలన గ్రంథాలు ఎంతో సాహాయ్యకారులు. "కవి తనకు పూర్వ మందున్న కవుల కావ్యములనుండి వర్ణనాంశములు గాని, శాస్త్ర విషయములుగాని సేకరించి వానిని వర్గీకరించి ఏకాకారమైన ఒక కృతిగా సమకూర్చు సాహిత్య ప్రక్రియ సంకలన గ్రంథము" —అని నిడుదవోలు వేంకటరావు గారు సంకలన గ్రంథ స్వరూపాన్ని నిర్వచించినారు.[18] తెలుగులో వెలసిన సంకలన గ్రంథాలు పరిమితమే ఐనా వాటిప్రయోజనం మాత్రం అపరిమితం. తెలుగు కవులు ఈ ప్రక్రియను సంస్కృతం నుండే గ్రహించి ఉంటారు. సంస్కృతంలో మనకు ప్రసిద్ధంగా తెలియవస్తున్న కొన్ని సంకలన గ్రంథాలను పేర్కొంటాము.

| | |
|---|---|
| కవీంద్రవచన సముచ్చయము | ? |
| సదుక్తి కర్ణామృతము | శ్రీధరదాసుడు |
| శార్ఙ్గధరపద్ధతి | శార్ఙ్గధరుడు |

18. సకలనీతిసమ్మతం పీఠిక–పుట 3.

| | |
|---|---|
| సుభాషితావళి | వల్లభదేవుడు |
| సుభాషితరత్నసందోహము | అమితగతి |
| సుభాషితరత్నాకరము | మునిదేవాచార్యులు |
| సుభాషితరత్న భాండాగారము | కే.పి. పరబ్ |
| సూక్తిముక్తావళి | జల్హాణుడు |

ప్రాకృతంలో వెలసిన సంకలన గ్రంథాల్లో హాలుని గాథాసప్తశతి, జయవల్లభుని వజ్జాలగ్గం పేర్కొనదగ్గవి. సుత్తనిపాతం అనే గ్రంథం పాళీ భాషలో వెలసిన ప్రాచీన సంకలన గ్రంథం.

తెలుగులో ఈ క్రింద పేర్కొన్న సంకలన గ్రంథాలు లభ్యమౌతున్నాయి.

| | |
|---|---|
| సకలనీతిసమ్మతము | మడికి సింగన |
| ఉదాహరణపద్యములు | ? |
| ప్రబంధరత్నాకరము | పెదపాటి జగ్గన |
| ప్రబంధసారశిరోమణి | ? |
| ప్రబంధమణిభూషణము | ? |
| శ్రీకృష్ణలీలావిలాసము | పూసపాటి కుమారాయ్యతరామరాజు |
| ప్రబంధరత్నావళి | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| వర్ణనరత్నాకరము | దాసరి లక్ష్మణస్వామి |
| శృంగారపద్యావళి | మోదీ జగన్నాథ్ మల్లు |
| ఋతుచక్రము | సమర్థి రంగయ్యసెట్టి |
| భారతసారముక్తావళి | కట్టమంచి సుబ్రహ్మణ్య రెడ్డి |
| భాగవతసారముక్తావళి | ,, |
| శ్రీమదాంధ్రమహాభారత-ధర్మదర్పణము | భాగవతము సీతారామారావు |
| ఆంధ్రకవిరత్నాకరము | భట్టిప్రోలు రామయ్య |
| చాటుపద్యమణిమంజరి | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| చాటుపద్యరత్నాకరము | దీపాల పిచ్చయ్యశాస్త్రి |

పైన పేర్కొన్న సంకలన గ్రంథాల్లో మొదటి ఏడింటిలో మాత్రమే ప్రస్తుతం మనకు లభించని అనేక కావ్యాలకు చెందిన పద్యాలు ఉదాహరింప బడినవి. ఇప్పటికీ లభ్యంకాని తెలుగు కావ్యాలనెన్నింటినో సాహిత్య లోకానికి తెలియజేసిన ఈ సంకలన గ్రంథాలను గురించి తెలుసుకుందాం.

**సకలనీతిసమ్మతము :**— ఇది తెలుగులో సంకలన గ్రంథ ప్రక్రియకు శ్రీకారం చుట్టిన గ్రంథం. పదిహేనవ శతాబ్దికి చెందిన మడికి సింగన దీని కర్త. కవిత్రయ భారతం, నన్నెచోడుని కుమార సంభవం, మంచెన కేయూరబాహు చరిత్ర మొదలైన లభ్య గ్రంథాల్లోవే కాక ఇప్పటికీ లభించని కామందకం, పంచతంత్రి, నీతి భూషణం, నీతి సారం, పురుషార్థసారం, ముద్రామాత్యం, శ్రీగిరీశశతకం, శ్రీరామాయణం, మిత్రనీతులు, నీతి తారా వళి — అనే గ్రంథాల్లోని పద్యాలు కూడా ఇందులో ఉదాహరింపబడ్డవి. రాజ నీతికి సంబంధించిన దాదాపు వేయి పద్యాలు మూడాశ్వాసాల్లో వివిధ విషయాల క్రింద విభజింపబడి ఇది ఒక నీతి పద్య సంకలనంగా విరాజిల్లుతుంది. ఈ సంకలనం మూలంగా ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో నష్టమైన నీతి శాస్త్ర గ్రంథాలెన్నో మనకు తెలుస్తున్నాయి. తెలుగు పరిశోధకులకందరికీ ప్రాతః స్మరణీయులైన మానవల్లి రామకృష్ణ కవిగారు ఈ గ్రంథాన్ని మొట్టమొదట 1923 లో విస్మృతకవుల కృతుల్లో పదో గ్రంథంగా ప్రకటించినారు. దీని కాగితపు ప్రతి అమరచింత సంస్థానాధీశ్వరులైన సీతారామ భూపాలబహద్దర్ గారి నుండి కవిగారికి లభించినదట. 1970లో నిడుదవోలు వారి విపుల పీఠికతో దీనికి రెండో ముద్రణం కూడా వెలువడింది.

**ఉదాహరణ పద్యములు :**— దీని ప్రతి ఒక్కటి ఆంధ్ర సాహిత్య పరిషత్తు (కాకినాడ) వారి గ్రంథాలయంలో ఉన్నది. తుదమొదళ్లు లేకపోవటంవల్ల ఈ గ్రంథ సంధాత పేరుకానీ, అతడీ సంకలనానికి పెట్టిన పేరుకానీ తెలియవు. ఉదాహరణ పద్యాలన్నపేరు గ్రంథాలయంవాళ్లు పెట్టిందే ఈ సంధాత పెద పాటి జగ్గన (క్రీ శ. 1560)కు సమకాలికుడు కావచ్చునని విమర్శకుల అభి ప్రాయం. జగ్గన పదహారో శతాబ్దికి చెందినవాడు. కనుక ఉదాహరణ పద్య సంధాతకూడా ఈ శతాబ్దికి చెందినవాడని చెప్పవచ్చు. ఈ సంధాత తన కాలా నికి ప్రసిద్ధంగా ఉన్న అనేక కావ్యాల్లోని వందలకొద్ది పద్యాలను వివిధ

విషయాలుగా విభజించి ఉదాహరించినాడు. ఈ సంకలనంలో మనకిప్పుడు లభ్యమౌతున్న కవిత్రయ భారతాది గ్రంథాల్లోనుండేకాక లభ్యంకాని అనే ప్రాచీన కావ్యాలనుండి కూడా అనేకపద్యాలు సేకరింపబడినవి. ఈ సంకలన వల్ల తెలియవస్తున్న అలబ్ధకావ్యాలనూ, తత్కర్తలనూ దిగువ పేర్కొంటాను

| | |
|---|---|
| విక్రమసేనము | చిమ్మపూడి అమరేశ్వరుడు |
| కళావతీశతకము | తెల్లపూడి కవనరాజు |
| కాదంబరి | భావకుని కేతన ప్రెగ్గడ |
| కుశలవోపాఖ్యానము | చిరుమూరి గంగరాజు |
| నందన చరిత్ర | గంగరాజు చౌడయ్య |
| విజయసేనము | తిక్కన |
| ప్రద్యుమ్న చరిత్ర | పొన్నాడ పెద్దిరాజు |
| అనిరుద్ధ చరిత్ర | భావన పెమ్మన |
| విష్ణుకథానిధానము | భైతరాజు ముమ్మయ |
| కేదారఖండము | పెదపాటి సోమయ |
| అథర్వణ భారతము | అథర్వణాచార్యుడు |
| అమరుకము | కామకోలను అన్నమరాజు |
| కువలయాశ్వచరితము | కేతన |
| వీరమాహేశ్వరము | నిశ్శంకుని కొమ్మయ |
| బాలభారతము | కాకమాని గంగాధరుడు |
| సౌగంధికాపహరణము | రాయసం గణపయ |
| నాసికేతోపాఖ్యానము | చందలూరి చిక్కయ |
| కాంచీమాహాత్మ్యము | కుడిచెర్ల తిప్పరాజు |
| శివకాంచీమాహాత్మ్యము | రాపరది దేచిరాజు |
| హరిశ్చంద్రకథ | దేవరాజభట్టు |
| శ్రీ విష్ణుపురాణము | పశుపతి నాగనాథుడు |
| జినేంద్రపురాణము | పద్మకవి |
| అష్టమహిషీకల్యాణము | రెడ్డిపల్లె ముత్తమరాజు |
| బృహన్నారదీయము | వాసిరాజు రామయ్య |

| | |
|---|---|
| త్రిపురవిజయము | పోతరాజు వీరయ్య |
| శ్రీరంగమాహాత్మ్యము | చెన్నమల్లు శ్రీగిరన్న |
| ఆదిపురాణము | సర్వదేవుడు |
| విరాటము | " |
| శాకుంతలము | పిడ్డన ప్రెగ్గడ |
| త్రిపురవిజయము | పెదపాటి సోమయ |
| వసంతవిలాసము | నాచన సోమన |
| ఇంద్రసేనము | నన్నయ |
| పురాతనచరిత్రము | ? |
| రంగనాథశతకము | ? |
| రామాః రాజచూడామణి | ? |

పైన పేర్కొన్నవాటిలో మొదటి పది కావ్యాలను పెదపాటి జగ్గన్నకూడా తన ఆంధ్రప్రయోగరత్నాకరంలో పేర్కొన్నాడు. తక్కినవి ఈ గ్రంథసంధాత మాత్రమే ఉదాహరించినట్టివి. అథర్వణభారతం, వసంతవిలాసం, విరాటం— ఈ మూడూ కొన్ని ఛందోగ్రంథాల్లోకూడా ఉదాహరింపబడినవి. ఇక తక్కిన కావ్యాలన్నీ ఈ సంకలన కర్తవల్ల తెలియవచ్చేవే. ఈ విధంగా తెలుగు సాహిత్యచరిత్రకు ఎంతో మేలు చేసిన ఈ గ్రంథ సంధాత పేరు మనకు తెలియక పోయినా ఆయన సంకలనంమాత్రం తెలుగు సాహిత్యచరిత్రకారు లకు చిరస్మరణీయం.

ప్రబంధరత్నాకరము:—ఇది. పదహారో శతాబ్ది చివరిపాదంలో విలసిల్లిన పెద పాటి (రామాప్రెగ్గడ) జగ్గన పూర్వకావ్యాలమండీ, సమకాలిక కావ్యాలమండీ సందలకొద్ది పద్యాలను ఏరి కూర్చిన సంకలనం. మొత్తం ఐదాశ్వాసాలుగాఉన్న ఈ సంకలనంలో ప్రస్తుతం మూడాశ్వాసాలగ్రంథం మాత్రమే తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయంలో ఉన్నది. నగరవర్ణన, స్త్రీవర్ణన, ఋతు వర్ణన మొదలైన వివిధవిషయాలకు చెందిన దాదాపు 78 కావ్యాల్లోని పద్యాలు ఇందులో ఉదాహరింపబడ్డవి. వీటిలో ఉదాహరణపద్యకర్తా, లక్షణకారులూ ఉదాహరించిన కావ్యాలనూ, లక్ష్యమైన కావ్యాలనూ మినహాయిస్తే జగ్గకవి

మాత్రమే ఉదాహరించిన అలబ్ధకావ్యాలు దాదాపు ఇరవైఐదు వరకు ఉంటాయి. అవి ఇవి.

| | |
|---|---|
| సకలపురాణసారము | కూచిరాజు ఎఱ్ఱయ |
| కుమారనైషధము | పెదపాటి ఎఱ్ఱాప్రెగడ |
| నవగ్రహస్తవము | గౌరనకవి |
| తారావళి | త్రిపురాంతకుడు |
| షోడశరాజచరిత్ర | అమదూరి నరసింహభట్టు |
| అనంతమహత్త్వము | బొడ్డపాటి పేరయ |
| పద్మినీవల్లభము | ,, |
| మంగళగిరివిలాసము | ,, |
| శంకరవిజయము | ,, |
| సూర్యశతకము | ,, |
| పర్వతపురాణము | పోలమరాజు |
| ఇందుమతీకల్యాణము | అంగర బసవయ్య |
| సావిత్రికథ | తులసి బసవయ్య |
| హరిదత్తోపాఖ్యానము | పండూరి మల్లయ |
| జలపాలిమహత్త్వము | ఘటసాసి మల్లుభట్టు |
| ప్రద్యుమ్నవిజయము | ఫణిధపు మాధవభట్టు |
| పద్మావతీకల్యాణము | నెల్లూరి ముత్తరాజు |
| రామలింగశతకము | ఎలకుర్తి రామరాజు |
| షష్ఠస్కంధము | మలయమారుతం సర్వన |
| కిన్నప్పచరిత్ర | కంచిరాజు సూరయ |
| భరతము | దామరాజు సోమయ |
| శివజ్ఞానదీపిక | పెదపాటి సోమయ |
| పంచతంత్రము | ? |
| వల్లభాభ్యుదయము | శ్రీనాథుడు |

జగ్గన తన ప్రబంధరత్నాకరంలో పై గ్రంథాలను పేర్కొని ఉండక పోతే వాటి ఉనికి మనకీనాడు తెలిసిఉండేది కాదు.

ఉదాహరణ పద్యాలనూ, జగ్గకవి ప్రబంధరత్నాకరాన్ని యథాతథంగా ముద్రించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

ప్రబంధమణి భూషణము:- ఈ సంకలనసంధాత పేరుకానీ, అతడు తన సంకల నానికి పెట్టిన పేరుగానీ మనకు తెలియవు. ప్రబంధమణిభూషణమనే పేరు మొట్టమొదటగా దీనిని ముద్రింపించిన మానవల్లి రామకృష్ణకవిగారు పెట్టిందే. పైన పేర్కొన్న ఉదాహరణపద్యాలు, ప్రబంధరత్నాకరం అనే సంకలనాలకూ, దీనికి కొంత భేదం ఉంది. పై రెండింటిలో వివిధకావ్యాలనుండి గ్రహించిన పద్యాలను వివిధ శీర్షికలక్రింద ఉదాహరించటమేకాక అవి ఏయే కావ్యాల నుండి గ్రహించిందీ చెప్పటం జరిగింది. కాని ఈ సంకలనంలో ఉదాహ రించిన పద్యాలు ఏయే కావ్యాల్లోనివో సంకలనకర్త సూచించలేదు. గ్రంథ కర్తల నామసూచనకూడా కావరాదు. ఈ సంకలనంలో మరో వైచిత్రి కనిపి స్తుంది. సంకలనకర్త వివిధ కావ్యాలనుండి పద్యాలను గ్రహించి వాటినన్నిం టినీ ముక్తకాలుగ పేర్కొనక ఒక కథాసూత్రంలో గ్రథించి దీనినొక సుందర కావ్యంగా, తీర్చిదిద్దినాడు. రాజశేఖరుడనే ఉజ్జయినీరాజకుమారుడు పాండ్యరాజ పుత్రియైన రత్నసుందరిని స్వయంవరంలో పరించటం ఇందులోని ఇతివృత్తం.

కావ్యనామాన్ని, కావ్యకర్తనామాన్ని పేర్కొంటూ ఉదాహరించిన ప్రబంధరత్నాకరాది సంకలనగ్రంథాల్లోని పద్యాలకూ, మనుచరిత్ర మొదలైన ప్రసిద్ధ ప్రబంధాల్లోని పద్యాలకూ ఆకరాలు తెలుస్తున్నా ఈ సంకలనంలో ఆకరాలు తెలియని పద్యాలు ఇంకెన్నో ఉన్నాయి. నిడుదవోలువారూ, మాన వల్లివారూ ఈ సంకలనానికి సంతరించిన పీఠికలో కొన్ని పద్యాలకు ఆకరాలు చూపినారు.[19] ఆదిపురాణం, కాదంబరి, విజయసేనం మొదలైన అలబ్ధ కావ్యాలకూ, కవిత్రయభారతం, కుమారసంభవం, దశకుమారచరిత్ర మొదలైన లబ్ధకావ్యాలకూ చెందిన పద్యాలు ఇందులో ఉదాహృతాలు.

---

19. నిడుదవోలువారి పీఠిక—పుటలు 8—82; మానవల్లివారి పీఠిక—పుటలు5-11

ఈ సంకలనంలో ఉదాహరించబడ్డ పెక్కుపద్యాలు క్రీ.శ.1700లకు ముందు వెలసిన కావ్యాల్లోనివే కనుక ఈ సంకలనకర్త క్రీ.శ.1700ప్రాంతానికి చెందినకవిగా భావించవచ్చు.

ఈ సంకలనాన్ని సంపాదించి మొట్టమొదట ప్రకటించినవారు. మానవల్లి రామకృష్ణకవిగారే.[20] ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడెమీ ఆధ్వర్యంలో నిడుదవోలువారి విపులమైన పీఠికతో దీనికి రెండో ముద్రణం కూడా వెలవడింది.

తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయంలో ఉన్న "ప్రబంధసారశిరోమణి" ఈ సంకలనానికి ఆధారగ్రంథం కావచ్చునని పండితుల అభిప్రాయం.

ప్రబంధసారశిరోమణి:—ఇది పూర్వప్రబంధాల్లోని రసవంతమైన పద్యాలను ఏరి కూర్చిన సంకలనగ్రంథం. దీన్ని సంధానించిన కవి ఎవ్వరో తెలియదు. అముద్రితమైన ఈ సంకలనం తాళపత్రప్రతులు నాలుగు తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయంలో ఉన్నాయి. ఇందులో కావ్యాల పేర్లనుకానీ, కవుల పేర్లనుకానీ సంధాత పేర్కొలేదు ఇంచుమించుగా ఈ సంకలనం ప్రబంధ మణిభూషణ ప్రణాళికలో సాగినట్లు కనిపిస్తుంది. ఆయా ప్రబంధాల్లోని పద్యాలను కేవలం విడివిడిగా వివిధశీర్షికలక్రింద ఉదాహరించకుండా వాటినన్నింటినీ కథాక్రమంలో కూర్చినట్లు ఈ సంకలనం చివర ఉన్న క్రింది వాక్యాలవల్ల తెలుస్తుంది.

"ఆ కుమారునికి రాజేంద్రుడు జాతకరణ, నామకరణాన్నప్రాశన చౌలోపనయనాదిసత్కర్మాదులు గావించి సంతోషితాంతరంగుండై ఆ భామాలలామలతో గూడి రాజ్యము పాలిస్తూ సుఖాన నుండెను"

ప్రబంధరత్నావళి:—ఉదాహరణపద్యాలనే పేరుతో లభిస్తున్న సంకలనాన్నీ, పెదపాటి జగ్గన సంకలితంచేసిన ప్రబంధరత్నాకరాన్నీ కలిపి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'ప్రబంధరత్నావళి' అనే పేర కొత్త సంకలనాన్ని కూర్చి

20. బ్రహ్మవిద్యావిలాసముద్రాక్షరశాల, మదరాసు

తెలుగుసాహిత్యలోకానికి మహోపకారం చేసినారు కవిత్రయభారతం మొదలైన ప్రసిద్ధగ్రంథాల్లోని పద్యాలు కూడా పై రెండు సంకలనగ్రంథాల్లో ఉన్నట్లుగ ఇంతకుముందు చెప్పుకున్నాం. శాస్త్రిగారు లభ్యమౌతున్న గ్రంథాల్లోని పద్యాలను వదలి ముఖ్యంగా మనకింతవరకూ లభించని కావ్యాల్లోని పద్యాలను ఈ సంకలనంలో కూర్చినారు. శాస్త్రిగారి ఈ సంకలనం వల్లనే ఎంతోమంది విస్మృతకవులూ, వారి కావ్యాలూ లోకానికి తెలిసే భాగ్యం కలిగింది. 1918లో మొట్టమొదటిసారిగా ముద్రణభాగ్యాన్ని పొందిన ఈ సంకలనం తిరిగి 1976లో మలిముద్రణం పొందింది.

శ్రీకృష్ణలీలావిలాసము :— ఇది, మనుచరిత్రాది ప్రబంధాలనుండి రసవంతమైన శృంగారపద్యాలను ఏరి కూర్చిన శ్రీకృష్ణుని శృంగారవిలాసవర్ణనపరమైన సంకలనగ్రంథం. పూసపాటి కుమారాచ్యుతరామరాజు దీని కర్త. ప్రబంధమణిభూషణంలో వలె ఇందులోనూ పద్యాలకు ఆకరాలు కానరావు. కూచిమంచి తిమ్మకవి వరకూ గల కవుల పద్యాలు ఇందులో ఉదాహృతాలు, అందువల్ల ఈ సంకలనం క్రీ.శ. 1800 ప్రాంతంలో రచింపబడి ఉంటుందని నిడుదవోలువారు అభిప్రాయపడ్డారు. దీనివల్ల కొన్ని కొత్త ప్రబంధాలు తెలిసే అవకాశముందని కూడా వారు సూచించినారు అముద్రితమైన దీని తాళపత్రప్రతి మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారంలో ఉన్నది.[21]

వర్ణనరత్నాకరము:-దాదాపు మూడు వందల ప్రబంధాల నుండి వివిధ వర్ణనలకు సంబంధించిన అనేక పద్యాలు నాలుగు భాగాలలో సేకరింపబడ్డ విలువైన సంకలనగ్రంథం. దాసరి లక్ష్మణస్వామిగారు ఈ గ్రంథసంధాత. లభ్యమైన కావ్యాల్లోనివే కాక విజయసేనం మొదలైన కొన్ని అలబ్ధ కావ్యాల్లోని పద్యాలు కూడా ఇందులో పేర్కొ-బడినవి.

శృంగారపద్యావళి:- ఇది ప్రబంధాల నుండి కేవలం శృంగార రసానికి సంబంధించిన పద్యాలు కూర్చబడిన సంకలనగ్రంథం. వేంకటగిరి పాలకులైన శ్రీ కృష్ణయాచేంద్రుల ఆజ్ఞానుసారంగా మోదీ జగన్నాథమల్ ఈ సంకలనాన్ని కూర్చినాడట.

---

21. R. No. 456

ఋతుచక్రము:—ఋతువర్ణనగల ప్రబంధపద్యాలను ఒక్కచోట కూర్చిన సంకలన గ్రంథం. సమర్థి రంగయ్య సెట్టి దీని కర్త.

భారతసారముక్తావళి:-కవిత్రయభారతం నుండి రాజకీయ, సాంఘికాధ్యాత్మికాద్యనేక విషయాలకు సంబంధించిన పద్యాలు ఆయా శీర్షికలుగా వర్గీకరింపబడిన సంకలన గ్రంథం. ముద్రితమే. కట్టమంచి సుబ్రహ్మణ్యరెడ్డి గారు ఈ సంకలన కర్తలు.

శ్రీమదాంధ్రమహాభారతధర్మదర్పణము :- సత్యం, అహింస, శౌచం మొదలైన ధార్మిక విషయ సంబంధంకల పద్యాలను కవిత్రయభారతం నుండి గ్రహించి ఆయా విభాగాలలో కూర్చిన సంకలనం. భాగవతం సీతారామారావు గారు ఈ సంకలనసంధాతలు. అముద్రితం.[22]

భాగవత సారముక్తావళి :- పైన పేర్కొన్న భారత సారముక్తావళి ప్రణాళికలోనే పోతన భాగవతంనుండి పద్యాలను సేకరించి కూర్చిన గ్రంథం. ముద్రితమే. కట్టమంచి సుబ్రహ్మణ్యరెడ్డిగారు ఈ గ్రంథసంకలయితలు.

ఆంధ్రకవిరత్నాకరము:-ఇది ప్రాచీనప్రబంధాల్లోని సూక్తులనూ లోకోక్తులనూ ఏరి కూర్చిన సంకలనం భట్టిప్రోలు రామచంద్రయ్యగారు ఏతత్సంకలన కర్తలు. క్రీ శ. 1900లో మొదటిసారిగా ముద్రింపబడింది.

వేటూరివారి చాటుపద్యమణిమంజరి, దీపాలవారి చాటుపద్యరత్నాకరం-ఈ రెండూ పై సంకలనాలవలె ప్రాచీన కావ్యపద్యాల సంకలనాలు కావు. వివిధ కవులు ఆయాసందర్భాల్లో చెప్పిన ముక్తకరూపాలైన పద్యాల సంకలనాలు.

పైన పేర్కొన్న సంకలనగ్రంథాల్లో మొదటి ఏడింటిలో మాత్రమే ప్రాచీన అలబ్ధకావ్యపద్యాలు ఉదాహరింపబడ్డవి. కావ్యావతారికలు, లక్షణ గ్రంథాలు, సంకలనగ్రంథాలు—వీటి ఆధారంగా పరిశీలిస్తే తెలుగులోని ఎన్నో కావ్యాలు

22. ఈ సంకలనకర్తల పుత్రులైన శ్రీ భాగవతం రామారావు గారి దగ్గర దీని వ్రాతప్రతి ఉన్నది.

మనకు లభ్యం కాలేదన్న విషయం స్పష్టమౌతుంది. ఇక కావ్యావతారికాదుల్లోకి ఎక్కక, నామరూపాల ఉనికి కూడా తెలియక నష్ట ప్రాయాలైన కావ్యాలు మరెన్నో! మొత్తం మీద మన చేతికందని కావ్యాలు వందలకొద్ది ఉంటాయనటంలో సందేహం లేదు తెలుగుజాతి ఇంత సాహిత్య సంపదను కోల్పోవటం నిజంగా దురదృష్టం.

ఇక ప్రస్తుతసంకలనాన్ని గురించి నాలుగు మాటలు మనవిచేస్తాను.

నిడుదవోలువారు ప్రబంధమణిభూషణపీఠికలో అలబ్ధ వాఙ్మయాన్ని గురించి చెపుతూ ఈ క్రింది వాక్యాలు వ్రాసినారు.

"ప్రబంధరత్నావళిని యథారూపమున తిరిగి ముద్రించుటకన్న 'అలభ్య వాఙ్మయము' అను పేర నొకసంపూర్ణసంకలన గ్రంథము ప్రకటించుట యత్యావశ్యకము. అందు

1. సకలనీతి సమ్మతములోని అలబ్ధగ్రంథపద్యాలు
2 ప్రబంధరత్నావళి (పూర్తిగా)
3. ప్రబంధమణిభూషణమున అలబ్ధగ్రంథపద్యములు
4. శ్రీకృష్ణ (లీలా) విలాసమున అలబ్ధగ్రంథపద్యములు.
5. లక్షణగ్రంథములనుండి తెలియుచున్న పద్యములు — ప్రకటించి విపులపీఠికా విశేషములతో వెలయించిన ఆంధ్ర సాహిత్య పరిణామ చరిత్రకు అత్యంతోపయోగమగును''.

నిడుదవోలువారి పై వాక్యాలే ఈ సంకలన సంకల్పానికి ప్రేరకాలు. ఐతే వారు సూచించిన పై ప్రణాళికను పూర్తిగా ఇందులో అనుసరించలేదు. ఈ సంకలనానికి నేనేర్పరచుకున్న ప్రణాళికలోని అంశాలను క్లుప్తంగా తెలియ జేస్తాను. తెలుగుసాహిత్యంలో నేటికీ లభించక కేవలం ఛందోవ్యాకరణాలవల్లా, సంకలన గ్రంథాలవల్లా, తదితర ఆధారాలవల్లా తెలియవస్తున్న కావ్యాల్లోని పద్యాలను ఒక్కచోట సంకలనం చేయటమే ప్రస్తుత సంకలన లక్ష్యం. అప్పకవీయం, కవిచింతామణి, కవిజనసంజీవని, లక్షణశిరోమణి, లక్షణసారసంగ్రహం, సుకవిమనోరంజనం మొదలైన ముద్రిత ఛందోగ్రంథాలతోపాటు ఆంధ్రప్రయోగరత్నాకరం, కవివాగ్బంధనం, ఆంధ్ర

కౌముది, వరసాంధ్రవృత్తరత్నాకరం (మాల్యాద్రిచ్ఛందస్సు), లక్షణ దీపిక, బాలబోధచ్ఛందస్సు మొదలైన ఛందోవ్యాకరణ గ్రంథాల్లో ఆయా సందర్భాల్లో యతి ప్రాసాదులకు లక్ష్యంగా చూపబడ్డ అలబ్ధ కావ్యపద్యాలన్నీ ఇందులో గ్రహింపబడ్డవి.

సంకలనగ్రంథాలవల్ల తెలియవస్తున్న అలబ్ధకావ్యాల్లోని పద్యాలనుకూడా గ్రహించాలన్నది ఈ సంకలనలక్ష్యమే ఐనా వాటినన్నింటినీ ఇందులో గ్రహించటం జరుగలేదు. లక్షణగ్రంథాల్లో ఎక్కడా పేర్కొ-బడక కేవలం ప్రబంధరత్నావళివల్ల మాత్రమే తెలియవస్తున్న పెదపాటి సోమయ కేదారఖండం, భావన పెమ్మన అనిరుద్ధ చరిత్ర, నిశ్శంకుని కొమ్మయ వీరమాహేశ్వరం మొదలైన అలబ్ధకావ్యాల్లోని పద్యాలను గ్రంథవిస్తరభీతితో ఈసంకలనంలో గ్రహించలేదు. లక్షణ గ్రంథాల్లో పేర్కొ-బడిన కావ్యాలకు సంబంధించిన పద్యాలు సంకలన గ్రంథాల్లోకూడా కనిపిస్తున్నప్పుడు వాటినిమాత్రం ఇందులో ఉదాహరించటం జరిగింది. ఉదాహరణ పద్యాల్లోనివిగానూ, ప్రబంధరత్నాకరంలోనివిగానూ చూపబడ్డ పద్యాలన్నీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి ప్రబంధరత్నావళినుండి గ్రహించినవే.

సకలనీతిసమ్మతంలో ఉదాహరించబడ్డ అలబ్ధ గ్రంథాలన్నింటిలో ఏ రెండుమూడో తప్ప తక్కినవన్నీ ఎక్కువగా అర్థ, నీతిశాస్త్రాలకు సంబంధించినవే. ముఖ్యంగా కావ్యప్రబంధాల పద్యాలనే గ్రహించిన యీ సంకలనంలో సకలనీతిసమ్మతంనుండి శ్రీగిరిశతకం, శ్రీరామాయణం — ఈ రెంటిలోని పద్యాలే ఉదాహరించబడ్డవి. ముద్రామాత్యం, కామందకం మొదలైన శాస్త్రగ్రంథాల పద్యాలను గ్రహించలేదు.

ప్రబంధమణిభూషణకర్త తాను పేర్కొన్న పద్యాలు ఏయే కావ్యాల్లోనివో, నిర్దేశించలేదు. మానవల్లివారూ, నిడుదవోలువారూ అలబ్ధ కావ్య పద్యాలుగా గుర్తించిన వాటిని మాత్రం ప్రస్తుతసంకలనంలో చేర్చినాను.

వీరేశలింగం పంతులు, గురుజాడ శ్రీరామమూర్తి, చాగంటి శేషయ్య, వంగూరి సుబ్బారావు, ఆరుద్ర - వీరి కవుల చరిత్ర, సాహిత్యచరిత్రల్లోనూ

అలబ్ధ కావ్యాల్లోనివిగా పేర్కొన్న పద్యాలనుకూడా యథాశక్తి సేకరించి సంకలనంలో కూర్చినాను. శతకసాహిత్యంకూడా కావ్యప్రక్రియకు చెందిందే కావడంవల్ల శతక పద్యాలుకూడా ఈ సంకలనంలో చోటుచేసుకున్నవి. ఈ సంకలనంలో ఉదాహరింపబడ్డ లక్షణగ్రంథపద్యాలను ఆయాలక్షణగ్రంథాల్లో ఏయే లక్షణాలకు లక్ష్యంగా చూపినారనే విషయంకూడా నిర్దేశించాలని మొదట అనుకున్నాను. కాని అలబ్ధమైనకావ్యాలనూ, వాటిలో ఇంతవరకు లభించిన పద్యాలనూ తెలియజేయటమే ఈ సంకలనలక్ష్యంగా పెట్టుకోవడంవల్ల ఈ విషయాన్ని స్పృశించలేదు. లక్షణకారులందరూ ఆయా పద్యాలను ఒకే లక్షణానికి ఉదాహరణలుగా చూపకపోవటంతోపాటు ఆ వివరాలన్నింటినీ చూపితే గ్రంథస్వరూపం కొంత గజిబిజిగా అవుతుందేమోనన్న భయం కూడా ఈ వివరాలను చూపకపోవటానికి కారణం. ఇందులో ఉదాహరించిన కావ్యాల్లో పెక్కు కావ్యాల రచనాకాలం స్పష్టంగా తెలియక పోవటంవల్ల కావ్యాలన్నింటినీ కాలానుక్రమంగా కాక అకారాది క్రమంలో కూర్చటం జరిగింది. ప్రతి కావ్యానికీ ముందు కొద్దిమోతాదులో కవి, కావ్యపరిచయం చేసినాను.

స్థూలంగా పై అంశాలను దృష్టిలో పెట్టుకొని ఈ సంకలనాన్ని కూర్చినాను. అముద్రిత లక్షణగ్రంథాల్లో కొన్నింటినిమాత్రమే పరిశీలించటం జరిగింది. పరిశీలించవలసిన అముద్రిత లక్షణ గ్రంథాలు ఇంకా ఉన్నవి. వాటివల్ల కూడా మరికొన్ని అలబ్ధ కావ్యాల్లోని పద్యాలు లభించే అవకాశం లేకపోలేదు. ఈ సంకలనం సంపూర్ణమని కానీ, నిర్దుష్టమని కానీ నేనభిప్రాయ పడటం లేదు. సహృదయతతో విజ్ఞులిందలి దోషాలను తెలియజేస్తే మలి ముద్రణంలో వాటిని సవరించుకుంటాను. సంకలన శాఖలో విశిష్ట పరిశోధన చేసి మాత్న కావ్యాలనెన్నింటినో వెలుగులోనికి తెచ్చిన పరిశోధక వతంసులు పూజ్యులు వేటూరి ప్రభాకరశాస్త్రి, మానవల్లి రామకృష్ణకవి, నిడుదవోలు వేంకటరావుగారలు సంకలన ప్రక్రియపై నాకభిరుచి కలిగించి నన్నీ సంకలన ప్రయత్నానికి ప్రేరణచేసినవి వీరి రచనలే. వీరు నాకు సర్వదా స్మరణీయులు.

ఈ సంకలన సందర్భంగా వివిధదశలలో, వివిధ రూపాలలో నాకు తోడ్పడిన ఆప్తులు, సహృదయులు ఎంతో మంది. వారందరికీ కృతజ్ఞతలు తెలియజేయటం నా విధి.

తమ గ్రంథాలయాల్లో ఉన్న అముద్రితచ్ఛందోవ్యాకరణ గ్రంథాలనూ, సంకలన గ్రంథాలనూ సంప్రదించుకోవటానికి అవకాశ మిచ్చినవారు ఆంధ్ర ప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ అండ్ రీసెర్చి ఇన్స్టిట్యూట్ (హైదరాబాదు), గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ (మదరాసు), ఎస్.వి. యూనివర్సిటీ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ అండ్ రీసెర్చి ఇన్స్టిట్యూట్ (తిరుపతి), ఏ ఎస్ పి. గవర్నమెంట్ మ్యూజియమ్ అండ్ రిసెర్చి ఇన్స్టిట్యూట్ (కాకినాడ) అధికారులు -

వివిధ ప్రాంతాలలో ఉన్న గ్రంథాలయాలకు వెళ్ళి కావలసిన పరిశోధన సామగ్రిని సేకరించుకునే నిమిత్తం 'ట్రావెల్ గ్రాంట్' రూపంలో ఆర్థిక సాహాయ్యం చేసినవారు ఉస్మానియా విశ్వవిద్యాలయాధికారులు —

తమ దగ్గర ఉన్న అముద్రితచ్ఛందోగ్రంథాలనుండి నాకవసరమైన అలబ్ధ కావ్యపద్యాలను శ్రమయనక వ్రాసి పంపి తోడ్పడినవారు సహృదయులు శ్రీ రావూరి దొరసామి శర్మ, డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి, శ్రీ తీర్థం శ్రీధర మూర్తి, డా॥ జి. లలితగారలు —

గ్రంథముద్రణ కోసం 2500 రూపాయల ఆర్థికసాహాయ్యాన్ని కల్పించి ప్రోత్సహించినవారు ఉస్మానియా విశ్వవిద్యాలయాధికారులు —

పరిశోధనపై నాకాసక్తి కలిగించి నా సాహిత్య జీవితానికి మా దర్శకులైనవారు పూజ్యులు ఆచార్య బిరుదురాజు రామరాజుగారు —

తమ విలువైన అభిప్రాయాలతో నన్నాశీర్వదించిన ఆచార్యవర్యులు-

అందరికీ వందనాలు.

శా.శ.౧౯౦౫
శ్రావణపూర్ణిమ
23—8—1983

విధేయుడు
ఆర్. శ్రీహరి

# అంబాలభాణము

[అంబాలభాణాన్ని రచించిన కవి పేరు తెలియదు. ఇందులోని ఒక పద్యం రత్నాకరం గోపాలకవి రచించిన సకలలక్షణ సారసంగ్రహంలోనూ[1] మరో పద్యభాగం వార్తాకవిరఘునాథయ్య లక్షణదీపికలోనూ ఉదాహరింపబడ్డవి. ఈభాణం సంస్కృతంలోని అంబాలభాణానికి అనువాదం కావచ్చు. సంస్కృతంలో అంబాలభాణమనే పేరుగల ఒక భాణం ఉన్నట్లుగ వెంకటరావు అనే రిపోర్టర్ కల్నల్ మెకంజీకి వ్రాసిన 'చినవహి' లోని ఈ క్రింది వాక్యాలవల్ల తెలుస్తుంది.

''గద్వాలలో అపూర్వగ్రంథాలు విచారించగా ఉండినవి. ప్రబోధ చంద్రోదయం, సంకల్పసూర్యోదయం, శిల్పిశాస్త్రం, రెట్టమతమున్నూ—ఇవి గాక నాటకాలు, అంబాలభాణం అనేవిన్నీ, శాకుంతలం అనేదిన్నీ—ఇందులో రెట్టమతంమాత్రం తెలుగు—కొమవావి సంస్కృతగ్రంథాలు.''[2]]

1. సగ మీఱున్సరసీరుహప్రకరముల్వాదేగు చేలావళుల్ (?)
బొగులంబాతెఁజకోరవారము మహామోదంబునం జక్రము
ల్నెగడెన్మజ్జగముల్వెలింగె జిగి మీఱెన్సర్వభూతాళి ప్రా
జ్ఞగరాజాగ్రమునందుఁదోచె రవి.... త్రోజ్జ్వలద్భానుఁడై[3].

2. ... .... ... ... ... .... .... గ్రి
క్కిరిసెన్ దిక్కుల జిమ్ముచీకటి నిశాధీశుండు పూర్వాద్రి దో
చె రథాంగంబులు ... .... .... ... ... .[4]

1. సకలలక్షణసారసంగ్రహంలోని కొంతభాగం ఆం.సా.ప. పత్రికలో ప్రచురింపబడింది. చూ : సంచిక 6, సంపుటం.8 పేజీ 354.
2. ఈవాక్యాలు డా॥ నాయనికృష్ణకుమారిగారు మెకంజీపై వ్రాసిన వ్యాసంలో నుండి గ్రహింపబడ్డవి.
3. స. ల. సం. (ర. గో.), 4. ల. దీ.

# అంబికాశతకము

## రావిపాటి త్రిపురాంతకుడు

---

[రావిపాటి త్రిపురాంతకుడీశతకకర్త. పద్నాలుగోశతాబ్ది పూర్వార్ధానికి చెందినవాడు. ఈతడు సంస్కృతంలో ప్రేమాభిరామం, తెలుగులో త్రిపురాంతకోదాహరణం, అంబికాశతకం, చంద్రతారావళి, మదనవిజయం అనే గ్రంథాలను రచించినాడు. ప్రేమాభిరామం అలభ్యం. తెలుగుగ్రంథాల్లో ఒక్క త్రిపురాంతకోదాహరణమే పూర్తిగా లభ్యమౌతుంది. తక్కినవాటిలో కొన్ని పద్యాలుమాత్రమే లక్షణగ్రంథాలవల్ల తెలియవస్తున్నవి. మదనవిజయం వాత్స్యాయనుని కామశాస్త్రానికి అనువాదంగా వెలసిన ఎనిమిదాశ్వాసాల గ్రంథ మనీ, తామాగ్రంథాన్ని ఒక్కగడియ మాత్రమే చూడగలిగినామనీ, తమకా గ్రంథాన్ని ఆగ్రంథస్వాములు రెండవమారు చూపలేదనీ మానవల్లివారు తెలుపు తున్నారు[1]. ఈ శాస్త్రగ్రంథం మనకు పూర్తిగా దొరకకపోయినా అందులోని దొరకిన రెండు పద్యాలకైనా ప్రస్తుతానికి తృప్తిపడుదాం.

'చంద్రా రోహిణీవల్లభా' అనే మకుటంలో చంద్రస్తుతిపరకమైన కృతి చంద్రతారావళి. ఇందులోని నాలుగుపద్యాలు మాత్రమే లభిస్తున్నవి.

'అంబికాశతకం'లో పార్వతీపరమేశ్వరుల శృంగారరసోన్నతి ఎంతో ఉచిత రీతిలో వర్ణింపబడింది. ఈ శతకంలోని ఏడు పద్యాలు మాత్రమే ప్రస్తుతానికి లభ్యమైనాయి.]

1. అదిమశక్తి యీ తరుణి యాద్యకుటుంబిని యీ కుమారి ము
   త్తైదువ యీ తలోదరి చిదాత్మక యీ సతి విశ్వమాత యీ
   పైదలి సర్వలోకగురుభామిని యీ చపలాక్షి యంచు బ్ర
   హ్మాదులు వచ్చి యిచ్చలు హిమాద్రికి నిన్నెఱిగింతు రంబికా![2]

---

1. త్రిపురాంతకోదాహరణ పీఠిక. 2. ఉదా. ప.

2. కూడెడు వెండ్రుకల్ నిడుదకూఁకటఁ బ్రోవుగ బొడ్డుపై వళుల్
జాడగఁ దోపఁ గ్రొమ్మొలకచన్నులు మించు దలిర్ప సిగ్గునన్
జూడఁగ నేరముల్ మెఱుఁగుఁ జూపులనీన హిమాద్రియింట నీ
వాడుట శూలికిన్ మనము వాడుట గాదె తలంప నంబికా![3]

3. భారతివై సరోజభవుపాల వసించి రమావధూటివై
నీరజనాభుఁజెంది ధరణీధరనందనవై మహేశ్వరుం
గోరి వరించితమ్మ ! నినుఁ గొల్వక యూరక యేల గల్గు సం
సారసుఖంబు లీమనుజసంతతికిం దలపోయ నంబికా![4]

4. బెడఁగగు రత్నదర్పణముఁబేరిన వెన్నెలవోసి నిచ్చలుం
దుడువక పాలసంద్రమునఁదోఁచి సుధాకరుమేనికందువో
గడుగక నేరెచేట సితకంజము ముంపక నైజకాంతితోఁ
దొడరినఁదల్లి ! నీ మొగముతో సరిపోల్పఁగఁజాలునంబికా!

5. ఱెప్పలబోరుఁదల్పులిసిటింతలు వాఱెడు చూపుఁగుంచియం
ద్రిప్పి తళుక్కునం దెఱచి తిన్నని మోమునఁగాయు వెన్నెలల్
ముప్పిరిగొన్న వేడుకలు మూగిన సిగ్గసియాడఁబ్రీతి నీ
వప్పరమేశుఁజూచి తనువర్ధముఁగొంటి పొసంగనంబికా!

6. లాఁచి వరాంగనల్ వరవిలాసమనోహరవిభ్రమంబులన్
జూచినఁజూడఁడుత్తముఁడుచూపఱఁజూచును మధ్యముండు తాఁ
జూచినఁ జూడకుండినను జూచుఁగనిష్ఠుఁడు నన్ను వీరిలోఁ
జూచినఁజూడకుండ గుణిఁజూచిన చూపునఁజూడుమంబికా!

---

3. ఉదా. ప.
4. వ్రి. ర.

7. వాలిన కన్నుముంగురులు వాతెఱకెంపు మెఱుంగుఁజంటిపై
ఁగ్రాలెడు తారహారమును గంకణచారుకరంబు డాఁపలం
దూలుచునున్న పయ్యెదయుఁదోచిన కన్నులు మోడ్చిమోడ్చి నీ
పాలగు నీశుమేని సగఁబాలు మనంబునఁజేర్తునంబికా![5]

5. త్రిపురాంతకోదాహరణపీఠికలో "బెడగగురత్న" అనేపద్యం మొదలు కొని "వాలినకన్ను" అనే పద్యంవరకు ఉన్న నాలుగుపద్యాలు ఉదాహరింపబడ్డాయి. (మానవల్లికవి రచనలు-97పే.)

# అథర్వణభారతము

అథర్వణుడు

[అథర్వణాచార్యుడు దీని కర్త. ఈతడు విరాటోద్యోగభీష్మపర్వాలను మాత్రమే రచించినట్లుగ వీరేశలింగంపంతులుగారు ఆం.క.చ. లో పేర్కొన్నారు[1]. కాని ఆంధ్రకౌముదీకారుడు తానుదాహరించిన అథర్వణభారత పద్యాల్లో కొన్నింటిని అవి యేపర్వాలకు చెందినవో కూడా నిర్దేశించడంవల్లా, ఆయాపద్యాల్లోని విషయంవల్లా అథర్వణుడు ఆదిపర్వంనుండి శల్యపర్వందాకా రచించిఉంటాడని చెప్పవచ్చు. తక్కిన పర్వాల్లోని పద్యాలు లభించకపోవడం చేత అథర్వణుడు భారతాన్ని పూర్తిగా రచించినాడని చెప్పడం సాధ్యపడదు. ఈతడు 12వ శతాబ్ది చివరనో, 13వ శతాబ్ది ప్రారంభంలోనో ఉండిఉంటాడని పండితుల అభిప్రాయం. తురగా రాజకవి–అయ్యంకి బాలసరస్వతి అనే జంట కవులు, కాణాదం పెద్దనసోమయాజి–వీళ్లు మాత్రమే అథర్వణుణ్ణి పూర్వకవి స్తుతిలో పేర్కొన్నారు. ఈతడు జైనుడని ప్రతీతి. జైనులైన తెలుగుకవుల కావ్యాలెన్నో పూర్తిగా నష్టంకావడం తెలుగుసాహిత్యానికి ఒకపెద్ద లోటుగా భావించవచ్చు.

అథర్వణభారతంలోనివిగా ఇప్పటికి లభించిన పద్యాలు 25మాత్రమే. కీ. శే. తిమ్మావజ్ఝలకోదండరామయ్యగారు వీటిలో 20పద్యాలను అథర్వణ భారతం[2] అన్నవ్యాసంలో ప్రకటించినారు. తక్కినవి ఈ గ్రంథకర్త సేకరించినవి.]

1. 1భా. 297 పుట

2. భారతి. 1953 డిసెంబర్, పుటలు 482–487.

ఆదిపర్వము

1. ఆ తటి చెలికిచ్చిన మే
లౌ తొడవులు దొడిగె నా సరోజదళాక్షీ
కౌతుకముగఁ జెప్పుము వినఁ
బ్రీతి జనించెడిని తనదు హృదయంబునకున్[3]

సభాపర్వము

2. తడిసిన పచ్చని తడికాంతులకుఁ దోడు
తొడల క్రొమ్మెఱుఁగులు తోడుసూపఁ
గురుల వంకలు దీర్చి కురియు వార్బిందువుల్
సనుదోయికొక వింతసరము గాఁగఁ
బొది జాటియున్న క్రొవ్వెద చక్కనొత్తుచో
దోర్మూలకాంతులు తొంగలింప
గజ్జలరేఖలు కరఁగిన తెలిగన్ను
లంభోజదళకాంతి నపహసింప

రాజసూయావభృథమునఁ దేజరిల్లు
దుౘపదరాజతనూజాతవిపులజఘన
తలముఁగనుగొని రాజకాంతాజనముల
మనములాపోవమిని మగమనములయ్యె[4]

---

3. అం, కౌ; 'ద్రౌపదీవిహాహే సఖం ప్రత్యర్జునవాక్యమ్' అనే అవతారికావాక్యం ఈ పద్యానికి ముందు ఉన్నది.

4. తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర ప్రాచ్యవిద్యాపరిశోధనాలయ గ్రంథ భాండాగారంలోని ఒకానొక భారతప్రతి (సంఖ్య580)లో సభాపర్వంలో అథర్వణాచార్యులభారతంలోని పద్యంగా ఈ పద్యం పేర్కొనబడి నట్లుగా తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు తెలిపినారు. చూ:— అథర్వణభారతం అన్న వ్యాసం. భారతి. 1953 డిసెంబర్.

3. పరిణతాశేషవసుంధరాధిపశిరస్స్రగ్గంధలుబ్ధభ్రమ
త్క్వాణదభ్రభ్రమకృద్ద్విరేఫగణఝుంకారపరిదాబద్ధసం
పరిణవత్యుత్ప్రథితపరివర్ధితసమస్తక్షత్రిసూయాధ్వర
క్షణసింహాసనభాసితున్ దృఢధనుశ్శ్లాఘానుజున్ ధర్మజున్[5]

అరణ్యపర్వము

4. వరధౌమ్యాచార్యపుర
స్సరులై స్వాధ్యాయహోమజపతత్పరులై
యఱువదివేల స–లు ధ
ర్మరాజమఖమెరుతఁజనిరి రమ్యాంబునకున్[6]

5. నేనిదిగొ మర్త్యలోదృష్టుఁడైన జముని
పట్టిపారుడి శాపంబు వాసితింక
సొర్గమునకేగెద(ను) మీరు సుఖముఁజెంది
యుండుడనుచు విమానంబునొత్తి చనియె[7]

6. నయమార రాఘవుఁడు నా
వి యెక్కి వడి దాటి జాహ్నవీశైవలినిన్
జయజయ యని వినువీథుల
వియచ్చరులు సన్నుతింప వేడుకతోడన్[8]

---

5. ఉదా. వ.

6. ఆం.కౌ.

7. ఆం.కౌ. ఈ పద్యానికి ముందున్న 'అథర్వణభారతే ఆదిపర్వణి అజగర నహుషవాక్యమ్' అనే అవతారికావాక్యంలో ఇది ఆదిపర్వంలోనిదిగా చెప్పబడ్డా అజగరనహుషకథ అరణ్యపర్వంలోంది కనుక ఈ పద్యాన్ని అరణ్యపర్వానికి చెందిందిగానే గ్రహించవలె.

8. ఆం.కౌ.

విరాటపర్వము

7. గురుభీష్మకర్ణగాంధా
రరాజ భూరిశ్రవులు దొరకుఁదోడ్పడి గ్రి
చ్చలు కవ్వడి మార్కొని వి
బ్బరముగ నటఁగురిసిరంపవానలు కడిమిన్[9]

8. ఇక నొకసారి పల్కిన ఘటిల్లసి చిందునా నోటిముత్యముల్
వికచసరోరుహాక్షి వినవే నను మన్నన చేసి కావుమీ
యకట మనోభవాశుగచయంబుల నా తనువెల్ల నొచ్చి పో
యె కరుణసూచి యేలుకొనుమీ కినుకిప్పుడు నేయనేటికే[10]

9. శ్రీకంతుఁడెదురునపుడు వ
నౌకోధ్వజమింద్రమకుటమర్జునతురగా
నీకము దివ్యశతాంగము
నా కవ్వడి కబ్బియున్న నతఁడేమగునో[11]

10. ఆ కర్ణుదురాలాపము
లాకర్ణింపగ నసహ్యమై ద్రోణునితో
నాకనదీసుతుఁడనియె వ
నౌకోఫ్వజమెఱుగవచ్చు నరుఁజూపి తగన్[12]

---

9. ఆం.కా.

10. ఆం.కా; 'కీచకవాక్యమ్' అని ఈ పద్యానికి అవతారికావాక్యం.

11. అ.క. III–141; సు.సా.168; సు.మ.రం. III–235

12. అ.క. III–142; సు. మ.రం. III–236

11. ధర్మతనయ యుష్మదాజ్ఞానిగళవిని
బద్ధమగుచుఁజిక్కువడియెఁగాక
విజయమత్తగజము విడివడ్డచో నడ్డ
పాటు గలదె విష్టపత్రియమున[13]

12. ధాంధమితభేరికాధ్వానముంఘులీని
నాటమును మిన్నుముట్ట ననారతంబు
చిక్కు గంధర్వపతులు నల్దిక్కులందుఁ
గ్రచు సౌగంధికంబుఁదేఁగలరె యొరులు[14]

13. అంబరసీమఁదారలు జటాటవి మల్లెవిరుల్ భుజాంతరా
ళంబున హారసంతతులిలాస్థలిఁబువ్వులవర్షముల్ ప్రసూ
నంబులు సత్కృతాంజలిననందగి మౌక్తికతుల్యమౌళిగం
గాంబుకణంబులుట్టిపడనాడెడు శంభుఁడుమిమ్ముఁ బ్రోవుతన్[15]

---

13. అ. క. III -124 ; సు.మ.రం. III —156

14. అ. క. V-155

15. ఈ పద్యాన్ని అథర్వణుని భారతవిరాటపర్వంలోని మొదటి ఆశ్వాసం లోనిదిగా మానవల్లికవిగారు తమ క్రీడాభిరామపీఠికలో పేర్కొన్నారు. (చూ:—మానవల్లికవి—రచనలు 78 పే.) జైనుడైన అథర్వణుఁడు శంభుస్తుతి చేసినాడా ! ఆలోచించవలె.

ఉద్యోగపర్వము

14 అరయగ వారెల్లరు ప్రబ
లురు గావున వారితో విరోధము మనకే
ల రవయిడగ సంధికిఁబం
పు రాచబెబ్బులి మతేను బోయి మఱలెదన్.[16]

15. తాలాంకుతుములసమర
క్రీడకుఁదాళఁగలవాఁడు క్షితిలోపల నె
వ్వాఁడును లేడవి యుండకు
నీదగ్గఱ నున్నవాఁడనే నెలవిమ్మా.[17]

16. తృష్ణాతంతునిబద్ధబుద్ధులగు రాధేయాదులంగూడి శ్రీ
కృష్ణుంగేవలమర్త్యుఁగాఁదలఁచి మర్దింపంగ నుత్సాహ
ధృష్ణుండయ్యె సుయోధనుండకట ధాత్రీనాథ! యూహింపుమా
యుష్ణీషంబునఁగట్టవచ్చునె మదప్యూఢోగ్ర శుండాలమున్.[18]

17. నతనానావనినాథయూథమకుటన్యస్తాబ్జరాగోజ్జ్వల
ద్యుతివిభ్రాజితపాదపీఠు లలనాదోశ్చామరోద్ధూతమా
రుతలోలాలివినీలకుంతలుఁ బ్రభారుగ్ధాముఁగేయూరశో
భితబాహాపరిఘున్ సువర్ణధరణీభృద్ధైర్యు దుర్యోధనున్.[19]

---

16. అం. కా. "సంజయధృతరాష్ట్రసంవాదే" అనేది ఈ పద్యానికి ముందున్న అవతారికావాక్యం.

17. అం. కా.

18. ల.సా.సం. II-224 ; అ.రం.ఛం. III-295 ; క.చిం. III-54 అం.ప్ర.ర.45b పుట ; వ.ల.సం.28b పుట.

19. ఉదా.వ.

18. రాజమండలపూర్ణ రాజమండలవీధి
రత్నగర్భామలరత్నగర్భ
గంధర్వగంధర్వగంధర్వనగరంబు
నాగపున్నాగపున్నాగవనము
మార్గణమార్గణమార్గణపీఠము
త్తుంగభుజంగభుజంగభూమి
కాంతకాంతారాతికాంతకుంతస్థలి
వీరకుమారకుమారసరసి

యనఁ బొగడ్తకెక్కు నలకాపురంబు దే
వేంద్రుపురము దానవేంద్రుపురముఁ
గ్రేణిసేయు లలితశోణాంశుమణిబద్ధ
గోపురంబు హస్తినాపురంబు.[20]

భీష్మపర్వము

19. పది దినములైదు ప్రొద్దులు
పదపడి రెన్నాళ్ళ నొక్క పగలున్ రేయున్
గదనంబుఁజేసి మడిసిరి
నదిసుతగురుకర్ణశల్యనాగపురీశుల్.[21]

20. ఉదా. ప.

21. ల.సా.వం. II—30. ఈ పద్యం కొద్ది భేదంతో నన్నయ ఆదిపర్వంలో కనిపిస్తుంది. కాని ఈ పద్యార్థమే ఉన్న "పదిదివసంబులు భీష్ముఁడాహవ" అనే పద్యం దీనిపైనే ఉన్నది. కనుక ఇది అథర్వణుని భారతంలోనిదే కావచ్చు.

ద్రోణపర్వము

20. తెంపును బెంపును గదుర వి
లింపులు వెఱగంది చూడ రిపుసైన్యములం
గంపింపఁదమ బలంబులు
ఱంపిలి విట్టార్వ ధర్మరాజుండాకెన్.[22]

కర్ణపర్వము

21. కురుపతి రవిసుతుని సువ
ర్ణరత్నభూషణతతుల నుఱక బహూమతిఁజే
సి రథసము మీఱ సేనల
కు రాజు గావించె సమరకుశలుండగుటన్.[23]

శల్యపర్వము

22. తఱుచైన కురుబలంబుల
మఱపించుచుఁగడిమి మెఱయ మాఱిమసఁగిన
ట్లిఱిముఱి బెదంగు గదఁగొని
కరువలికొడుకందు నుఱుము గావించె వడిన్.[24]

క్రిందనుదాహరింపబడ్డ మూడు పద్యాలు ఏ పర్వాలకు చెందినవో స్పష్టంగా తెలియరావడం లేదు.

23. రక్షింపవయ్యా భాస్వత్పాకరనేత్ర
యుగ్మసంవర్తాగ్నితిగ్మభానుఁ[25]

22. ఆం. ప్ర. ర.
23. ఆం. కౌ.
24. ఆం. కౌ.
25. ఆం. ప్ర. ర. 22b పుట

24. ఉగ్రులను పదునొకొండు బాణమ్ముల
నణతునె నీ సహాయంబు గలుగ.[26]

25. శాశ్వతమ్ముగ నంగావనీశ్వరుండు
సార్థముగ భూషణాళి యాచకులకిచ్చి
కీర్తిచే నాల్గు చెఱగుల వార్తకెక్కెఁ
గాన యారీతి విఖ్యాతి గనగవలయు.[27]

ఈ క్రింది పద్యార్థం ఆనందరంగరాట్ఛందంలో అథర్వణా చార్యులపద్యమని ఉదాహరింపబడించి. ఇది అతని భారతంలోనిదే కావచ్చునేమో!

26. అనవరతమును బూజించి సాంబశివునిఁ
దలపఁదలఁపులు ఫలియించుఁగలుషమణఁగు.[28]

27. అనుధావత్పురమన్వటన్నిగమమన్వంచత్సరోజాసనం
బనుగచ్ఛద్గిరిశ్వరంబనుసరద్య (?) జ్ఞానకర్మవ్రజం
బనువద్య (?) త్సనకాదియోగిసికరంబమ్మేటి తేజంబు దం
డనమస్కారముఁజేసె ధర్మజునకున్ మర్త్యత్వనాట్యంబునన్.[29]

---

26. అం. ప్ర. ర. 31a పుట
27. అం. ప్ర. ర. 36a పుట.
28. ఆ. రం. ఛం. III —217
29. ం. వి. 31పుట.

# అరుణాచలపురాణము

పెదపాటి సోమనాథుడు

---

[పెదపాటి సోమనాథుడు అరుణాచలపురాణకర్త. కవిలోకబ్రహ్మ బిరుదాంచితుడైన ఈతడు శివజ్ఞానదీపిక, కేదారఖండం, త్రిపురవిజయం అనే గ్రంథాలను కూడ రచించినాడు. క్రీ.శ. 1500 ప్రాంతానికి చెందినవాడు. ప్రబంధరత్నాకరం, ప్రబంధమణిభూషణం, లక్షణ సారసంగ్రహం—వీటిలో అరుణాచలపురాణంలోని పద్యాలు పేర్కొనబడ్డవి. ఈ గ్రంథంలోనివిగా లబ్ధమైన పన్నెండు పద్యాలు సుకవిస్తుతికీ, పురవర్ణనకు సంబంధించినవి.]

అంగయుక్తంబుగా నామ్నాయముల నాల్గు
    చదువంగనేరని సద్ద్విజాతి
బ్రాహ్మపాద్మాదిపురాణాగమేతిహా
    సములెఱుంగని బ్రహ్మసంభవుండు
భాట్టవైశేషికప్రాభాకరాది శా
    స్త్రములాఱ చూడని ధరణిసురుఁడు
స్వకులోచితములైన సప్తతంతువులెల్లఁ
    బారమెయ్యింపని బాడబుండు

కావ్యనాటకలసదలంకారముఖ్య
విద్యలన్నియు నెఱుఁగని విప్రవరుఁడు
పంచయజ్ఞములును లేని బ్రాహ్మణుండు
వెదకి చూచినఁ బొడమండు వీటిలోన[1]

---

1. ప్ర.ర. (జ), ప్ర.మ.భూ. 73వ.

2. తెలుఁగుమునకంతకునై నను
వెలుఁగునగ భద్రకరుల విలుతురు హరి ను
కన్నుఁబట్టి చట్టిలేరుదు
రుఁగుకుదురు యుగాగ్నినైన నురుభటులందున్.[2]

3. కాంక్షఁజిప్పిఁగొండి శివశాంతపమాఢ నతండు మద్దగో
దారిదవంబు మేమపినవంబని చేరినఁజూచి నాసికా
ద్వారిలంబు జన్నిదపువ్యాళము చొప్పనఁదొరమైత్రి పీం
కారము సేసి వచ్చు వెనకయ్య కృతీశ్వరు మన్నుఁగాఢతన్.

4. ప్రతిభావిలంఘితభారతమహాకథా
ఘట్టు నన్నయభట్టుఁగడు భజించి
యుభయభాషాప్రౌఢిమోద్యన్మహారాజ్య
భాజిఁదిక్కనసోమయాజిఁబొగడి
వాక్ప్రీతోషితదక్షవాటిమహాస్థాన
క్షేము వేములవాడ భీముఁగొలిచి
భావబంధవిబంధపరమేశ్వరుదప్ర
శర్మ నెఱ్ఱయశర్మ నన్నుతించి
భారతీహారు భవదూరుఁ బ్రణుతిసేసి
సుకవికులసోము నాచనసోముఁ నెన్ని
నవ్యకవితానాథు శ్రీనాథుఁదలచి
సరసనకలాంధ్రకవుల కంజలి యొనర్చి[4]

2. ప్ర.ర. (ఆ)
3. ప్ర.ర. (ఆ) ల.సా.వం. II–123
4. ప్ర.ర. (ఆ)

5. బంటుతనంబు వైభవము భాగ్యము తేజము చాల గల్గ ము
క్కంటినిఁ దమ్మికంటి నధికంబగు భక్తి భజించి కేలిమైఁ
గంటకులం జయించి కలకాలము నర్థుల కోర్కి పంటలై
పంటలుఁ బాడియుం గలిగి పంటలు మీఱుదురప్పురంబునన్.[5]

6. భ్రమరకావళికప్పు ప్రసవగుచ్ఛభ్రమ
ద్భ్రమరకావళికప్పు బాంధవింప
కరముల కెంపును గమనీయహల్లకో
త్కరముల కెంపు సఖ్యంబు నేయ
ముఖసౌరభములు నమోఘాతిముక్తక
ముఖసౌరభంబులు మొనసి బెరయ
హాసవిస్ఫూర్తులు నతులవర్ణ ప్రతి
హాసవిస్ఫూర్తులు ననఁగి పెనఁగ

సారములగు తమ్ముల విలాసములు చూపి
వరుసఁ బువ్వులు జట్టికోవచ్చినట్టి
జనుల మనసులు మును తారు జట్టికొండ్రు
పుష్పలావీవధూటులప్పురమునందు.[6]

7. రాజులు విక్రమోగ్రమృగరాజులు విశ్రుతదివ్యకాంతి రే
రాజులు రూపరేఖ రతిరాజులు మానగుణంబునందు రా
రాజులు దానశక్తి ధనరాజులు వైభవభోగవృద్ధి స్వా
రాజులనంగ నొప్పుదురు రాజితతేజులు తత్పురంబునన్.[7]

---

5. ప్ర.ర. (జ)
6. ప్ర.ర. (జ)
7. ప్ర.ర. (జ) : ప్ర.మ. ఖా.78ప.

8. వలుదకుచంబులున్ బవడవాతెఱలున్ మెఱుఁగారు మేనులున్
బలుచని చెక్కుటద్దములుఁబద్మపుమోములుఁగంబుకంఠముల్
కలువలఁబోలు కన్నులు వికాసపునవ్వులుఁజిల్కపల్కులున్
దలిరుల మించు పాదములుఁదత్పురికాంతలకొప్పునెంతయున్.[8]

9. విపణికోరో యన్న విబుధాచలంబైనఁ
దెమ్మనఁదేని వైదేహికుండు
పులిజున్ను వలెనన్న బొరుగిల్లు సూపక
యాక్షణంబున నీని యర్యవరుఁడు
మహనీయకౌస్తుభమాణిక్యమునకైన
వెలఁద్రెంచనేరని విద్వరుండు
గురుతరహాటకకోటికిఁబడగలు
కోటియెత్తని వణిక్కుంజరుండు

మందునకునైన లేరు సమగ్రభోగ
భాగ్యసంక్రందనులు జగత్ప్రికటకీర్తి
లర్థిసంపత్ప్రిదుల్ విర్జితార్థపతులు
పట్టితోదారులప్పురి వైశ్యులెల్ల.[9]

10. వ్యాసుని వాల్మీకి వరరుచి వామను
బాణు క్షేమేంద్రునిఁబ్రవరసేనుఁ
గణ్ణామృతు మయూరుఁగాలాంతకుఁగళింగుఁ
గవిదైత్య శివదాసుఁగాళిదాసు

8. ప్ర.ర. (జ)
9. ప్ర.ర. (జ)

భట్టారహరిచంద్రు భట్టనారాయణు
భట్టగోపాలుని భట్టబాణు
భాసు భామహు పార్వభౌముని శివభద్రు
భారవి భవభూతి భర్తృహరిని

రాజశేఖరుఁ జోరు మురారిఁ గృష్ణ
మిశ్రు జయదేవు దండి సౌమిల్లు సోము
చంద్రు దిఙ్నాగు విజయవిశాలదేవు
హర్షుఁ జిత్తపు శాతవాహను సుబంధు
మాఘు మల్హణు బిల్హణు మఱియు గలుగు
ప్రథితగీర్వాణకవులనుఁ బ్రణతిసేసి.[10]

11. ఉదయప్రాణవిహారమై వినుతవర్ణోద్యద్విభక్తిక్రియా
సదనంబై సదలంకృతిప్రభవమై సద్విక్రమావాసమై
విదితార్థాకరమై ప్రసన్నపదమై వృద్ధశ్రవోపైభవా
స్పదమై రాజనుఁబోలె గ్రాలవలదా పద్యంబు హృద్యస్థితిన్[11]

12. ద్విదరణకేసరుల్ మనుజవేశసువర్ణమహీధరంబుల
ప్రచలితసాగరంబులనపాయమనోహరచంద్రబింబముల్
సుచరితచిత్రరూపములశోకసముజ్జ్వలరాఘవాకృతుల్
ప్రచురమహానిధుల్ పురవరంబున రాజకుమారులందఱున్.[12]

ప్రబంధమణిభూషణంలో పేర్కొబడ్డ పై రెండు పద్యాలు అరుణాచలపురాణం లోనివిగా విడదవోలు వెంకటరావుగారు ప్ర.మ.భూ.పీఠిక (పు.20,21)లో తెలియజేసినారు.

---

10. ప్ర.ర.(జ) 11. ప్ర.మ.భూ. 37. ప12. ప్ర.మ.భూ. 80ప.

# ఆదిపురాణము

## సర్వదేవుడు

[జైనతీర్థంకరులలో మొట్టమొదటివాడైన ఋషభదేవతీర్థంకరుని చరిత్రను వర్ణించే కావ్యం ఆదిపురాణం. సర్వదేవుడు దీని కర్త. ఎడపాటి ఎఱ్ఱన మల్హణ చరిత్రలో ఈయనను పూర్వకవి స్తుతిలో పేర్కొన్నాడు. కన్నడ రత్నత్రయమని ప్రసిద్ధి పొందిన పంప, పొన్న, రన్నలలో—పొన్నకవే ఈతడని నిడదవోలువారి అభిప్రాయం. సర్వదేవుడు ఆదిపురాణాన్నేకాక భారతంలోని విరాటపర్వాన్నికూడ రచించినట్లు ఒకానొక లక్షణగ్రంథమూ[1], ప్రబంధ రత్నావళీ సాక్ష్యమిస్తున్నవి. ఇతడు క్రీ.శ. పదోశతాబ్దికి చెందిన జైనకవి. ఈతని ఆదిపురాణంలోని ఆరు పద్యాలు మాత్రమే లభిస్తున్నవి. వీటిలో ఒక పద్యం (ఒకనాడిందుధరుండు అనేది) సోముని ఉత్తర హరివంశంలోనూ కనిపిస్తుంది.]

1. సరసీజాతవిరాగకారి పురయోషావక్త్రహృద్యాతిసుం
దరకాంతిన్ దఱిఁగించుఁబో యని మదిందర్కించి దోషాకరున్
బురముద్దండకరంబులెత్తి చఱవంబో త్రైనయట్లొప్పు ను
ద్ధురసౌధాగ్రనిబద్ధకేతువు మహాదోలాభిరామంబుగన్.[2]

2. హరినీలమణివిరాజిత
సురుచిరగోపురము దగిలి చూచి తమిస్రా
కరుఁడు విధుంతుదమండల
పరిశంకంజేసి పురముపైఁ జననోడున్.[3]

1. ఛం.గ్ర. నెం. 159/7 కాకినాడ; 11a పుట.
2. ఉదా.వ. 3. ఉదా.వ.

3. కాలివనాలి గ్రాలి జలజాతపరాగము దూలి పద్మినీ
కూలలతాంతసౌరభముఁ గ్రోలి మధూలితపక్షజాతవా
తూలము నేలి వాఃకణముఁ దోలి మదేభమదాంబుధారలన్
దేలి వనాంతరాళములఁ ద్రిమ్మరు గాలి ప్రమోదశాలియై.[4]

4. మరువముఁ బొంది పొంది విరిమల్లియపూవులఁ జెంది చెంది వే
సరములఁ గ్రోలి క్రోలి జలజాతపరాగముఁ దోలి తోలి క
ప్పురముల నెంచి యెంచి సురపొన్నల తావుల నంది యంది తె
మ్మెరలు నిరంతరంబును భ్రమించుచునుండు వనాంతరంబులన్[5]

5. శిక్షణము ధృతియు నాప
ద్రక్షణమును జేయు తల్లిదండ్రులు నను ప్ర
త్యక్షపుదైవములుండఁగ
రోక్షపు దైవములఁ గొలుచు నలజడి యేలా![6]

6. ఒకనాడిందుధరుండుఁ బార్వతియు లీలోద్యానకేళీసరి
న్నికటానేకవనప్రదేశముల దైతేయేంద్రకన్యాప్సరో
నికురుంబంబులు పారిజాతకుసుమానీకంబు పైఁ జల్ల ద
ర్పకబాణంబులకెల్ల నెల్ల యగు సౌభాగ్యంబు శోభిల్లగాన్.[7]

---

4. ల.వి. 37పు. ల.వం. (R 235); ప్ర.మ.భూ. 150ప.
5. ల.శి. iv—94; ధం.గ్రం. 159/7 కాకినాడ.
6. ల.శి. iv—226.
7. ఆ.క. III—118; ల.ప. శిశపు: వి.భూ: ఈ పద్యం సోమునిఉత్తర హరివంశంలో ఉన్నది.

# ఇంద్రవిజయము

నన్నయభట్టు

[ లక్షణగ్రంథాల్లో ఈ కావ్యం నన్నయభట్టకృతంగా పేర్కొనబడింది. ఇందులోని ఐదు పద్యాలు మాత్రమే ప్రస్తుతానికి లభ్యమైనాయి. లభ్యమైన పద్యాల్లోని 'అంగజుఁడను మాపటి' అన్న పద్యాన్ని ఉదాహరించి ప్రభాకర శాస్త్రిగారు 'ఇది నన్నయపద్యమనుట విశ్వాస్యమగునా'? యని తమ సందేహాన్ని వెలిబుచ్చినారు. రాఘవాభ్యుదయమనే మరో కావ్యం కూడా నన్నయభట్టకృతమని ఆంధ్రకౌముది పేర్కొంటుంది.]

1. ఆ సరసిజాక్షికౌనుకు
గాసరి యొక్కింత పోలుకతమునఁగద యా
కాశమనంతాహ్వయమునఁ
గేసరి హరినామమునఁదగెన్ వినుమింద్రా![1]

2. నగరాజవైరివితరణ
నగరాజత్కుసుమరసన (న)త్కుల్యాంచ
న్నగరాజిరమును సురలె
న్నగ రాజిలు గతుల గడచి నగ...

1. ఆ.రం.ఛం. III – 103; ఆ... 278 పుట
2. ఆం.ప్ర.ర. 18a పుట.



3. నునుమై కల్మి పదంతి దాకరమునెందున్ బూరగొమ్మీరు చే
తను వేయంచులవాలు మేలొసగనౌ డాలున్ పవల్ రేయు న
-ను చూపున్ నెఱిచూపులానఁగొసు చూపట్టెన్ జగాదట్టి టొ
ట్టన ప్రేలన్ వెలినుబ్బగన్న యొదయండా నన్నుఁబాలింపుమా॥[3]

4. అంగజుఁడను మాసటి చ
క్కంగను రాయంచ యేనుగును సూఁకుచుఁజే
చెంగలువ నోఁజచేఁజెలి
చంగవ నడుచక్కి గ్రుమ్మి పరగుననార్చెన్.[4]

5. ఒక పలువాతఁగొన్న కిటియుందలలో నిడు కూర్మభర్త నా
లికలిరుగొన్న సీదరపు తేడు పయోధరధారఁటొట్ట పెం
చుకలనగాళి యూడు ప్రతిజోడని యెంచగఁగూడదేరికె
వ్వికగ యయాతి యందె ధరణీభరముంచి చెలంగువానికిన్.[5]

3. [illegible] ప్ర.ర.—46a పుట.

4. అం॰ప్ర.ర. 23b పుట

5. అ.రం.ఛం. III—278.

# ఉ మా మ హే శ్వ ర ము

[ ఈ గ్రంథాన్ని రచించిన కవి యెవ్వరో తెలియదు. పార్వతీ పరమేశ్వరుల వృత్తాంతమిందు వర్ణింపబడినదేమో। ఇందులోని ఒకే ఒక పద్యం పరసాంధ్రవృత్తరత్నాకరం[1] అనే ఛందోగ్రంథంలో ఉదాహరింపబడింది. ]

1. మాకందఫలరసంబుల
నాకలిఁగొని మేము గ్రోల నా కొమ్మలలో
చీఁకటినప్పుడు నొక చిలు
కేగతినో మోవిఁగఱచె నెఱుగనె చెలియా।[2]

1. దీనికే మాల్యాద్రినృసింహచ్ఛందమనే నామాంతరం ఉన్నది. తెల్లబూరి లింగయమంత్రి దీని కర్త।
2. ప.వృ.ర. 71పుట.

# ఎఱ్ఱన రామాయణము

ఎఱ్ఱాప్రెగడ

---

[''వల్మీకభవు వచోవైఖరి రామాయణంబు నాంధ్రప్రబంధంబు జేసె" అనే చెదలువాడ మల్లన పద్యంవల్ల ఎఱ్ఱన వాల్మీకి వాగ్వైఖరిలో రామాయణాన్ని ప్రబంధంగా రచించినట్లు తెలుస్తుంది. పదిహేడవ శతాబ్దికి చెందిన కూచిమంచి తిమ్మకవి 'లక్షణసారసంగ్రహం' ఎఱ్ఱనరామాయణంలోని పద్యాలను ఉదాహరించిన మొట్టమొదటి లక్షణగ్రంథం. ఆయా లక్షణగ్రంథాల్లో లభించినవే కాకుండా వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఎఱ్ఱన రామాయణంలోనివిగా గుర్తించిన పద్యాలు కూడ ఇందులో చేర్చబడ్డవి.]

1. అనుటయు మంత్రిమాటలకుఁ బ్రియంపడి యాతనినాదరించి య
మ్మనుజకులేంద్రుఁడ[1] .... ... ...

2. సందడి యధ్వరక్రియకసంగతి మేని బలంబుతోడఁ బెన్
గ్రందడి యేల మేనఁదగఁగార్ముకహస్తుఁడనై కడంగి మీ
ముందఱ నిల్చెదన్ గ్రతువు ముట్టక యుండఁ బ్రపంచదైత్యరా
జిందెగ దవ్వుదోల వెసఁజించెదఁబెంచెద మీకు మోదమున్.[2]

3. అంగముతోడఁగట్టుమిక యజ్ఞవిఘాతకచోరు నెందు వో
వంగలవాడవింక నిటు వైళమ తాపసవేషధారివై[3] ....

---

1. ల.సా.సం. I –167; 2. ల.సా.సం. II – 314.
3. సు.మ.రం. V –393, ల.సా.సం.II – 327.

4. చెఱకుందోటలఁ బెంచి శాలిమయసుక్షేత్రస్థలుల్ వించి య
క్కఱ లేకుండగఁ బూగనాగలతికాకాంతారముల్ ద్రోచి యే
డ్తెఱ నంతంగుముదోత్పలాబ్జవనవాటీకోటి నాటించి పెం
జెఱువుల్ వాల్చెఁ బురంబులన్ దెసలఁ బ్రస్ఫీతాంబుపూరస్థితిన్[4]

5. మాఱు తెఱంగుల నెరసులు
మీఱగ నీవిభ్రమములు మెఱయించి మునిం
గాఱగజేఁయుము మేనక
చూఱగొనదె యతని తెలివిసొమ్ములు మున్నన్.[5]

6. తాఱంగాగిన నేల తంపఱతఁ బాతాళంబుదాకంజనం
దూఱంజెల్మఱి మిన్ను దాకి తరగల్ దోరంబులై నల్గడల్
బాఱంబెల్లుగ నేఱులుబ్బరముగాఁ బైపైన నీరెక్కుడై
వాఱంజెవ్వులు చెన్ను మీఱె నఖిలప్రాణుల్ ముదంబందగన్[6]

7. కోఱలు నుగ్గునుగ్గయిన కూర్మఫణీంద్రగతిందరంగముల్
మాఱిన భూరివారిధిక్రమంబున రాహుకరాళవక్త్రమున్
దూఱిన తీవ్రభానుక్రియ దోర్బలసైన్యతఁ బుత్రహీనతన్
గీఱి పరాభవాదిగతి గీడ్పడి భూపతి నెమ్మనంబునన్.[7]

8. అనఘ యకంపమై విమలమై పరిపూర్తియు లోతు దియ్యమున్
ఘనతయుఁ గల్గి సజ్జనమనస్సదృశస్థితిఁ జాలనొప్పు మీ
ఱినయది యన్నదీజలము తేవును మంచిది[8] .... ...

4. సు.మ.రం. iv –62; ం.సా.వం. III –102
5. సు.మ.రం. iv -81; ం.సా.వం. III –244
6. ం.సా.వం.III-253; 7. ం.సా.వం.III-279 8. ం.సా.వం.III-299

9. మూర్వురు నొక్కచందము మనోగతి నైరణ చేసి వన్ను నా
పర్వకులంబు నుత్తమయశమ్మున నుంచితిరమ్మలార మీ
కుర్విని పాటియే యబలలొందొరు దేవతలున్ బటుక్షమా
నిర్వహణంబొనర్చుటకు నేరరు మర్త్యులఁజెప్పనేటికిన్.[9]

10. ఆ దశరథసూనుండు ప
యోధి జలంబింకఁజేసి యొక శరమునఁగ్ర
వ్యాదవిభుఁదుఁమి సీతమ
మోదంబునఁజేకొనె సురపుంగవులెల్లన్[10]

11. త్యాగులు పాతకేతరులనై నుతికెక్కగ నాకలోకలీ
లాగరిమంబు నంబుదములాగు దలిర్చిన సంస్కృతోల్లస
ద్వాగభియుక్తి నాత్మవిబుధత్వము సిద్ధతనొందగా సుధా
యోగము నొందుదుర్స్మృతిపయోధి మథించి రసజ్ఞులై కవుల్[11]

12. దానమిచ్చితినని యీని దీనునిభంగి.[12]

13. ధాత్రీసురసేవారతి
భ్రాతృభృతిగురూక్తిపాలబంధుమతి దు
శ్చాత్రవహరణచణస్థితి
మిత్రానందకరవిహృతి మీయందమరున్.[13]

---

9 సు.మ.రం. V – 208. ఉ.సా.సం. I – 314.

10. సు.మ.రం. I- 254; ఆ.రం.ఛం. I - 65; ఆ.ప్ర.ర. 22a పు.
ఆ.రం.చం. లో ఈ పద్యం ఎఱ్ఱాప్రెగడ సంక్షేపరామాయణంలోనిదిగ
పేర్కొబడింది.

11. సు.మ.రం. v-316; 12. క.సం.వి.I 64. 13. ఆం.ప్ర ర. 23a పు.

14. బాలసుధాంశునిటాలని నవసుధా
లాపముల్ వినవలెననెడి యాస.[14]

15. ఓ నారీమణి యీ మెక
మేనిప్పుడ తెచ్చియుంతునె మ్రోలన్
గానుకగానవి రాముఁడు
చేనమ్ముఁను విల్లు దాల్చి - యుండుత మిన్.[15]

16. త్రివ్వెడు గంటులన్ గురువు దేఱెడు నెత్తురు రాకమున్న యే
నొవ్వియు నేవికారము మనోగతిఁజెందకమున్న సాయకం
బవ్వలఁబోకమున్న మకుటాగ్రవిఘట్టన రాణమొప్పగా
మువ్వన నుప్పతిల్లె వసురోద్వహమూర్ధచయంబు గ్రక్కునన్[16]

17. నిర్మలహేమబిందుకమనీయము గాఢమునైన విస్ఫుర
ద్వర్మము దాల్చి శీప్త(?) పరివారితవహ్నియుఁబోలె రుద్రుఁడై
కార్ముకమెక్కువెట్టి గుణకర్కశటంకృతులన్ సమస్తది
జ్మర్మములంబగల్చుచుసమర్థుడు రాముఁడు నిల్చెనయ్యెడన్[17]

---

14. అం.ప్ర.ర. 29aపు. 15. అ.ప్ర.ర. 27a పు

16. ఈ పద్యం భాస్కరరామాయణ ముద్రితప్రతి (v -2154) లోనే కాక చాలా తాళపత్రప్రతుల్లోకూడా ఎఱ్ఱాప్రెగడవారి పద్యమని పేర్కోబడింది.

17. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వప్రాచ్యలిఖితపుస్తకభాండాగారంలో ఉన్న ఒక భాస్కరరామాయణ తాళపత్రప్రతి (T 19-50, Acc. No. 3294)లో ''కాంచనరత్నదీప్తమగు'' (భా.రా; అరణ్య. 1ఆ. ఫుట్ నోట్స్‌లోని పద్యం) అనే పద్యం తరువాత ఈ పద్యం ఎఱ్ఱాప్రెగడ పద్యంగా కానవస్తుంది.

18. పారోదారసమంచితస్ఫురదురుస్ఫాయల్లసల్లాలిత
(స్ఫారంబుల్ వె) స(ద్రిప్పి పెట్టుచును శబ్దద్రవ్యహీనుల్ సదా
తారుం జెప్పితిమంచు(జెప్పికొమటల్ దప్పే నిరాఘాటవా
క్ఫారత్య ప్రతిభావిజృంభితులు మెచ్చర్ గాక యా చందముల్[18]

19. చువ్వన మేను వంచి రవి సోకగ(దోక విదల్చి పాదముల్
వివ్వగ(బట్టి బాహువులు పీచి మొగంబు బిగించి కొండ జౌ
జవ్వన నూగి ముందటికి(జాగి పిఱిందికి(దూగి వార్ధిపై
ఱివ్వన దాటె వాయుజు(డు ఱెక్కలతోఁడిసురాద్రియోయనన్[19]

20. ఆ నెఱజోదు కేలు దొనకై విగిడించుట యమ్ము మౌర్వి సం
ధానము నేత వింద(దెగ(దార్కొని లక్ష్యము సేయుదేయుడున్
గాన నజస్రమండలితకార్ముక మొక్కటి గంటి(గంటిన
ద్దానవదీర్ఘదేహసముదాయనిరంతరపాతవేగముల్.

21. కరిణీయానంబు నవ్వున్ గతి నవలతికాకారమంగంబు చంద్రున్
బురుణించున్ ముద్దుమోమంబురుహదళములంబోలు
గన్నుల్విపంచీ
స్వరసంకాశంబు వల్కుల్ జలదళనిచయస్పర్ధియై యుండు వేణీ
భరమాతన్వంగికింద్రప్రముఖనిఖిలదిక్పాలకాభీలశౌర్యా!

---

18 ఈ కవిస్తుతిపద్యం ఎఱ్ఱాప్రెగ్గడరచితంగా ఒక ప్రాచీనపద్యవంకలవంలో కానవచ్చిందనీ, అది ఎఱ్ఱన రామాయణకృత్యవతరణికలోంది కావచ్చునని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తెలిపినారు. చూ. హరివంశం పీఠిక. 31 పు.

19. ఈ పద్యం 'ఎఱ్ఱన రామాయణంలోనిదా' అని ఎప్పుడో ప్రభాకరశాస్త్రిగారు నోట్ బుక్కులో వ్రాసుకొన్నారట. చూ. హరివంశపీఠిక 31 పు.

22. అలినిభవేణి చంద్రసదృశానన యుత్పలపత్రనేత్ర కో-
మలలతికాభిరామభుజ మంజులవృత్తలసత్కుచద్వయీ
కలితసుమధ్య హృద్యకటి కామ్యతరోరువు రమ్యజంఘ యు
జ్జ్వలచరణాబ్జ తదన్వితజానకినా విలసిల్లు రావణా।[20]

ప్రాచ్యలిఖితపుస్తకశాలలోని ఒక సంకీర్ణపద్యాలుగల తాళపత్రసంపుటంలో రామాయణయుద్ధకాండకు సంబంధించినవి ముప్పై పద్యాలు కానవచ్చినవనీ, అవి ఎఱ్ఱాప్రెగడ రామాయణంలోవి కావచ్చు ననీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తెలిపినారు. రెడ్డిసంచికలో ముద్రింప బడ్డ ఆ ముప్పై పద్యాలను దిగువ ఉదాహరిస్తున్నాను.

23. అనిలజరావణానుజులు హస్తములంగయిదండఁగొంచు గ్ర
క్కునఁజనుదెంచి భానుజుడుగొల్వ సుఖంబుననున్న రామచం-
ద్రునిఁగని పాదముల్ శిరముతో నొఱయన్బ్రణమిల్లి లేచి ని
ల్చినయెడ నెమ్మొగంబు వికసిల్లి విభీషణుడుంబ్రియంబునన్

24. తమ్ముఁడ నేడు నాకుఁబ్రమదంబు ఘటిల్లె దశాస్యనందనుం-
డిమ్మెయిఁ గూలుటన్ మనకు నింక జయంబగునంచు సిగ్గు లోఁ
గ్రమ్మగనున్న లక్ష్మణునిఁగ్రక్కున నంకమునందునుంచి వ
క్షమ్మునఁజేర్చుచున్ శిరము సారెకు మూర్కొనుచుంగ్రమం-
బునన్.

---

20. 'ఆ నెఱజోదు' అనే పద్యం మొదలుకొని 'అలినిభవేణి' అనే పద్యం వరకు గల మూడు పద్యాలు నేలటూరి వెంకటరమణయ్యగారికి ఆనెగొందిలో లభించిన భాస్కరరామాయణతాళపత్రప్రతిలో అరణ్యకాండలో ఎఱ్ఱాప్రెగడకృతంగా కనిపించినవట. చూ: వాఙ్మయమంజరి (నేలటూరి వెంకటరమణయ్య) లో భాస్కరరామాయణవమప్య అన్న వ్యాసం.

25. కరములనవ్విభుండతని గాయములంటుచు నూర్పు పుచ్చుచున్
బురఁబురఁ బొక్కుచున్ శిరము మార్కొని యెంతయు మాఱడిం-
పుచున్
దురమున లెస్స గూల్చితివి దుర్దముడైన విరోధిపంక్తికం-
ధరుదును నింక గూలునని నా మది నిశ్చయబుద్ధినొందెదన్.

26. మసలక రామ రావణులు మార్కొని యుద్ధము సేయుచుండగా
నిశితశరంబులొండొకటి నేర్పునఁద్రుంచుచు నుగ్రశక్తిమై
దశశిరు మస్తకప్రతతి దాకిన చిత్రమ దుల్లు నూపుమై
నసిరికమ్రానిమీదఁబిడుగూవినఁగాయలు డుల్లునాకృతిన్

27. అక్కడి ధూళి బ్రుంగుడయి(?)యంగమునెత్తుటఁదోగి వేదనన్
స్రుక్కుచు ధాత్రిపైఁబొరలుచున్ బడి లక్ష్మణుడిట్టులుండ నా
కెక్కడి యుద్ధకాంక్ష యిక నెక్కడి విక్రమగౌరవక్రమం
బెక్కడి ప్రాణమెక్కడి మహీసుత యెక్కడి రాజ్యసంపదల్

28 కందక గాజువాఱక మొగంబు వికాసముఁజెందెఁజేతులీ
యందములైన కాళ్ల నరుణాంబురుహంబులలీలఁజూడఁజె
న్నొందెడు జీవహీనులిటులుందరు ప్రాణముతోడనున్నవా
డిందుసహోదరుండు ధరణీశ్వర!నీకు విషాదమేటికిన్

29. మనమున నిశ్చయించి పవమానతనూజుఁడు మూడుమాఱులే
పునఁగదలించి యంబుధరముంబలె నీలరుచిం జెలంగు త
ద్వనగిరిశృంగమున్ విడిచి కైకొని పైకెగురంగపైచి యా
చి నిలువఁబట్టుచున్ వెస సుషేణునిఁజేరగవచ్చి యచ్చటన్

30. ఆతని రౌద్రిరేఖఁగని యబ్ధి గలంగెఁ, జలించె శైల, మౌ
త్పాతిక వారిదంబులతిదారుణరావములై జనించె, ధా
త్రీతలమెల్ల బిట్టదరె, దిక్కులు వ్రీలె, సమస్తభూతముల్
భీతి వహించె డెందమగలెన్ రజనీచరలోకభర్తకున్.

31. అనయము సర్వభూతములయందును గోద్విజులందు శైలకా
ననగగనాఖిలానలఘనత్వము మించ సహస్రపాదలో
చనశతశీర్షమూర్తిపయి సారగతిన్ వసియించి సాద్రికా
వనియు సమస్తభూతములవారివహింతువు నీవె రాఘవా!

32. తరుణాదిత్యనిభద్యుతిన్ మెఱసి రక్తశ్రీచ్ఛటాశాటికా
ధరయుందప్తసువర్ణభూషణయు నుద్యన్నీలధూమాభ్రబం
ధురధమ్మిల్లయునౌ విదేహతనయన్ దొర్దొత్తబెన్మంటలోఁ
జొరనేతెంచినరూపుతోన జగముల్ సోద్యంబునన్ జూచినన్.

33. అవనిజలంబులెల్లను దశాననునంతిపురంబునందుఁబె
క్కువు దివసంబులున్న జనకాత్మజ శోధితఁజేయకే యనా
ర్యవిహితవృత్తిఁదెచ్చె రఘురాముఁడు బాలిశుఁడంచునెంచరా
భువనములెల్ల నమ్ముటకుబో యిటునేసితి హవ్యవాహనా!

34. ప్రకటతరాత్మతేజమున రక్షిత యా మిథిలాధిరాజక
న్యకనుఁబయోధివేలఁబలె నాశరుఁడెందునతిక్రమింపఁడె
వ్వికతను విప్పువంటి మహనీయచరిత్రము గల్గు నిట్టి జా
నకివిఁదరంబె వానికి మనంబున నేమియుఁజాల్కఁజూడగన్.

35. వైరిజయంబుగాంచి బలవంతుల మిత్రులఁగూడి తేజమున్
సారయశంబునున్గనిన నాదుసమాగమసంబు నీవు పొం
పారఁగఁజెప్పుచో నతని యాననవర్ణవిలోకనేంగితా
కారవచోవిశేషములకై వడి నేర్పునఁజూడుమేర్పడన్

36. అతులంబై వశవర్తియై రథతురంగానేకపాకీర్ణమై
పితృపైతామహమైన రాజ్యము మదిన్ భేదింపగాఁజేయు సం
తతమెవ్వానికినైన రాజ్యఫలమాత్మన్ గోరినన్గైకయీ
సుతుఁడే యేలుచునుండుగాక విపులక్షోణీతలంబెంతయున్

37. అతఁడదరించు శస్త్రముల యారవముల్ శరపుంఖజాతమా
రుతములఁ గ్రమ్మినన్గులగరుల్గదలెన్ గలగెన్ బయోనిధుల్
క్షితి వడకెన్ మనంబునఁజలించిరి పన్నగలోకవాసులు
న్నతిరుచిఁబాసి మాసె దిననాథుఁడు మందటిలెన్ సమీరుఁడున్

38. ఎడినమరేంద్రముక్తమగు వజ్రములీల యుగాంతకాలుకై
వడిఁబఱతెంచి రావణుని వక్షము గాడి ధరిత్రిఁదూలె బ
ల్విడి దశకంతుఁ ద్రుంచె రఘువీరుఁడు నేడని మేలువార్త యే
ర్పడ ఫణిలోకవాసులలరన్ వివరింపగనేగెనో యనన్.

39. అపుణ్యవ్రతిఁబట్టినప్పుడె తదీయంబై యనిర్వార్యమౌ
కోపాగ్నిన్ మసిగాక నీవునికి రక్షోనాథ లోకంబునన్
బాపాత్ముండగువాడు పాపఫలమున్ బ్రాప్తవ్యకాలంబునన్
బ్రాపించెన్ నిజపాపకర్మఫలమిత్థంగిన్ వినుండెందుటన్

40. సవితృఁడు చంద్రుఁడున్ దిశలుసంధ్యలు రేలుఁబగళ్లుగాలియున్
భువియును నాదిగా సకలమున్ గను సాక్షులు వీరెఱుంగ నేఁ
బ్రవిమలసద్గుణోత్తరధురాపరిభూషిత నైతినేని హ
వ్యవహుఁడు నన్ను నిప్పుడు దయాయతచిత్తతఁ బ్రోచుగావుతన్

41. ఆ రీతిన్ భువనత్రయిన్ గలుగువారత్యంతశోకార్తులై
క్రీరత్వంబు పరిత్యజించి యల ధాత్రీనందనం జెందు దు
ర్వారాపన్నతి యెంచుచున్ బలుకఁదద్వాక్యంబులాలించుచున్
ధారాశ్రులతో మనంబెరియఁజింతన్ రాముఁడున్నత్తఱిన్.

42. ఖలునిఁ గబంధునిన్ నిశితకాండములన్ దునుమాడి వాని ప
ల్కులు విని ఋశ్యమూకమునకున్ జని భానుజుఁగూడి వాలిను
జ్జ్వలబలుఁగూల్చి యర్కసుతు వానరరాజ్యమునందునుంచి య
య్యలఘుఁడు పంపె భూమితనయన్ వెదకన్ గపివీరకోటులన్

43. నిరుపమూర్తి రామధరణీపతి శోభనవేళ నాడి ర
చ్చరపువుబోండ్లు కిన్నరులు సారెకుఁబాడిరి దేవదుందుభుల్
మొరసెను ధాత్రి సస్యములు మోహనలీల వహించె వృక్షముల్
వరసురభిప్రసూనఫలవర్గములన్ విలసిల్లె నెంతయున్

44. అవి కొనియాడుచున్ జలరుహాక్షులు సేసలు మీఁదఁ జల్లగా
ననఘచరిత్ర ! రామ ! సుగుణాకర ! వర్ధిలుమంచుఁ బౌరులె
ల్లను దనచుట్టుఁగొల్వఁగ నలంకృతమైన రథంబుపై ముదం
బున భరతాగ్రజుండు రఘుపుంగవుఁడీగతి వైభవంబులన్

45. జలనిధిఁగట్టి మించు కపిసైన్యముతో వనరాశిఁదాటి దో
ర్బలమున లంకపై విడిసి రావణముఖ్యనిశాటకోటులన్
గలన జయించి భూతనయఁ గ్రమ్మఱఁగైకొని నిత్యకీర్తులన్
వెలసినవాఁడు రాముఁడిటు వింటిమె కంటిమె యిట్టి చిత్రముల్

46. భేరీకాహళశంఖతూర్యములు గంభీరంబులై మ్రోయఁగాఁ
దారామార్గమునందు దేవఋషిగంధర్వస్తుతుల్ మీఱ నే
వారూఢిందగ వందిమాగధులు కైవారంబు గావించుచున్
సారోదారవిచిత్రవైఖరుల నానందంబు గల్పింపఁగన్.

47. రావణుఁగూల్చి క్రమ్మఱ ధరాసుతఁజేకొని వచ్చుచున్నవా
డావసుధాకళత్రుఁడిదె యాప్తులతోడ మహేంద్రుతో శచీ
దేవియుఁబోలె సీత జగతీతలనాధుఁగూడి సంతత
శ్రీ విలసిల్ల నున్న యది చేరినవాఁడు సుమిత్రపట్టియున్.

48. అలికులవేణులన్ జలరుహాక్షులఁజంద్రనిభాస్యలన్ విని
ర్మలమణిహేమభూషణసమగ్రల భార్యలగా వరింపు క
న్యల గుణజాతియుక్తలఁబదార్గుర గ్రామశతంబుఁజూడఁజె
న్నలరెడు లక్ష గోవులఁబ్రియంబెఱిగించిన నీకు నిచ్చెదన్.

49. కొంచక కోటపై నిలిచి కొందఱు భీమబలాఢ్యులైన న
క్తంచరులుగ్రతోమరగదాపటుశక్తిని వానరాళి మె
ప్పించిరి వానరేంద్రులును బేర్చి రణంబునఁగోటపైకి లం
ఘించి నిశాటులంధరణికిం బడనీడిచి నొంచిరుద్ధతిన్

౬౦. నిను సేవించినఁగల్గు మానవులకున్ వీటీవధూటీఘటీ
ఘనకోటీశకటీకటీతటిపటీ గంధేభవాటీపటీ
రనటీహారిపటీసువర్ణమకుటీపరిచ్ఛోటికాపేటికల్
కనదామ్నాయమహాతురంగ! శివలింగా! నీలకంఠేశ్వరా!

# కందర్పకేతువిలాసము

## తెనాలి రామలింగకవి

---

[తెనాలి రామలింగకవే వైష్ణవం స్వీకరించిన తరువాత తెనాలి రామకృష్ణుడైనాడని విమర్శకుల అభిప్రాయం. రామలింగకవి వేఱు, రామకృష్ణకవి వేఱు అని మానవల్లివారు అభిప్రాయపడినట్లుగ ప్రభాకరశాస్త్రిగారు తెలిపినారు[1]. ఏమైనా రామలింగకవిపేర లభ్యమౌతున్న పూర్తికావ్యం ఒక్కటి పాండురంగ మాహాత్మ్యమే. కందర్పకేతువిలాసం, హరిలీలావిలాసం—ఈ రెండుకావ్యాలు కూడా రామలింగకవికృతంగా తెలియవస్తున్నాయి. కాని ఇవి అలభ్యం. వీటిలోని కొన్ని పద్యాలు మాత్రమే సంకలనగ్రంథాల్లో కనిపిస్తున్నాయి.

కందర్పకేతువిలాసంలోని కథేమిటో తెలియదు. లభించిన పద్యాల్లో నాయికానాయకుల విరహాలు, చంద్రవర్ణన ఉన్నాయి. రామలింగకవి ఈ కావ్యాన్ని నాదెళ్ళగోపమంత్రికి దగ్గరబంధువైన చిట్టమంత్రికి అంకితమిచ్చినాడట[2] ]

1. అక్కమలాక్షిఁ గన్గొనినయప్పటినుండియు నేమి చెప్ప నా
కెక్కడఁ జూచినన్మదనుఁ డెక్కడఁ జూచిన రోహిణీవిభుం
డెక్కడఁ జూచినంజిలుక లెక్కడఁ జూచినఁ గమ్మగాడ్పులిం
కెక్కడ వెట్ట యోర్వఁగల నీవిరహానలతాపవేదనన్[3]

---

1. ప్రబంధరత్నావళి పీఠిక 29పుట.
2. మానవల్లికవిగారి వ్యాసం. ఆంధ్రపత్రిక ఉగాది సంచిక (1914) 103పుట
3. ప్ర ర. (జ) 427ప.

2. కామిని చంద్రుఁజూచి మఱిఁగందు సరోరుహగంధి మందిరా
రామముఁజూచి మ్రానుపడు రాజనిభాననపారెకున్ శుక
స్తోమముఁజూచి యేఁకరును దొయ్యలి కోకిలఁజూచి కంటఁగెం
పౌ మదలీలఁదాల్చు మదనానలతాపవిషాదవేదనన్[4]

3. తారామనోరంజనారంభ మేదొడ్డు
శిలలు ద్రవింపంగఁజేయు ననినఁ
జాకోరహర్షయోజనకేళి యేదొడ్డు
పేర్చి యంభోధులుబ్బించుననినఁ
గుముదౌఘతాపోపశమకృత్య మేదొడ్డు
సృష్టి యంతయుఁజల్లనేయుననిన
వంనిశాకామినీవాల్లభ్య మేదొడ్డు
వర్ణింప సత్కళాపూర్ణుఁడనినఁ

దనకు సర్వజ్ఞశేఖరత్వంబు గలుగ
హితసుధాహారవితరణంబేమి దొడ్డు
ననఁగ విలసిల్లె హరిదంతహస్తిదంత
కాంతినిభకాంతిఁజెలువారి కంజవైరి.[5]

4. వారిజ, మీన, కోక, యళివర్గ, సితచ్ఛద, సల్లతావనీ,
యీ రుచిరాస్య మీనయన మీకుచ మీయలకాళి యీగతిన్
మీ రమణాంగి మత్ప్రియ నమేయగతిన్ విరహాతురాననన్
మీరును మీరు మీరు మఱి మీరును మీరును మీరుఁగానరే[6]

4. ప్ర.ర. (జ) 428ప. 5. ప్ర.ర. (జ) 429ప.
6. ప్ర.ర. (జ) 130ప.

మానవల్లి కవిగారీ క్రింది పద్యాన్ని కందర్పకేతువిలాసం లోనిదిగా ఉదాహరించినారు.[7]

5. లలితాస్యాంబురుహంబు నీలకచరోలంబంబు నేత్రాసితో
త్పల ముచ్చైస్తనకోక మోష్ఠవిలసద్బంధూక ముద్యత్కటీ
పులినంబుద్ధతచిత్తజాతరసవాఃపూరంబు ప్రాణేశ్వరీ
జలజావాసముఁజొచ్చి యాడక మనోజాతానలంబారునే!

7. కుమారసంభవ (ప్రథమభాగ) పీఠిక

# కమలాకరచరిత్రము

[దీని కర్త యెవ్వరో తెలియదు ఇందులోని ఒకపద్యంలో (మాటలకేమి అనే దానిలో) ప్రయోగింపబడ్డ 'జంజాటము' అనే పదాన్నిబట్టి ఈ కవి ఆధునికుడని చెప్పవచ్చు. కమలాకరుడనే రాజకుమారుని చరిత్ర ఇందులోని వర్ణ్యాంశం కావచ్చు రత్నాకరం గోపాలకవి రచించిన సకలలక్షణ సార సంగ్రహమనే లక్షణగ్రంథంలో ఇందులోనుండి మూడు పద్యాలు ఉదాహరింప బడ్డవి[1] ]

1. కాశ్మీరాశకోసలత్రిగర్తశకాంగకళింగదేశధా
   త్రీశులనెల్లఁజేరి పరికించితిఁగాంచితి వారి ధైర్యముల్
   భాసురభూరిఘోరవరభండనచండపరాక్రమక్రియా
   భ్యాసుల మించు మిమ్ముఁదలపన్విని వచ్చితి రాకుమారకా![2]

2. ఈ గహనభూమి బంధుర
   నాగవ్యాఘ్రోగ్రశరభనాగారియుతం
   బీగతి నొంటిగ నెచటికి
   నేగంగా రణమదేమి యిందువిభాస్యా![3]

3. మాటలకేమి వచ్చె విను మానవనాయక చొక్కమైన మి
   న్నేటిపసిండి తామరలహీనశిరోమణి గాంచుఁబొల్చు నా
   నాటికి విన్నుఁజేరమనినవ్విని నవ్వి నృపాలమౌళి జం
   జాటముమానిమంత్రిసుతసంయుతుఁడై రథమెక్కి యుద్ధతిన్[4]

---

1. సకలలక్షణ సారసంగ్రహంలోని కొంతభాగం ఆం.సా.ప. పత్రికలో ప్రచురింపబడింది. చూ:— సంచిక 6, సంపుటం 8; పేజీలు354-355
2. స.ల.సం. (ర.గో)చూ. ఆ సా.ప పత్రిక సంచిక 6, సంపుటం 8; పుట. 354.
3. అదే.
4. అందే.

# కవులషష్ఠము

నందిమల్లయ, ఘంటసింగన

---

[నంది మల్లయ, ఘంట సింగన అనే జంటకవులు రచించిన మహాభాగవతషష్ఠస్కంధమే కవులషష్ఠం. లక్షణగ్రంథాల్లో దీనికి త్రికవులషష్ఠం, శృంగారషష్ఠం, రాచమల్లువారి కవులషష్ఠం అనే పేర్లుకూడా కనిపిస్తున్నవి. కవులషష్ఠంనుండి పద్యాలను ఉదాహరించిన మొదటి లాక్షణికుడు ముద్దరాజు రామన. ఈ కావ్యం చిక్కతిమ్మరాజు కుమారుడైన తిమ్మరాజుకు అంకితమైనట్లుగ ఇందులోని "చండాంశుప్రభ" అనే పద్యంవల్ల తెలుస్తుంది.]

1. మనుజులలోపలఁగర్మం
బొనరుచువారెల్ల దండ్యులో వారలలోఁ
గనుగొనఁ గొందఱె దండ్యులొ
యనవుడు హరిభటులకనిరి యప్పార్శ్వచరుల్[1]

2. అదలిచి నిల్వ వారిఁగని యంతకుకింకరులెవ్వరయ్య మీ
రిదె యమునాజ్ఞఁ ద్రోచితిరి యెచ్చటనుండిట వచ్చినారలె
య్యది గతిమద్దపెట్టుటకు నెవ్వరివారలెఱుంగఁజెప్పుడా
యదితితనూజులో సురలొ యక్షులొ సిద్ధులొ కాక సాధ్యులో[2]

3. చిగురాకుఁబోఁడి మైచెమటపన్నీటిలో
నానుట త్రిషవణస్నానమయ్యె[3]

---

1. ల.సా.సం. I -134; సు.మ.రం. V -19.
2. ల.సా.సం. -137; సు.మ.రం. V -34, క.సం.వి. -21
3. ల.సా.సం. I -173.

4. చండాంశుప్రభ! చిక్కతిమ్మయతనూజా! తిమ్మ! విధ్వస్తపా
షండంబైన త్రిలింగభాగవతషష్ఠస్కంధకావ్యంబు నీ
కుండక్కెంజతురాననత్వగుణయుక్తుల్ మీఱ వాణీమనో
ఛందారోద్ధత చూరకారబిరుదప్రఖ్యాతి సార్థంబుగన్[4]

5. శ్రీఘ్రుంచేటికి వచ్చి సంసృతిభవశ్రీసౌఖ్యగంధంబె దా
నాఘ్రాణింపని మత్తనూజుల దురాత్మాభిఖ్యలంజేసినన్
శుఘ్రాదిన్యవమన్నఁజేసితి కృపాశూన్యుండవై గోముఖ
వ్యాఘ్రుంబింతియ గాక నీవు ఋషివే యాహా వితర్కింపగన్[5]

6. తనతోనల్గిన వాణిపాదములు మీఁదన్ వ్రాల లేనెత్త నా
య్యాన పాశ్చాత్యనిజాస్యతన్ముఖములందన్యోన్య మొక్కప్డు చుం
బనమబ్బంగఁజతుర్ముఖత్వము ఫలింపంజొక్కు పద్మాసనుం
డనవద్యాయురుదీర్ణుఁజేయు చికతిమ్మాధీశు తిమ్మాధిపున్[6]

7. పదముల్ దొట్రిలఁగొనుదీవ వెలయింపంగేశముల్డూలఁ బ
య్యెద వక్షోరుహపాళిఁజేర కనుదోయిన్ బాష్పముల్ గ్రమ్మ గ
ద్గదకంఠంబున వాక్యముల్దడబడన్ దద్గేహముంజొచ్చి యా
సుదతీరత్నము గాంచె బాలుని మనశ్శోకానలజ్వాలునిన్[7]

---

4. ల.సా.వం. I–210, క.వం. –35; ఆం.ప్ర ర. 168 పు.

5. ల.సా.వం. I–275;

6. ల.సా.వం. –267, సు మ.రం. V–330

7. ల.సా.వం. –317; సు.మ.రం. –153

8. అనుటయుఁ గృష్ణద్వైపా
యనతనయుండిట్టులనియె నవహితమతివై
విను మతిగుహ్యము నారా
యణకవచము భక్తివాంఛితార్థప్రదమున్[8]

9. తల్లి దండ్రియు దైవంబు దలఁప గురుఁడ
కాఁడె యతఁడేమి చేసినఁ గనలఁదగునె
నాస్తికాధమః యోరి యన్యాయవృత్తి
"నాస్తి తత్త్వం గురోః పరం"బనఁగ వినవె[9]

10. ఇవ్విధంబున మఱియు ననేకగతుల
లలితశృంగారచేష్టల లాచి లాచి
చూచుచున్నట్టి ప్రమ్లోచిఁ జూచి మునికి
మనసు గుంగురు మనియె ఝుమ్మనియె నొడలు[1]

11. సంతతభక్తియుక్తిఁ గొనసాగకయుండిన నుండనిమ్ము దై
త్యాంతకపాదపద్మములయందు నొకానొకయప్పుడే నిజ
స్వాంతము తద్గుణాభిరతుఁడై నరుఁడెప్పుడు గీలుకొల్పువా
డంతకుఁ దద్భటాళిఁ గలనైననుఁజూడఁడు భూవరోత్తమా![11]

---

8. ల.సా.వం. -63; ల.శి. V-407; అ.క. I-938;
క వం. - 51
9. అ.క. i -146; ల.సా.వం. II -241; సు.మ.రం. ii -179
10. ల.సా వం. II -244.
11. ల.సా.వం. I -262; ల.శి. V -313; ఛం. 159/7 కాకినాడ.

.2. మురదైత్యభేదికి మూర్ధంబు వంపని
యవినీతుతలఁ బట్టి యీడ్చి తెండు
అంభోధరశ్యామునా... ....
.... ... ..
వారిధిశయనుఁ జెయ్యారఁబూజింపని
జలజిత్తు (?) పెడకేలఁగట్టి తెండు
హరిమందిరంబునకు నలసుఁడై నడవని
హీనాత్ముఁగాల్పట్టి యీడ్చి తెండు
వలవదు భయంబు వారెంతవారలైన
నట్టివారలు మన కగ్గమైనవారు
వారు నిరయంబునకుఁ గాపువచ్చువార-
లనుచుఁ బుద్ధిగఁ జెప్పె మార్తాండసుతుఁడు.[12]

13. హంససమానగామికిని నట్టి వినూతనగర్భశుద్ధికిన్
బుంసవనాదికృత్యములు భూపశిఖామణి యార్యసంపదా
శంసితకర్మకర్మఠత సాంగముగా నొనరింప నన్వయో
త్తంసుఁ గుమారునిన్గనియె దర్పకు నిందిర గన్నకైవడిన్.[13]

14. ఎసఁగఁ బాత్రిక నోగిరంబిడకమున్నె
యతిరయంబునఁ బరివేషమాచరించుఁ
దత్తరమున నాపోశన మెత్తఁబోయి
భూసురుండెత్తు నుత్తరాపోశనంబు.[14]

---

12 అ.క. II -180; ల.శ. V -316; ల.సా.వం. -266

13. ల.సా.వం. II -268

14. అ.క. III -168; ల.సా.వం. II -285; సు.మ.రం. ''' -217; అ.రం.ఛం. IIIi -176, క.వం. i -99; అం.వ్రా.ర.48 b పు. ఈ పద్యం అ.రం.ఛం.లో వరాహ(వామన)పురాణంలోనిదిగా పేరొ బడింది.

15. ఇంటికిఁ జనుటయు మానెన్
వంటొనరింపంగఁ జాగె నాగరికలతో
కుంటెనకాదులఁ గూడెన్
గొంటరియై యతఁ డసాధుగోష్ఠిపరతన్[15]

16. పెరిగిన యీసునన్ నెమలిపింఛములన్ బురివిప్పఁబోలు నీ
సరసిరుహాక్షివేనలికి సాటిగ నిల్వఁగ నోడి చొచ్చె నిం
దిర శరణంబు తేటిగమి నీలములింద్రుని పేరు గాంచె పె
న్నిరులు గుహాశ్రయంబు గనియెన్నొఁగగ్గినవారికొ త్తరే[16]

17. నెరసె నెఱసంజ చక్రక
సరసీరుహవిరహఖేదసంసూచకమై[17]

18. గురుబంధుల్ దనుఁజుట్టి రాఁదిగిచి యాక్రోశింప విశ్చేష్టుఁడై
యొరలన్దన్నునెఱుంగలేక యసుహృద్వ్యాధా ర్తిముంజెందిచూ
పర దన్ రోయుచుఁబో వివర్ణత మెయిం బాటిల్ల[18] ... ....

19. అరిగి సమిత్ప్రసవకుశాం
కురపక్వఫలోత్కరంబుఁగొని గృహమునకున్
మరలి యట వచ్చునప్పుడు
ధరణీసురనందనుండు దన కట్టెదురన్[19]

15 ల సా.వం. –354;
1. ల.సా.వం. I –68, 165;
7. ల సా వం. –133.
18. ల.సా.వం. –160; సు.మ.రం. V–97.
19. ల.సా.వం. II –177

20. తెక్కలతో సరాగము నెఱింబరికింపదు వేడ్కఁజెంది యో
యక్కనకాచలంబు విబుధాధ్వమునం జనుదెంచుచున్న[20]

21. జాఱుటయుందదూరుయుగసాంద్రరుచుల్కటిమీద నుండి దై
వాఱినఁగాంచి పంచశరపంచశరీపరికంపితాత్ముఁడై
పాఱుడు దా బహుశ్రుతము బల్మియు భావవిశుద్ధి కల్మియున్
మీఱిన నెమ్మనంబు గడిమి న్నిలుపోపఁగలేక లోలతన్[21]

22. రాయైన తలిసి పేరంటాలిఁగ్రమ్మర
గలిగించు నడుగుచే వెలసినాడు[22]

23. వయసునఁజిన్నవాడ నఖివంద్యుఁడ నౌదునె మీకునంచు సం
శయ మొనరించెదేని మునిసత్తమ కార్యములందు నాగమా
ధ్యయనములందు మంత్రములయందు గరిష్ఠుఁడయేని పెద్ద ని
శ్చయమిది వానియం దఖిలసన్నుతమైన సువిద్య గల్గుటన్[23]

24. శ్రీరామామణి సీత నాథుని యురస్సీమన్ నిజచ్ఛాయఁ గ
న్నారన్ గన్గొని యాత్మ నన్యవనితేర్ష్యం బూనఁ దత్కంధరన్
హారం బున్పుచునింకఁ జూడుమనఁ దానౌటం ద్రపంజెందఁజె
ల్వారున్ రాముఁడు ప్రోచుఁగాత చికలిమ్మాధీశులిమ్మా-
దిపున్[24]

20. ల.సా.వం. iii –192
.21 ల.సా.వం. iii –251
22. ల.సా.వం. iii –281
23. క.వం.వి. i –13
24. క.వం.వి. i .99

25. అని యీ విద్య గురుప్రసన్నుఁడు పృథుస్వాంతుండునౌ చిత్రకే
తున్నృపాలాగ్రణికిచ్చి నారదమునీంద్రుం డంగిరోయుక్తుఁడై
చనియెన్ బంకజగర్భగేహమున కాసర్వంసహాభర్త దా
(నినుపాసించి) చరించె నేదహములన్ విద్యాధరాధ్యక్షతన్[25]

26. ఋషివర్యా ఘనమైన ...యన్వయము దుర్వృత్తంబునై వంశజా
మిషముల్ క్షేత్రములావహించిననమున్మేషంబునంబొల్చు మా
మానుషముల్ చేదిక పొందు . టనెందున్ మా కులస్థానపౌ
రుషముల్ పుత్రకుదుర్నిమిత్తమున పేరున్ సింపుమాలెన్ జుమీ[26]

27. ప్రాయశ్చిత్తాదులు నా
.... ... .... ... షం
దాయంజాలవు ధరణీ
నాయక మధుఘటము పుణ్యనదములఁబోలెన్[27]

25. ల.శ. V -314; పీ.భూ.61పు.

26. ఆం.ప్ర.ర.46 శ పు: ఛందో. 159/7 కాకినాడ.

27. ఛందో. 159/7 కాకినాడ.

# కళావతీశతకము

తేళ్ళపూడి కసవరాజు

---

[తేళ్ళపూడి కసవరాజు ఈ శతకకర్త. ఈ శతకంలోని పద్యాలు జగ్గకవి ప్రబంధరత్నాకరంలో ఉదాహరింపబడిఉండడంవల్ల ఈతడు క్రీ. శ. 1660 కి పూర్వుడని చెప్పవచ్చు.]

1. ఆ కంజాననయుపరతి
కాకాశము వడఁకెఁ దారలటునిటు పడియెన్
బోకైన (గి)రులు గదలెను
ఓకరమగు తమము చంద్రబింబముఁగప్పెన్.[1]

2. గురుకుచకుంభముల్గవలఁ గ్రొమ్ముడి వీడఁగ రాలఁ గ్రొవ్విరుల్
కరమణికంకణక్వణనకాచనగధ్వను (?) లుల్లసిల్లగా
భరతపుఁబిట్టకై వడిని బాదికిఁజేరెడి వెల్పె లాగునన్ (?)
బరిపరిరీతులన్ జెలఁగు భంగులు మెత్తుఁగదే కళావతీ![2]

3. ప్రకటితలీలఁగీలెడలి పాపట ముత్తెపుఁజేరు మోముపైఁ
దకపికలాడఁ గ్రక్కదలు దంతపుఁగమ్మలకాంతి మొత్తమై
పికచకపోలభాగముల వెన్నెల గాయుచునుండ సీవు నన్
(లకుముకభంగిగూడుమగ) లాగులు మెత్తుఁగదే కళావతీ![3]

పండిత వంగూరి సుబ్బారావుగారు తమ శ.క.చ లో(253పు) ఈ కింది మూడు పద్యాలను కళావతీశతకంలోనివిగా ఉదాహరించినారు. ఇవి ప్రాచ్యలిఖితాగారంలోని నెం.11–9–16 తాటియాకుల ప్రతిలోనివట.

---

1. ప్ర ర. (జ). 93
2. ఉదా ప. 94 3. ప్ర.ర. (జ). ఉదా.ప. 95

4. పీడెము తెత్తునో పసిడివీణియ మీటుచుఁ బ్రొద్దుపుత్తునో
కూడిన కుంకుమంబు చనుగుబ్బలనొత్తుక కౌగిలింతునో
వేడుక చంద్రకాంతమయవేదికమీదికి పందవత్తునో
వ్రూడిగమేమిరా యనుచు నూఱటపుత్తుఁగదే కళావతీ!

5. తకతికతాళమానమున తా విలసిల్లుచుఁబుష్పపాన్పుపై
కకపిక కక్కపిక్కయని కౌగిటిలోపల ధిక్కరించుచున్
చికితిని చిక్కతిన్(?)మిగులఁజిక్కితిరా యని మాటలాడుచున్
ప్రకటితలీలఁదెల్పుచును బాగులు మెత్తుఁగదే కళావతీ!

6. మలయజగంధి నీ చెఱగు మాసిన మూడు దినాలనుండియున్
వలపులరాయదేచె నుపవాసము నాలవనాట ప్రొద్దునన్
మలినముమాపి నీవు ఋతుమజ్జనమాడఁగ త్రాణవచ్చునో
పలుచని మోవితేనె సుఖపారణఁజేయఁగదే కళావతీ!

చాటుపద్యమణిమంజరి (2వభాగం)లో ఉదాహరింపబడ్డ ఈ క్రింది రెండు పద్యాలు కూడా కళావతీశతకంలోనివే కావచ్చునని వంగూరి సుబ్బారావు గారు తలంచినారు. (శ.క.చ 254పుట)

7. ఏమే పూర్ణశశాంకబింబవదనా? యేమే? జగన్మోహినీ
నీమీఁదాన మఱెక్కడన్ నిను వినా నేనెక్కడన్ జొక్కనే
నామీఁదం గరుణించి యేలంగదవే నన్నుఁగటాక్షింపవే
శ్రీ మించన్ భ్రమరాంబికాగుణమణీ స్త్రీలోకచూడామణీ!

8. నాఁడొకనాడుఁ నిన్నునెలనాఁగరో పొందిననాఁటనుండియున్
వేడుకఁబుట్టి మన్మథుఁడు వేదనసేయఁగ నోర్వలేక నీ
వాడకు వచ్చి చూడఁదలవాకిట రావెటుఁదొంగిచూచినన్

# కళా విలా స ము

## నన్నెచోడుడు

[నన్నెచోడుడు కుమారసంభవమే కాకుండా కళావిలాసమనే కావ్యాన్ని కూడా రచించినట్లుగ మొట్టమొదట తెలియజేసినవారు మానవల్లికవిగారు. కళావిలాసంలోనివని నాలుగు పద్యాలను వారు కుమారసంభవం (ప్రథమ భాగం) పీఠికలో ఉదాహరించినారు. నన్నెచోడుని కళావిలాసాన్ని పేర్కొంటూ అందులోని పద్యాలను ఉదాహరించినవాళ్ళు లక్షణకర్తల్లో గణపవరపు వేంకటకవి, సంకలనకర్తల్లో జగ్గకవి మాత్రమే.

క్షేమేంద్రుడు సంస్కృతంలో రచించిన కళావిలాసమనే గ్రంథంఒకటి ఉన్నది, కాని అందులో కథాంశమేమీ కానరాదు. నన్నెచోడుని కళావిలాసంలో మాత్రం కథాభాగం కనిపిస్తుంది. అందువల్ల నన్నెచోడునిగ్రంథం క్షేమేంద్రుని గ్రంథానికి అనువాదం కాదని చెప్పవచ్చు.

కళావిలాసంలోని పద్యాలు—ఇప్పటికి లభ్యమైనవి ఏడు మాత్రమే.]

1. నగజాత నారదు నుడి వి
నఁగలేకాగ్రహముఁ జెందినఁ గని హరుఁడు లే
నగవు నెలవి విగురగ తి
న్నగఁ బలికెన్ సతికి మునికి నాయము దోఁపన్.[1]

2. పాథోనిధిగాంభీర్యున్
రాధాకాముకపదాబ్జరాజత్సేవా
మేధాధుర్యతపోరా
గాధేయుని మునివతంసగాధేయుఁ గనిన్.[2]

---

1 ఆం వ్రా. 18 b పు. 2. ఆం.ప్రా.ర. 22 a పు.

3. తలపోయఁగ రుచులాఱును
గలుగును వాతంబుఁ గ్రిమియుఁ గఫముం జెడు నా
కలి పుట్టు దగయుఁ జెడుఁ ద
మ్ములము పదార్థంబు రాగమూలము ధరణిన్.[3]

4. తొడవులు పెట్టి సంభ్రమముతోఁ దిలకించు మడుంగుఁ గట్టుఁ బై
పడఁ దడవోప దింపెఱిగి పట్టను నేర్పులు గట్టిపెట్టుఁ బ
ల్తైదునెడఁ దొట్రుపాటొదవుఁ గింకకుఁ జెంగిలుమేన్ నెమర్పఁగాఁ
జిదిముడిఁ బొందుఁ గాంత పతిఁ జేరినఁ గూరిమి గల్గెనేనియున్.[4]

5. పృథులవిశ్వంభరారథమున కెదురుగాఁ
బూన్పించె నెవ్వాఁడు పువ్వుఁదేరు?
కాంచనాచలకార్ముకమునకు సాటిగాఁ
జెపట్టె నెవ్వాఁడు చెఱకువిల్లు?
నవిహతపాశుపతాస్త్రమ్మునకు వాడి
మిగిలించె నెవ్వాఁడు చిగురుఁదూపు?
నతులితామరదానవాదిబలంబుల
గెలిపించె నెవ్వఁ డయ్యళిబలంబు?

నట్టి జెగజెట్టి మన్మథుం డఖిలలోక
ములకు వెఱగొంగ జీవుల మూలకంద
మతని యిలు సొచ్చి వెడలనియతఁడుఁ గలడె?
యతని యమ్ములనుఁ బడకున్నయతడు గలడె?[5]

---

3. ప్రి.ర (జ) 4. ప్రి.ర. (జ)
5. ప్రి.ర. (జ)

6. శ్రీమంతుఁడు గుణవంతుఁడు
ధీమంతుఁడు రూపయుతుఁడు ధీరుండు కళా
ధాముండును గావలయును
దా మహిఁ గాముండు కామతంత్రవివేకీ![6]

కళావిలాసంలోని పద్యాలు కవిసంజీవని, రత్నాకరం, అథర్వణ ఛందం, లక్షణ శిరోమణి—ఈ గ్రంథాల్లో ఉదాహరింప బడినట్లుగా పేర్కొంటూ మానవల్లి కవిగారు కళావిలాసంలోని నాలుగు పద్యాలను కుమారసంభవప్రథమభాగపీఠికలో ఉదాహరించియున్నారు. ఆ నాలుగింటిలో మూడు జగ్గకవి పేర్కొన్నవే. శ్రీమంతుడు పద్యానికి మారుగా కవిగారీ క్రింది పద్యాన్ని ఉదాహరించినారు.

7. లలనలు గొందఱాత్మపతులం దగఁ గూడిన చెయ్వు లన్నియుం
దలచి సఖీజనంబులకుఁ దప్పక చెప్పెదువారు పుణ్యజీ
వులు చెలి యామినీశుని కవుంగిలి డాయుటెకాక తాల్మికి
ల్దొలఁగిన తీరుగీరునటఁ దోపపు నాకు రతిప్రయోగముల్.



6. ప్ర ర. (జ)

# కాదంబరి

## కేతన ప్రెగ్గడ

['కాదంబరీరసజ్ఞానామాహారోఽపి న రోచతే' అన్న ప్రశస్తిని పొందిన బాణుని కాదంబరికి ఇది అనువాదం. దీని కర్త కేతన ప్రెగ్గడ. ఆం.ప్ర.ర లో 'భాస్కరుని కేతన' కాదంబరీకర్త యని పేర్కొనబడి ఉండడంవల్ల ఈతడు తిక్కనపెదతండ్రియైన కేతన కావచ్చునని విమర్శకులభిప్రాయపడుతున్నారు. ఈతడు కవిత్వంలో సిద్ధహస్తుడని దశకుమారచరిత్రకర్త పేర్కొనడం, ఇతని తండ్రి భాస్కరుడు కావడం ఈ అభిప్రాయానికి హేతువులు. కేతన రచితంగా ఒక కువలయాశ్వచరిత్ర 'ఉదాహరణపద్యములు' అనే గ్రంథంలో పేర్కొనబడింది. మరి ఈ కేతన ఎవ్వరో స్పష్టంగా చెప్పలేం.]

1. జనవరేణ్యుఁగాంచి సాష్టాంగ మెఱఁగిన
నా విభుండు వాని లేవనెత్తి
కౌఁగిలించి వానిఁ గనుఁగొని కేయూర
కాభిధాన మొసగెఁ గౌతుకమున.[1]

2. డాచే యంకతలంబుఁజేర్చి వలచేతన్ మాలికన్దాల్చి లో
చెయ్వేల్ కొనసాగి పూవుపయి ........ తపోరాశినాఁ
జూచెన్ దప్పక తత్క్షణంబునఁ గడున్ శోభిల్లెనేమో మదిన్
సూచింపన్ కడగట్టి పల్కు మెయి..దా నాలించె[2] .... ....

1. ఆ.నం.ఛం.1 –213;
2. ఆం ప్ర ర. 148పు; ప.ల.సా.28పు; ఆ.నం./ఛం.1 -282

3. గంధర్వాత్మజ రాజుఁజూచెఁబతియుం గాదంబరిం జూచె ద
ర్పాంధీభూతమనస్కుఁడై మరుఁడు విల్లందెన్ బ్రసూనోల్లస
ద్గంధం బొప్పగ నెక్కువెట్టి గుణనాదంబాని పుష్పాస్త్రముల్
సంధించెన్ దెగఁబాపి యేయఁదొడగెన్ సవ్యాపసవ్యంబుగన్[3].

4. దీనిలోపలఁ గొన్నిదినము లుండిన నుష్ణ
కరుఁడైన నట శీతకరుఁడు గాడె
దీని పెంపెఱిగిన దానంబురాశిలోఁ
గాదని జలకాయి కాపు రాదె
దీని తీయనినీరు దివిజులు ద్రాగి చూ
చినఁ దమ యమృతంబు చేదు నారె
దీని తోయము తలపై నల్కినంతనె
పాపాత్ములును మోక్షపరులు గారె

యనుచుఁ గొలనినీటి యతిశీతలత్వము
బలుపు పెంపుఁ దీపు పావనతయుఁ
గడుముదంబు బెంపుగా వాజి పదివాఁగె
ద్రాటఁ దిగిచికొనుచుఁ దరియఁజొచ్చె.[4]

5. ఆనక యమృతంబు దా నిట్టి చవి యని
జనుల కేర్పఱుపగాఁ జాలువారు
చూడక మన్మథు సుందరాకారంబు
గరిమ చూపగఁజాలు కడకవారు
వినకయ పరతత్త్వవిపుల వినాదంబు
పనుతింపఁ జాలెదు వెరవువారు
యంటక మెఱపుల యందంబు ద్రేగును
గణుతింపఁ జాలు ప్రఖ్యాతివారు

3. ప.ర. (జ) 4. ప్ర.ర. (జ), ఉదా.ప.

కంపు గొనకయ కల్పవృక్షముల పుష్ప
సౌరభం బిట్టిదని చెప్పఁ జాలువారు
నెందుఁ జూచిన ధాత్రిలో హృదయదృష్టిఁ
గవులు గానవి మర్మంబు గలదె జగతి.

6. కడువేడి పెల్లెండ పుడమి వ్రేల్చినప్రొద్దు
లాకాశగతియ మేలని తలంప
వాత్యాభిహతి లగ్గవాడి వియచ్చరు
లవనిపైఁ జనుట మేలని తలంప
వడవడగా నీరు లుడికిన జలచరుల్
వనచరవృత్తి మేలని తలంప
వనములఁగార్చిచ్చు దనరిన వనచరు
లంబుసంచరణ మేలని తలంప

వాడి యెండ గాచె వడిగొనె సురగాడ్పు
లెసఁగె వడయగాలి నెగచెఁ జాల
దావదహన మడరె జీవుల కధికనం
తాపకాల మగు నిదాఘవేళ.

పై రెండు పద్యాలు కేశవ కాదంబరిలోనివని మానవల్లి రామకృష్ణకవి గారు కుమారసంభవప్రథమభాగ-అనుబంధంలో పేర్కొన్నారు.

# కువలయాశ్వ చరిత్రము

ఏర్చూరి సింగన

---

[తెలుగులో కువలయాశ్వచరిత్రను చెప్పిన కవులు కేతన, ఏర్చూరి సింగన, వవరం చిననారాయణ. వీరిలో తొలి ఇద్దరి రచనలు లభ్యం కాలేదు. సింగన కువలయాశ్వచరిత్రను ఎన్ని ఆశ్వాసాల ప్రబంధంగా రచించినాడో తెలియదు. కాని ప్రబంధరత్నాకరంవల్ల ఈ కావ్యంలోని పన్నెండు పద్యాలు మాత్రం లభ్యమౌతున్నాయి[1]. వీటిలోని ఒక పద్యాన్ని కూచిమంచి తిమ్మకవి ఉదాహరించినాడు.[2]

కువలయాశ్వుడు వందివి వేటాడుతూ పాతాళానికి పోయి మదాలసను పెండ్లిచేసుకోవడం ఈ ప్రబంధంలోని ప్రధానకథ. సింగన కువలయాశ్వ చరిత్రలో లభించిన పద్యాలు, బ్రాహ్మణులు, వైశ్యులు, గృహాలు, పుణ్య కాంతలు, శబరకాంతలు, శబరబాలికల క్రీడలు, మదాలసాసౌందర్యం, పుత్రో దయం మొదలైన అంశాలను వర్ణించేవి.]

1. ఆదిబ్రహ్మముఖాళి చాలక విహారార్థప్రయత్నంబుతో
వేదంబుల్ భువి ధర్మపోషణకునై విఖ్యాతిగాఁ బుట్టెనో
కాదే నిట్టి మహత్త్వమన్యులయెడన్ గానంబునాఁ బొల్తు రా
భూదేవోత్తము లప్పురంబున మహాపుణ్యప్రభావంబులన్.

---

1. చూ:— ప్ర.ర. 100—103పుటలు
2. ల.సా.వం

2. శేషఫణులకు మణులైనఁ జేరి యమ్మఁ
గోరి రత్నాకరంబైన గుత్తగొనఁగఁ
జాలి వరవస్తుసంచయసమితి నొనరి
పరగుదురు వైశ్యవరు లప్పట్టణమున.

3. గోపురగోపురప్రతిమగోపురముల్ చెలువొంద నప్పురిన్
మాపులు రేపులుం గనలు మంజులగీతవినోదకృత్యముల్
చూపఁగఁ గిన్నరాదు లవి చూచునెపంబున వచ్చి నేర్తురా
లాపవిశేషనర్తనవిలాసకలాపములన్ ముదంబునన్.

4. చల్లని పండువెన్నెలల సౌధతలోన్నతహేమవేదులం
దల్లన వల్లభుల్ గదిసినట్టి సుధాకరుఁజూచి ప్రాణముల్
జల్లన రాహువుం దలచి సయ్యన బాపుదు రంకసంగతో
త్ఫుల్లవధూముఖంబులను బొల్పగు కస్తురిపత్రభంగముల్.

5. ప్రాచీనంబులు రత్నకాంతులు లసత్ప్రాకారముల్ హేమముల్
సూచింపన్ ఘనవేదికుట్టిమములా శుభ్రాంశుకాంతింబులై
యే చోటన్ వరరత్నజాలములచే నింపొంది సొంపొందుచున్
వాచాగోచరమై గృహంబు లమరున్ వస్తుప్రశస్తోన్నతిన్.

6. తమ చూపు లొగిఁ బాంధతతులపైఁ బూవిన
భావజు కరవాలధాతులనఁగఁ
దమ కురుల్ యువమృగేంద్రములకై తీర్చిన
మరు నసమానంపు టురు లనంగఁ

దమ హాసములు విటోత్కరమానములఁ బట్టు
వలరాజు పూవులవలలనంగఁ
దమ కాంతి పురుషులఁ దాపంబునొందించు
రతిరాజు మోహనరసమనఁగ

జలజకాహళకదళికాపులినగహన
కోకబిసశంఖచంద్రాళికులముఁదెగడు
పాదజంఘోరుకటిమధ్యపటుకుచోరు
బాహుగళవక్త్రకచముల పణ్యసతులు.

7. నిరుపమధర్మస్థితిచే
వరపాతివ్రత్యనిరతివైభవమున న
ప్పురి పుణ్యకాంతలమరిరి
గిరి తత్పురివాణులెల్ల కీర్తితగతులన్.

8. గిటగిటనగు నెన్నడుములు
పుటపుటనగు చన్నుఁగవలు బున్నమనెలతో
చిటచిటలాడెడు ముఖములు
గటితలముల యొప్పు శబరకాంతల కొప్పుల్

9. మీఱిన భద్రనాగములమీదికి దాటి తదీయకుంభముల్
చూఱలు వట్టి కేసరికిశోరనఖావళినుండి రాలి సొం
పారిన మౌక్తికంబులు ప్రియంబున నేరి కిరాతబాలికల్
గీరనగింజలాడుదురు గేలిఁదలిర్పగఁ బక్కణంబులన్.

10. తన జన్మ మప్పులఁ దలమున్కలని రోసి
పులిన మీపొంకంబు బొందెనొక్కొ
పరికింపఁ దనపట్టు తిరిగెడి పాటని
పెన్నిధి సుడిమూర్తి బెరసెనొక్కొ

బ్రతుకెల్లగతి బట్టబయలాయెనని చూచి
    గగన మీపుట్టువుఁ గనియె నొక్కొ
పనిలేక పాసెడి పాపంబుఁ దలపోసి
    యిక్కువ లీరీతి కెక్కె నొక్కొ

యనగ లలన జఘన మంబుజముఖినాభి
చామనడుము బాల చన్నుదోయి
మహితరుచులఁ దెగడి మానవపతికన్ను
దోయిపండువగుచు దొరసె నంత.

11. తిమిరమంతయుఁబాసి దిక్కులు తెలివొందె
    నమృతాంశువులు నెందె నక్షత్రవీథిఁ
గువలయానందమై కోరికలిగురొత్తె
    విబుధుల మదిలోన వెట్ట లొదవె
నక్తంచరశ్రేణి నయమెల్ల దిగజాఱెఁ
    జిత్తజోల్లాసంబు చెలువు మిగిలె
దివ్యనీరంబుల తేటలల్లనఁ బర్వె
    భువనాధిపతివేడ్కఁ బొంగి పొరలె

దీపికాజాలమెల్లఁ జిత్రించినట్టి
రమణదోపంగ దృక్చకోరములు మెచ్చ
నమితతేజోవిరాజమానాత్ముఁడైన
పుత్రచంద్రుఁడు జననంబు వొందునపుడు.

పై పద్యాలన్నీ ప్రబంధరత్నావళిలో ఉదాహరింపబడ్డవి. "మీఱిన భద్రనాగము" అనే పద్యం కూచిమంచి తిమ్మకవి లక్షణసారసంగ్రహంలో కూడా ఉదాహరింపబడింది చూ. 1-246

# కూర్మపురాణము

మలయమారుతం మల్లన

---

[జంటకవుల్లో ఒకరైన ఘంటసింగనకు మలయమారుతము సింగన అనే వ్యవహారం ఉన్నది. ఆంధ్రప్రయోగరత్నాకరంలో 'మలయమారుతాభిధాన మల్లయ కూర్మపురాణం' అని పేర్కొనఁబడింది.[1] సింగన అనడానికి మల్లయ అని పొరపాటుపడ్డారా అంటే మరోచోట కూడా మలయమారుతం మల్లయ కూర్మపురాణం అనే ఉన్నది.[2] నంది మల్లయ, ఘంటసింగనల గృహనామాన్ని నిర్దేశించే సందర్భాల్లో లక్షణగ్రంథాల్లో వ్యత్యాసాలు కనిపిస్తున్నాయి. ఉదాహరణకు కొన్నింటిని చూపిస్తాను. నందిసింగన వామనపురాణం (అనంతరంగరాట్ఛందం) నంది సింగయ బలరామవిజయం (ఆంధ్రప్రయోగరత్నాకరం) ఈ నందిసింగన జంటకవుల లోని సింగన కాక నందిమల్లయ తండ్రి సింగన కావచ్చునేమో! ఐతే ఆయన వామనపురాణం చెప్పాడా? అని ఆరుద్రగారు సందేహిస్తున్నారు.

కూర్మపురాణంలో ఒక పూర్తిపద్యమూ, మరో పద్యంలో కొద్దిభాగమూ లభిస్తున్నాయి ]

1. సుదతి ..కంటఁదడి యొకింతయును లేక[3]

2. తలిరాకుబోణి నిడు క
న్గెలకుల కర్ణాగ్రపాళి నీలాంబురుహం
బలరినది యెట్టులన దృ
క్కులకిల తులగామిఁజేరి కొల్పువిధమునన్[4]

---

1. 36b పుట. 2. 18a పుట. 3. 18a పుట. 4. 36b పుట.

# కృష్ణవిలాసము

నాచన సోమన

[నాచన సోమన రచించిన ఉత్తరహరివంశం తెలుగుసాహిత్యంలో చాలా ప్రసిద్ధిపొందిన కావ్యం. ఈతడు ఉత్తరహరివంశమేకాక వసంత విలాసం, కృష్ణవిలాసం అనే కావ్యాలను కూడా రచించినట్లు లక్షణగ్రంథాలు పేర్కొంటున్నాయి వసంతవిలాసంలోని నాలుగు పద్యాలూ, కృష్ణవిలాసంలోని ఒక్క పద్యమూ ప్రస్తుతానికి లభ్యమైనాయి. వసంతవిలాసం పెక్కు లక్షణ గ్రంథాల్లో ఉదాహరింపబడగా కృష్ణవిలాసకావ్యం మాత్రం ఒక్క 'ఆంధ్ర కౌముది'లోనే ఉదాహరింపబడింది.]

1. నావంటిదాని నెంచక
యే వంచన నేసి పోయి వృష్ణికులుఁడు స
త్యావనిత యింట నరె
రేవానలు గురిసె నట హరిణనయన వినవే[2]

---

1. 'నాచనసోమయాజికృతే కృష్ణవిలాసే' అని కృష్ణవిలాసపద్యానికి అవ తారికావాక్యం—ఆం.కౌ.

2. ఆం కౌ; ఈపదం చివరిపాదంలో ఒక మాత్ర అధికంగా ఉన్నది.

# కృష్ణవిలాసము

### పరాతం అప్పన

---

[పరాతం అప్పన ఈ కావ్యకర్త. బృందావనంభవమనే మరో కావ్యాన్ని కూడా ఈతడు రచించినట్లుగా లక్షణ గ్రంథాలు తెలుపుతున్నాయి ఐతే ఈతని ఇంటిపేరు పరాంతం అనీ, పరావృతం అనీ, పరాతం అనీ మూడు రూపాల్లో కనిపిస్తుంది. ఐతే అసలు ఇంటిపేరు ఏమిటో!

సంస్కృతంలో భోజమహారాజు వ్రాసిన చారుచర్యను తెనుగుచేసిన అప్పన ఇంటిపేరు తెలియదు కనుక ఆ అప్పన, కృష్ణవిలాసకర్తయైన అప్పన ఈ ఇద్దరూ ఒక్కరే అని చెప్పడానికి వీల్లేదు.

కృష్ణవిలాసంలోని ఒకేఒక పద్యపాదం (ఎత్తుగీతి) ఆం ప్ర.ర. వల్ల తెలియవస్తుంది.]

1. ఋషులు ప్రార్థింప డాసి ( శ్రీ ) కృష్ణుఁడపుడు[1]

---

1. ఆం.ప్ర.ర 468 పుట

# కొట్టియ శంకరేశ్వర శతకము

కస్తూరి భట్టరాజు

---

[కొట్టియ అనేది 'కొట్టియదొన'కు సంగ్రహరూపమనీ, ఇదియే నేడు కొణదెన అని వ్యవహారంలో ఉన్నదనీ, ఇక్కడ ఉన్న శంకరేశలింగం ప్రసిద్ధమనీ, ఈ శంకరేశ్వరుని స్తుతిస్తూ కస్తూరి భట్టరాజు ఈ శతకాన్ని చెప్పి నాడనీ నిడదవోలువారు తెలుపుతున్నారు[1]. గౌరీకల్యాణమనే కావ్యం కూడా కస్తూరి భట్టరాజకృతమని మానవల్లివారు పేర్కొన్నారు [2] ]

1. పేర్చిన భక్తి సొమ్ముల నపేతకళంకుఁడు కాటకోటఁడ
భ్యర్చనసేయ వానికెదఁబాపితి నన్ను .. కండవా
నేర్చిన మేలుఁగీడరయ నేరని వేల్పుల నెల్లఁ బట్టి ప
ల్లార్చునె వాఁడు దుర్వృవగజాంకుశ కొట్టియశంకరేశ్వరా

2. పండయ యుత్తమోత్తముని గూటికిఁగప్పెరయై కడంగి యొం
దొండుగ నాటి యంగడికి నూరక తెచ్చితివంత యత్తటిన్
నిండిన వారిలోన నతనిం గడుఁబిన్నతనంబు జేర్చి తే
మందుము నీదు పెద్దతనమా యిది కొట్టియశంకరేశ్వరా![3]

పై రెండుపద్యాలను నిడదవోలువారు ఆంధ్రపత్రిక ఉగాదిసంచికలో ఉదాహరించినారు.

---

1. జయసంవత్సరసంచిక 184పుట.
2. కుమారసంభవ ప్రథమభాగ- అనుబంధం.
3. చా.వ.మం.2భా. 26పుట

# గాథాసప్తశతి

## శ్రీనాథుడు

[శ్రీనాథుడు తన నూనూగుమీసాల నూత్నయౌవనంలో చెప్పినగ్రంథం గాథాసప్తశతి. దీనినే ఆతడు శాలివాహన సప్తశతి అని పేర్కొన్నాడు. శాలివాహనరాజైన హాలుడు సంకలనంచేసిన ఏడువందల ప్రాకృతగాథల అనువాదమే ఇది. ఐతే ఈ అనువాదం నష్టమైపోవడం ఆంధ్రుల దురదృష్టం. గాథాసప్తశతిలోని రెండు గాథల అనువాదపద్యాలు క్రీడాభిరామంలో దొరుకుతున్నాయి[1]. తాననువదించిన గాథాసప్తశతిలోని పద్యాలనే శ్రీనాథుడు క్రీడాభిరామంలో వాడుకొని ఉంటాడని పండితుల అభిప్రాయం. మరోపద్యం (వారణసేయదావగొనవాఅనేది) ఒకానొక ఛందోగ్రంథంలో ప్లుతయతికి ఉదాహరణంగా చూపబడింది.[2] మానవల్లికవిగారీపద్యాన్ని కుమారసంభవ ప్రథమభాగంలో ఉదాహరిస్తూ ఇది శ్రీనాథుని సప్తశతిలో నాల్గవఆశ్వాసంలోనిదని పేర్కొన్నారు[3]. కవిగారి దగ్గర సప్తశతి ఉండిందేమో చెప్పలేం

విడదవోలువారు ప్ర. మ. భూ. పీఠికలో మరోరెండు పద్యాలను సప్తశతిలోనివిగా ఉదాహరించినారు.

క్రీ. శ 1931 లో జరిగిన కాకతీయచారిత్రకమహోత్సవాల్లో జరిగిన గ్రంథప్రదర్శనంలో శ్రీనాథుని గాథాసప్తశతి ప్రదర్శింపబడినట్టుగ కాకతీయ సంచిక తెలుపుతుంది.[4] ఆచార్య బిరుదురాజు రామరాజుగారి తాతగారివద్ద

---

1 చూ స ఆం. సా. 4 సం. 134 పుట.

2 ఛం గ్రం MNo, 326; D 705పుట 49b

3 కుమారసంభవం (పూ. భా) 4 ఆ. 568 పద్యం అధోజ్ఞాపిక

4. కాకతీయసంచిక, అనుబంధము, ఉత్సవము ప్రదర్శించిన గ్రంథములు

శ్రీనాథుని గాథాసప్తశతిప్రతి ఉండినట్లుగా, దానినే శేషాద్రిరమణ కవులు గ్రంథప్రదర్శనకోసం తీసుకొని మాన్యమందరామారావుగారికి ఇచ్చినట్లుగా, తరువాత ఆగ్రంథం తిరిగి వారికి రానట్లుగా వారు చెప్పుతునేవారనీ ఆచార్య రామరాజుగారు తెలుపుతున్నారు. ఏమైనా తెలుగు సాహిత్యంలో ఒక మహా కవి సంతరించిన మహాగ్రంథం నష్టమైనందుకు విచారించవలసినా అందులోని కొన్ని పద్యాలైనా దొరుకుతున్నందుకు కొంతైనా సంతోషించవలె ]

1. మాఘమాసంబు పులివలె మలయుచుండ
బచ్చడంబమ్ముకొన్నాడు పసరమునకు
ముదితచన్నులు పొగలేని ముర్మురములు
చలికి నొరగోయ కేలుందు సైరికుండు[5]

2. పటుఝంఝూపవనోత్తృణాలయములో భద్రంబునం బట్టికం
కటిపై ముచ్చముడింగి నిర్భరపయోగగ్లాని శోషించి యె
క్కటి నిద్రించుచునున్న పాంథవనితన్ గర్జావచః ప్రౌఢిమన్
దటిదుద్యోతము చూపు నట్టనదురే ధారాధర శ్రేణికిన్.[6]

---

5. క్రీడాభిరామం. 262 ప. ఈ పద్యానికి మూలమైన ప్రాకృతగాథాచ్ఛాయ.
విక్రీణీతే మాఘమాసే పామరః ప్రావరణం బలీవర్దేన
నిర్ధూమముర్మురనిభౌ శ్యామల్యాః స్తనౌ పశ్యన్. (గా. స. III. 38)

6. క్రీడాభిరామం. 60ప; దీనికి మూలమైన ప్రాకృతగాథాచ్ఛాయ.
ఝఞ్ఝావాతోత్తృణితే గృహే రుదిత్వా నివృహనిషణ్ణామ్
దర్శయతీవ గతపతికాం విద్యుదుద్ద్యోతో జలధరాణామ్. (గా.స.IV 15)

3. వారణసేయ దావగొనవా? నవవారిజమందుఁ దేటిక్రొ
వ్వారుచునుంట నీవెరుగవా! ప్రియ హా! తెరగంటిగంటికె
వ్వారికి గెంపురాదె తగవా మగవారల దూర నీ విథం
బారసి నీ నిజంబెరుగనంతకు నంతకు నోర్వ నెచ్చెలీ![7]

4. ఇంచిన బాలకేళిఁబరమేశ్వరు జూటకిరీటకోటిఁ గీ
లించిన చంద్రరేఖఁగబళింప మదిం దిలకించి కాళి లీ
లాంచితఫాలవీథి వికటాకృతిగాఁ గదియించి ముద్దుల
న్మించి నటించు దంతిముఖునిం బ్రణుతించెద నిష్టసిద్ధికిన్.[8]

5. భాగ్యవతులు మున్ను ప్రాణేశ్వరునిఁ జూచి
వడఁకువారు నూర్పు విడుచువారు
పులకలొత్తువారు బోలంగ ననుబోలంగ ననుబోటి
తన్ను మఱచునదియుఁ డిడవగలదె.[9]

పై రెండు పద్యాలను నిడదవోలువారు శ్రీనాథుని గాథాసప్తశతిలోని విగా ఉదాహరించినారు.[10] ఐతే ఇవి సప్తశతిలోనివే అని చెప్పడానికి ఆధారమేమిటో!

---

7. కు. సం. (పూ. భా.) 4 ఆ. 548 పద్యం అధోజ్ఞాపిక;
ఛం. గ్రం. MNo. 326; D. 705. పుట 43b. దీనికి మూలమైన గాథ ఇది.
"కస్స వ ణ హోఇ రోసో దట్ఠూణ పిఆఅం సవ్వణం అహరమ్।
సభమరకమలగ్ఘాఇరి వారిఅవామే సహసు ఏణ్హిమ్॥ గా. స. 880
దీని ఛాయ :
కస్యై న భవతి రోషో దృష్ట్వా ప్రియాయాః సవ్రణమధరమ్
సభ్రమరపద్మాఘ్రాణశీలే వారితవామే సహస్వేదానీమ్.
8. ప్ర. మ. భా. 31 ప. 9. ప్ర. మ. భా. 671 ప.
10. ప్ర. మ. భా. పీఠిక, 19 పుట.

# గిరిజాకల్యాణము

పింగళి సూరన

[రాఘవపాండవపీయం, కళాపూర్ణోదయం, ప్రభావతీప్రద్యుమ్నం, గిరిజా కళ్యాణం. గరుడపురాణం-ఈ ఐదు గ్రంథాలు పింగళిసూరన రచనలు. వీటిలో తొలి మూడుగ్రంథాలు పూర్తిగా మనకు లభిస్తున్నాయి. లాక్షణికుల పుణ్యమా అని అతని గిరిజాకల్యాణంలోని మూడు, నాలుగు పద్యాలైనా లభిస్తున్నందుకు సంతోషించవలె గరుడపురాణంమాత్రం తాను రచించినట్లుగ చెప్పుకున్నా[1] దీన్ని లాక్షణికులెవ్వరూ ఉదాహరించలేదు.

సూరన తాను లలాటేక్షణభక్తిశీలుడనని చెప్పుకోవడంవల్ల తద్భక్తిని ప్రకటించే గిరిజాకల్యాణం అనే కావ్యాన్ని ఆయన తన నూనూగుమీసాల నూత్నయౌవనంలో వ్రాసి ఉంటాడని ఆరుద్రగారు చెపుతున్నారు.[2]

కస్తూరిరంగకవి, గణపవరపువేంకటకవి తమ లక్షణగ్రంథాల్లో గిరిజాకల్యాణంలోని పద్యాలను ఉదాహరించినారు. ఈ కావ్యంలోనుంచి ఒకే ఒక పద్యాన్ని అనంతరలాక్షణికులు ఉదాహరించినారని ఆరుద్రగారు చెపుతున్నారు[3] కాని మనకిప్పుడు లభ్యమైనపద్యాలు నాలుగు.]

1. కోపాటోపంబున ధర
ణీపాలకచంద్రముఁడు మునిశిఖామణులన్
ద్రోపించిన వారు మరా
లాపము లాడుచునుఁ బోయి రాసమయమునన్[4]

1. ప్ర ప్ర; పీఠిక 6ప. 2. స. ఆం. సా. 8వం. 189 పుట
3. స ఆం సా, 8వం 189 పుట
4. అ. ర. ఛం. III—234, స. ల. సా. 51 పుట.

2. వికవిక నగి బిగిచ
వికముడి కొనగోట మీటె వెంబడిగా నీ
వికవిడఁజేరెదవే నీ
వికరాక పలుక[5] ...

3. బంగరుబొంగరాల నగుపోడిమి తోరపుగబ్బగుబ్బలిం-
దుం గుడియించు నెమ్మొగము తుమ్మెదలన్మెదలంగ-నినున్
ముంగురు లంగజాస్త్రములు మొక్కపడన్ ఘటియింపఁజాలు వా
ల్గంగవ దీనికే తనరు కాంతలలోఁ బరికించి చూచినన్.[6]

4. అంజలకరగి యగ్గింజనించినదంత
లేచి యగ్గించి చీలించకడిగినంత.[7]

---

5. అం. ప్ర. ర. 19 b పుట
6. అం. ప్ర. ర. 23 b పుట
7. అం. ప్ర. ర. 16 a పుట - ఈ పద్యపాదమస్పష్టంగా ఉన్నది.

# గోదావరీశతకము

## ప్రెగ్గడపల్లి పోతయ్య

---

[ప్రెగ్గడపల్లి పోతయ్య ఈ శతకకర్త. ఈతడు వ్రాసిన ఒకానొక పద్యశాసనమునుబట్టి ఈ కవి 1466లో నున్నట్లుగ తెలియుచున్నదని పండిత వంగూరి సుబ్బారావుగారు తెలుపుతున్నారు.[1] గోదావరీమహత్త్వవర్ణనం ఈ శతకంలోని వర్ణ్యాంశం. లభ్యమైన రెండు పద్యాలవల్ల ఈ శతకశైలి ఎంత రమ్యమో ఊహించవచ్చు.

1. స్థిరపుణ్యోదయమేదినీందువదనాసీమంతవీథీలస
ద్గురుముక్తాఫలసూత్రమో సురుచిరక్షోణీపురంధ్రీయశో
భరధమ్మిల్లలతాంతమాలికయొ భూతస్వీకుచశ్రీమనో
హారసువ్యాసమొ నాగ ఏచగు ప్రవాహంబొప్పు గోదావరీ![2]

2. ద్విరదాకారతఁ బేర్చి సంతమసరీతిం బొల్చి మేఘాకృతిం
బరపై శైలధృతిం దనర్చిన మహాపాపౌఘముం గిట్టి శే
సరిమాద్కిన్ రవిభాతి గాడ్పుగతి వజ్రస్ఫూర్తి దారించు వే
హరియించున్ విరియించుఁ ద్రుంచు భవదుద్యద్వారి గోదావరీ![3]

---

1. శ. క. చ. 738 పుట.
2. శ. క. చ. 738 పుట
3. శ. క. చ. పీఠిక

# గౌరీకల్యాణము

కస్తూరి భట్టరాజు

[ఈ కావ్యంలోని ఒకే ఒక పద్యం లభించింది.]

1. లలితసరోజసౌరభములం గలయం బని చూచి యెందు మె
చ్చొలయమి నాపురాంగనల యొప్పెడు వక్త్రసరోజగంధముల్
పలుమఱు గ్రోల సౌధములపై కవివర్గములేగు దానసం
కలితగజేంద్రగండఫలకంబుల కుప్పయనంబు సేయుచున్.[1]

---

1. ఈ పద్యం మానవల్లి కవిగారిచే కుమారసంభవ ప్రథమ భాగాను బంధంలో ఉదాహరింపబడింది.

# చంద్రాభరణశతకము

చక్రపాణి రంగనాథుడు

[పాల్కురికి సోమనాథునితో వాదించి ఓడిపోయి శివదీక్షను పొందిన చక్రపాణి రంగనాథుని కృతి యిది. రంగనాథుడు శ్రీశైలమల్లికార్జునునిపై శ్రీగిరినాథవిక్రమ మనేపేర '00 సీసపద్యాలు, 8000 పద్యాలున్న మహా గ్రంథం, వేయిపాదాలుగల దండకం, ఒక తారావళి, నాలుగు లయగ్రాహులు, ఒక వృత్తశతకం, వేయి దోధకవృత్తాలు, నూరు తోటకవృత్తాలు, ఏడు రగడలు, 3000 మత్తకోకిలలు, 600 గీత పద్యాలు, 8 మంజరులు, 500 కందాలు, 36 గద్యలు, 36 ఉభయ శతకాలు వ్రాసినట్లుగ గురురాజ చరిత్ర కర్తయైన సిద్ధనంజేశుడనే కన్నడకవి పేర్కొన్నాడు. ఇవికాక వీరభద్రవిజయం, శరభలీల అనే గ్రంథాలను కూడా వ్రాసినాడట. పోయిన తనకన్నులు తిరిగి వస్తే భగవంతునికి తనయెత్తు కృతులు సమర్పిస్తానని మొక్కి ఆ మొక్కుబడిని తీర్చుకోవడానికే రంగనాథుడిన్ని కృతులను రచించి ఉండవచ్చు. ఏమైనా ఈ కృతులన్నీ మనకిప్పుడు లభ్యం కావు. నయనరగడను, నమఃశివాయ రగడను ప్రభాకరశాస్త్రిగారు చా. ప. మం. (2భా) లో ప్రకటించినారు[1]. లక్షణగ్రంథాల్లోనూ, పెదపాటి జగ్గన సంకలనగ్రంథంలోనూ మరికొన్ని పద్యాలు లభిస్తున్నాయి.

రంగనాథుడు 13వ శతాబ్ది చివరిభాగంలోనూ 14వ శతాబ్ది ఆరంభం లోనూ ఉండి ఉంటాడని విమర్శకుల అభిప్రాయం. ఇతడు వరంగల్లు ప్రాంత నివాసి అని గోలకొండకవుల సంచికలో చెప్పబడింది.[2]

---

1. పుటలు 69–`9

2 406 పుట

సిద్ధనంజేశుడు రంగనాథకృతంగా పేర్కొన్న నూరుకందాలు చంద్రాభరణశతకానికి చెందినవే కావచ్చు. ఈ శతకంలోని రెండుపద్యాలు మాత్రమే ఇప్పటికి లభిస్తున్నాయి.]

ఫాలతల భస్మరేఖలు
మేలెప్పడెఱుంగనేర్చు మృగమదపంక
వ్యాలేపనాదిరుచులకు
జాలింపడుగాక బాలచంద్రాభరణా!

2. జడలల్లి భూతి పూయని
పొడవులఁ బొడగాన మాదిపురుషులలోనన్
నడుమంత్రపు సమయంబులు
జడమతు లలరించుకొనిరి చంద్రాభరణా!

పై రెండుపద్యాలు శ్రీ నిడదవోలువారి 'లక్షణగ్రంథములు-వాఙ్మయ పరిశోధన' అన్న వ్యాసంలో ఉదాహరింపబడ్డవి.[3]

'ఫాలతలభస్మరేఖలు' — అన్నపద్యం అసమగ్రంగా బాలబోధ ఛందస్సులో ఉదాహృతమైనట్లుగా ప్రభాకర శాస్త్రిగారు పేర్కొన్నారు [4]

3. ఆంధ్రపత్రిక, ఉగాదిసంచిక 1954–55
4. చా.ప మం. (2భా) 84పు.

# చమత్కారరామాయణము

[ఈ కావ్యంలో రామకథ చమత్కారంగా వర్ణింపబడిఉండటంవల్ల కవి దీనికి చమత్కారరామాయణమనే పేరు పెట్టిఉంటాడు. దీనికర్త ఎవ్వరో తెలియదు. అప్పకవీయం, మరో ఛందోగ్రంథం—ఈరెండింటి పుణ్యమా అని ఇందులోని రెండు పద్యాలు మనకు లభ్యమౌతున్నాయి.]

1. ఓ శశిముఖి లోపాము
ద్రేశుఁడు కలశభవుఁ డుండు నిట నతఁడు తపో
రాశి మహాత్ముఁడు మును పా
పోశనముగఁ గొనియె సాగరాంబువు లెల్లన్.[1]

2. నిన్నుఁ జెఱఁగొన్న హైహయు
కన్నను దోర్వీర్య మెక్కుడగు భార్గవులీ
అన్నిర్జించిన రాముని
కన్నను శూరుండు ముజ్జగంబులఁ గలఁడే.[2]

---

1 అ. క. iii — 163; ఛం. గ్రం. R 2322 తిరుపతి.

2 అ. క. iii — 239

# త్రైశంకవోపాఖ్యానము

కవి సింగరన్న

---

[ఈ కావ్యంలోని ఒకేఒక పద్యం అ. క. లోనూ, సు. మ. రం. లోనూ ఉదాహరింపబడింది. ఈ కావ్యకర్త కవిసింగరన్న అని సు. రం తెలుపుతుంది. సింగరన్న తన కావ్యాన్ని త్రిశంకూపాఖ్యానమనకుండా త్రైశంకవోపాఖ్యానమనడం ఆయన తద్ధితప్రయోగప్రియత్వాన్ని సూచిస్తుంది. 'ప్రియతద్ధితా దాక్షిణాత్యాః'—అని కదా భగవత్పతంజలి వాక్యం [1]]

1. ఝషకేతుద్విషునకు గి
లివృషపర్వతవృషున కమృతవిషనిధిజామా
త్రిషునకు ఋషిపూజితునకు
విషమాక్షున కింద్రముఖదివిజపక్షునకున్,-

---

1. చూ:—మ.భా. 1వ ఆహ్నికం యథా లౌకికవైదికేషు అన్నవార్తికభాష్యం.
2. అ. క. III—330, సు. మ. రం. I- 203

# దశగతులు

భాస్కరుడు

---

[పద్నాలుగో శతాబ్దికి చెందిన హుళక్కి భాస్కరుడు దీనికర్త. ఇందులోని ఒకపద్యం మాత్రం లభ్యమైనది. సంస్కృతంలో రచింపబడ్డ దశగతులనే గ్రంథానికి ఇది అనువాదమని మేదేపల్లి వారు అభిప్రాయపడుతున్నారు[1]. రెండవ ప్రతాపరుద్రుని గజసాహిణియైన సాహిణిమారనికి అంకితమైనది. హుళక్కి భాస్కరుడు తన రామాయణాన్నికూడా సాహిణిమారనికే అంకితం చేసినాడు.]

1. పలుకుటెలుంగు లాననవిభాతు లపాంగనిరీక్షణంబు లూ
   ర్పులు మరుపెట్టియైన వెలిపుచ్చరు నెచ్చెలు లేమి చందమౌ
   చెలువ తెఱంగు మీ కెఱుఁగఁ జెప్పితిఁ జెప్పెడిదేమి యిట్టిచో
   నలికులవేణి ద్రేర్పఁ దగదా గజసాహిణిమార! ధీమణీ![2]

---

1. భాస్కరరామాయణపీఠిక–2ᵛ పుట.
2. చం|గ్ర. D 705. అం. వి. 44 వ పుట

# దేవీ విజయము

[ఈ కావ్యాన్ని రచించిన కవి ఎవ్వరో తెలియదు. ఇందులోని ఒకే ఒక పద్యం అప్పకవీయ సుకవిమనోరంజనాలవల్ల తెలియవస్తుంది. కుంభ నికుంభాదిదైత్యులపై విజయాన్ని పొందిన దేవియొక్క మాహాత్మ్య వర్ణనం ఈ కావ్యంలోని వర్ణ్యాంశం కావచ్చు.]

1. వాక్త్రిణేత్రాంగనాశచీశక్తులధిక
సంభ్రమమునఁ గుంభనికుంభదైత్య
హంత్రిఁ బూజింపుదురు త్రయీమంత్రములను
స్తోత్రములు చేసి మంగళారాత్రిక లిడి.[1]

---

1. అ. క. 11-320; సు. మ. రం. 1-226

# ధ్రువచరిత్ర

నరసింగన్న

[ఈ కావ్యంలోని ఒక సీసపద్యపాదం ఆ. రం. ఛం. లోనూ, ఆం. ప్ర. ర. లోనూ ఉదాహరింపబడింది. రంగరాట్ఛందఃకర్త కావ్యకర్త పేరును తెలుపలేదు. కాని గణపవరపు వెంకటకవి ఈ కావ్యకర్త నరసింగన్న అని పేర్కొన్నాడు. ఏనుగు లక్ష్మణకవి (ప్రసిద్ధుడైన ఏనుగు లక్ష్మణ కవి తాత) కూడా ఒక ధ్రువచరిత్ర వ్రాసినట్లు తెలుస్తుంది. కాని ఈ రెండు ధ్రువచరిత్రలూ ప్రస్తుతం అలభ్యాలే.]

1. రాజులకును విపర్యాసబుద్ధి జనింప
యా సీమప్రజ కెల్ల హాని గాదె[1]

---

1. ఆ. రం ఛం. 1 –365; ఆం. ప్ర. ర. 25 b పుట

# చారుదేష్ణచరిత్రము

[చారుదేష్ణ సుదేష్ణకు పర్యాయపదం. కనుక ఈ కావ్యంలో సుదేష్ణ చరిత్రం వర్ణ్యాంశమన్నమాట. ఈ కావ్యంలోని రెండేరెండు పద్యాలు లభ్యమైనాయి వీటిలో ఒకటి పురవర్ణన సందర్భంలోనిది. రెండవది కీచకుడు ద్రౌపదిని చూచి ఆమె సౌందర్యాన్ని భావించే సందర్భంలోనిది కావచ్చు.

ఈ కావ్యకర్త ఎవ్వరో తెలియదు.]

1. అచ్చరలు నందనంబునఁ దెచ్చుకొను సు
రాగకుసుమములు హర్మ్యవాతాయనముల
చెంతఁ గాలూది తత్పురస్త్రీల కొసఁగి
వేడికొని పోవుదురు కపర్ణివీడియముల.[1]

2. ఈ లలన వేలుపుంజవ
రాలో యచ్చరయొ కిన్నరవధూమణియో
వ్యాళాంగనయో కాకీ
భూలోకస్త్రీల కిట్టి పొంకము గలదే।[2]

1. అ. క. III — 171; పి. భూ. 37 పుట.
2. అ. క. II 217; సు. మ. రం. II — 22

# చిత్రశేషభాగవతము

[ఆం. కా. లో చిత్రశేషభాగవతంలోనిదిగా ఒకపద్యం ఉదాహరింపబడింది ఇందులోనే శేషభాగవతంలోనిదిగా మరొపద్యం కనిపిస్తుంది. ఈ రెండు భాగవతాలూ ఒక్కటేనో, వేర్వేరో తెలియదు. వీటి కర్తలెవ్వరో కూడా చెప్పలేము.]

1. బృందావనమున వేసటఁ
జెందక వ్రేతలను గలయు చెన్నుగదా గో
విందుఁడని యొక్క చెలి యా
నందంబునఁ బలికె నొండు నలినేక్షణతోన్.[1]

1. ఆం. కా.

# జాంబవతీకల్యాణము

కళాధరకవి

[ఈ కావ్యంలోని ఒక్క ద్విపద షష్ఠ్యంతపదం విశేష్యంగా ఉన్నప్పుడు తద్విశేషణం ప్రథమాంతంలో ఉండవచ్చునే నియమానికి అం. కౌ. లో ఉదాహరణంగా ఈయబడింది. ఈ ఉదాహృతికి అవతారికగా ఉన్న "కళాధరకవికృతే జాంబవతీకల్యాణే ద్విపదప్రబంధే'' అనే అవతారికావాక్యం వల్ల ఇది ద్విపదప్రబంధమనీ, కళాధరుడనేకవి ఈ ప్రబంధకర్త అనీ తెలుస్తుంది. ఈ కవి క్రీ. శ. 1600 ప్రాంతంవాడనీ, కళాధరుడనేది బిరుదనామమనీ నిడదవోలువారు అభిప్రాయపడుతున్నారు; అంతేకాక ముడియం వెంకటరమణకవి 'కళాధరోపాఖ్యాన'మనే ప్రబంధాన్ని రచించిఉండడంవల్ల అతడే కళాధరకవిగా ప్రఖ్యాతిపొందెనేమో అనికూడా వారు అనుమానించినారు[1], ఇది శ్రీకృష్ణదేవరాయల సంస్కృతజాంబవతీకల్యాణానికి అనువాదమేమో]

1. వసుదేవతనయుఁడు వాసుదేవునకు
   బిసకుసుమేక్షణ ప్రీతిమై మ్రొక్కె.[2]

---

1. లక్షణగ్రంథములు – వాఙ్మయపరిశోధన అన్నవ్యాసం, ఆంధ్రపత్రిక ఉగాదిసంచిక (954-55). 2. అం కౌ.

# జైమినిరామాయణము

['ఆంధ్రకౌముది' అనే ఒక్క వ్యాకరణంతప్ప మరే ఇతరవ్యాకరణ గ్రంథంకానీ, ఛందోగ్రంధంకానీ జైమినిరామాయణాన్ని పేర్కొన్నట్లుగా కనిపించదు. ఉండె,ఒప్పె మొదలైనపదాలు వకారాదిపదాలనీ,అవి పరపదాలుగా ఉన్నప్పుడు సంధిలో వాటివకారం లోపిస్తుందనీ, పద్యాదిలోమాత్రం ఓష్ఠ్యోచ్చ పరమందున్న వకారం లోపించదనీ వివరించే సందర్భంలో ఆంధ్రకౌముదీకర్త జైమినిరామాయణంలోని సీతాకల్యాణఘట్టంనుండి ఒక్క పద్యాన్ని ఉదాహరించినాడు. ఈ రామాయణకర్త ఎవ్వరో తెలియదు.]

1. ఉవిద యొకర్తు మేన దొడవుల్దగిలించె ముదంబు మీఱగా
నవనిజ కప్పుదోర్తు వెలయన్నొసటన్ దిలకంబు దిద్దె నొ
క్క వనిత దొడ్గె మేన్ ఱవిక కాటుకిడెం గనులం దొకర్తు సాం
కవమృగనాభిపంక మొకకాంత యలందె విలాసమొప్పగన్.[1]

1. ఆం. కౌ.

# నృసింహపురాణము

వేములవాడ భీమకవి

---

[నృసింహపురాణం, శతకంధర రామాయణం, హరవిలాసం—ఈ మూడు గ్రంథాలు లక్షణ గ్రంథాల్లో భీమకవికృతంగా పేర్కొనబడ్డవి. ఐతే వీటిలో ఏ ఒక్కటీ ఇప్పుడు లభ్యం కావడంలేదు. లక్షణగ్రంథాల పుణ్యమా అని వీటిలోని కొన్నిపద్యాలు మాత్రమే లభిస్తున్నాయి.

భీముని నృసింహపురాణంలోనివిగా ప్రస్తుతానికి లభ్యమైన పద్యాలు తొమ్మిది మాత్రమే. అం. ప్ర. ర. లో ఉదాహరింపబడ్డ 'కెంజిగురునకున్' అనే పద్యం నృసింహపురాణంలోని ఆరో ఆశ్వాసంలోనిదిగా పేర్కొనబడడం వల్ల ఇందులో కనీసం ఆరాశ్వాసాలున్నట్లుగ చెప్పవచ్చు.]

1. ఉల్లసిల్లుచు మేలిమి యొల్లమేటి
యబ్జగర్భుని ప్రోలఁ బ్రత్యక్షమయ్యె[1]

2. వింగిపయినుండి గట్టుల
గొంగ కదున్ రాలవాన గురియించఁగ నా
లం గావ ముకుందుఁడు దా
ల్చెం గోవర్ధననగంబు లీలగ నేలన్[2]

3. ఈ క్షితికి వచ్చి వేగమె
దక్షారామమున వారతరుణుల నాట్యం
బీక్షించి యంతకష్టను
తత్క్షణమున నేర్చి రంభ తాఁ జేర్పఁ దగన్.[3]

---

1. ఆం. ప్ర. ర. 13 a పు, అ రం ఛం I -337. 2 ఆం. ప్ర. ర. 17 a పు. 3. ఆం. ప్ర. ర. 21 b పు.

4. శ్రీనాథ! భవత్పదములు
సానందధ్యానమహిమసంగతిచేతన్
పూనిన కొలిచిన వారల
కేనాఁడును వాంఛితార్థ మెల్ల ఫలించున్.[4]

5. మానవనాథుఁడు గంగా
స్నానాంతరము సకలదానములు మహా
దీనులగు విప్రకోటికి
పేనాదయతోడ నిచ్చి శివు సేవించెన్.[5]

6. కెంజిగురునకుం గతినత
వంజకు పాల్ పిచ్చుకుంటువానికి పకుపున్
నంజారుకు కమ్మఁదావియు
లంజెకు మేలెందు లేదు రావిటరాయా[6]

7. నృపతి నెగ్గిన సేకరించుక జల మెల్ల
రానీక యదిమి బలమ్ము దనరె.[7]

8. గూవిపీఁపు జనులు గుజ్జుపెట్టియు వ్రేలు
చండ్లు పునులుగారు రొండితీట
నోరనొండి పల్లు నోరఁ బోయిన మోరఁ
దనరియున్న లంజతల్లిఁ గాంచి.[8]

---

4.ఆ.ప్ర.ర. 37 పు. 5. ఆంప్ర.ర. 40a పు; ఆ.రం.ఛం. III—252.

6. ఆం. ప్ర. ర. 43 a పు.

7. ఆం. ప్ర. ర. 43a పు. 8. ఆం. ప్ర. ర. 25 b పు.

9. మరువముఁ బొంది పొంది విరిమల్లియపూవులఁ జెంది చెంది కే
సరములఁ గ్రాలి క్రాలి జలజాతపరాగము దూలి తూలి క
ప్పురమున నేచి యేచి సురపొన్నల వాసన మోచి మోచి తె
మ్మెరలునిరంతరంబును భ్రమించుచునుండుతదంతరంబుగన్[9]

వీరేశలింగం పంతులుగారు పై పద్యాన్ని వేములవాడ భీమన నృసింహ పురాణంలోనిదిగా పేర్కొన్నారు[10]

10. వాండిమి నల్లసిద్ధి జనవల్లభుఁ డోర్చిన రాజు భీరుఁడై
యాంధ్రనుఁ గానకుండ వృషభాంకము పెట్టికొనంగఁ జూచితో
నేండిదె యేమి నీవఘచు నెచ్చెలులెల్ల హసింప నంతలో
మూండవకంటితోడదొరమూర్తివహించిన మ్రొక్కెరంగనల్[11]

పై పద్యం ఆం. ప్ర. ర. లో భీమన చెప్పిన పద్యంగా మాత్రమే పేర్కొబడ్డా ఇది భీమన నృసింహపురాణంలోనిదని మానవల్లి కవిగారు సూచించినారు[12].

---

9. ప్రే. మ. భూ. 253 ప.

10. ఆం. క. చ. . (238,239పుటలు) 11 ఆం. ప్ర. ర.

12. కుమారసంభవపీఠిక (చూ:—మానవల్లికవి—రచనలు, 8 పుట)

# పంచబాణవిలాసము

[దీని కర్త యెవ్వరో తెలియదు. సంస్కృతంలోని పుష్పబాణ విలాసం వంటి శృంగారకావ్యం కావచ్చు. ఇందులోని ఒకే పద్యం లభ్యమౌతుంది.]

1. చిత్తమ్మున రంజిల్లుచు
ముత్తైదువ లపుడు గదిసి పూవిల్తునకున్
విత్తరికిఁ బలుతెఱంగుల
నెత్తిరి హారతులు పౌరులెల్లఁ జెలంగన్[1]

# పంచాస్త్రవిజయము

మల్లకవి

[ఆంధ్రకౌముది అనే వ్యాకరణగ్రంథంలో మాత్రమే ఈ కావ్యంలోని ఒక పద్యపాదం ఉదాహరింపబడింది. దీని కర్త మల్లకవి. ఈతడే మల్లకవో స్పష్టంగా చెప్పలేం. కావ్యంపేరునుబట్టి మన్మథుని విజయం ఇందులోని వర్ణ్యాంశమని తెలుస్తుంది.]

1. చురుకున నాట నేసె నవచూతసుమాశుగపంక్తి నా యెదన్[1]

---

1. సు. సా. 102 పద్యం; ల.దీ.
2. ఆం కౌ.

# పరమ భాగవత చరిత్ర

**లక్షణకవి అప్పన**

[శృంగారకవి తిరుమలనాథకవి, కట్టావరదరాజు, ఆలూరి కుప్పన, గోపవరపు వేంకటకవి, లక్షణకవి అప్పన మొదలైన కవులెందరో పరమ భాగవతచరిత్రను రచించినారు. కాని మనం ప్రస్తుతం చెప్పుకునే పరమ భాగవతచరిత్ర లక్షణకవి అప్పన రచించినట్టిది. ఆ. రం. ఛం; అం. ప్ర. ర. సు. పు. రం. ఈ కావ్యంలోని పద్యాలను ఉదాహరించిన లక్షణగ్రంథాలు, అలభ్యమైన ఈ కావ్యంలో లభ్యమైన పద్యాలు మూడు మాత్రమే.]

1. ఆశీర్వదించి కుతుకం దుచి
తానముం దగుచు రాజనందను నునిచి యా
వేశకృపామతి గావ
క్లేశవిషాదాత్ముం దగుటం గృతనిశ్చయుండై [1]

2 ఈ సరణిన్ కుమారమణి హెచ్చు తపంబొనరింప విందిరా
వాసుండు పీతవాసుం డుపవాస ... దివ్యనమేతుండై దయా
రాశి ఖగేంద్రయానమున రాసుత మ్రోలం బ్రసన్నుడై సము
ల్లాసముతోడ బాలకుతలన్ దనహస్తముం జెర్చి యిట్లనన్[2]

3. ముదమంది రామచంద్రుండు
మదిరాక్షిం గని.... గూర్చి మౌనియుం దానున్
మిథిల .... ....చ్చినచో
యెదురుకొనిమె వి ప్రుం దమ్మునీశ్వరు నధిపా ![3]

1. ఎ.మ.రం 1 - 76; ఆ.రం.ఛం.1 -105; అం ప్ర,ర. 266 పుట.

1. అ. ప్ర. ర. 28 bపుట 3. అం ప్ర. ర. 22 b పుట.

# ప్రద్యుమ్నోపాఖ్యానము

[ప్రద్యుమ్నుని కథను తెలిపేకావ్యాలు తెలుగు సాహిత్యంలో రెండు మూడు కనిపిస్తున్నాయి. వీటిలో ఒక పద్యుమ్నచరిత్ర పిన్నకోట పెద్దన్న కృతమని మానవల్లివారు కావిస్తే[1] వేటూరివారది పొన్నాడ పెద్దిరాజు కృతమని తెలిపినారు.[2] ఇది అలభ్యం. కొన్ని పద్యాలు ప్రబంధరత్నావళిలో ఉదాహరింపబడ్డవి.[3] ముప్పిరాల సుబ్బారాయకవి రచించిన ప్రద్యుమ్న చరిత్రం మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారంలో ఉన్నది[4]. ఫణిధపుఝి మాధవుడు ప్రద్యుమ్నవిజయం రచించినట్లుగా తెలుస్తుంది. కాని అదీ అలభ్యమే. లక్షణసారకర్త ప్రద్యుమ్నోపాఖ్యానంలోనిదిగా ఒక పద్యాన్ని ఉదాహరించినాడు. దీని కర్త ఎవ్వరో తెలియదు. లేదా ఈ పద్యం పైన పేర్కొన్న ప్రద్యుమ్నవిజయ, ప్రద్యుమ్న చరిత్రల్లో—నేవిలోనైనా ఉన్నదేమో। పరిశీలించవలె.]

1. పంచశరుం డనగను జా
లించి మహాప్రధనభూమి నీక్షించి మదో
దంచితుడై శంఖముఁ బూ
రించెం గులగిరులు దిక్కరివ్రజ మదఁగన్[5]

---

1. ప్ర. మ. భూ. పీఠిక. 5 పుట. 2. ప్ర. ర. పీఠిక. 21 పుట.
3. ప్ర. ర. 43—47 పుటలు.
4. D. 571
5. ల. సా. 127 పద్యం.

# ప్రబంధసారకృష్ణాభ్యుదయము

ప్రోవఢాంకమహాకవి

[ప్రోవఢాంకమహాకవి ఈ కావ్యకర్త. ప్రోవఢాంకుడనేది కవి నిజ నామమో లేక బిరుదనామమో తెలియదు. బిరుదనామమైతే దానికర్థమేమో! అం. కా. మాత్రమే ఈ కావ్యాన్ని ఉదాహరించింది.]

చెలువకు మనసార శిరసంటు వేడుక
నీకె కాక మరొకరికి నలవియే.[1]

1. అం. కా.

# బలరామవిజయము

నంది సింగయ

---

[ఆ. ప్ర. ర. లోను, ఆ. రం. చం. లోను ఈ కావ్యంలోని పద్యాలు ఉదాహరింపబడ్డవి. నంది సింగయ ఈ కావ్యకర్త అని వీటిలో ఉన్నది. నందిఘంటల జంటలో నంది వంశీయుడు మల్లయ కాని సింగయ కాదు. నంది మల్లయ అనడానికి బదులుగా నంది సింగయ అని పేర్కొనడం జరిగిందో లేక నందివారి వంశంలో ఒక సింగన ఉన్నాడో ! మొత్తంమీద ఈ జంటకవుల ఇంటి పేర్లను నిర్దేశించేప్పుడు లక్షణ గ్రంథాల్లో కొంత వ్యత్యాసం కనిపిస్తుంది. ఆ. ప్ర. ర. లో ఉదాహరింపబడ్డ 'లోకస్తుత' అనే ఈ కావ్యంలోని పద్యం ఘంట నాగయ బలరామవిజయంలోనిదని పేర్కొనబడింది. ఇందులోని ఒక పద్యం (ఒక వరము అనేది) పంచమాశ్వాసంలోనిదని ఉదాహరించడంవల్ల ఈ కావ్యంలో కనీసం ఐదాశ్వాసాలు ఉన్నాయని చెప్పవచ్చు.

'లోకస్తుత హరిదిభ' అనే పద్యంలో తుళువ వంశానికి చెందిన రాజు ప్రశంస ఉండడంవల్ల ఈ కావ్యం తుళువరాజుకు అంకితమని ఊహించవచ్చు.]

1. ఒక వరము నీదు నెమ్మది
కిక కావలసినది యడుగు మిచ్చెద నని యం
తకవైరి యాన తిచ్చిన
మొకమాట మొకింత లేక మునివరుఁ డంతన్[1]

---

1. ఆ. ప్ర. ర. 193 పు. ఈ పద్యం పంచమాశ్వాసంలోనిదని పేర్కొనబడింది.

2. ముదిత ముదితయైతన
రదనరంతులు మదిఁ దెలియు మునిచంద్రున్
మదనకదనమ్మునఁ దేలిచి
సదమదముగ పర్ణశాల చయ్యన వెడలెన్[2]

౩. లలిచిది కీర్తిహంసికి
జలజభవాండంబు గ్రుడ్డు[3]

4. లోకస్తుత హరిదిభదం
తీకృతనిజశుభ్రకీర్తిదీధితివిభవా।
ప్రాకటతుళువాన్వయనీ
రాకరరాకాశశాంక! రాజద్వదనా![4]

5. క్షత్రియధర్మంబున నూం
ధాత్పృఁడు రాజ్యంబు నీతిఁ దగఁ బాలించెన్
శాత్రవరహితంబుగ నిజ
గోత్రము వెలయంగఁ బ్రజలు గొనియాడంగన్[5]

---

2. ఆం. ప్ర. ర. 20 a పు.
3. ఆం. ప్ర. ర. 44 a పు.
4. ఆం. ప్ర. ర. 48 b పు.
5. అ. ర. ఛం. III – 71

# బలవదరీశతకము

కందుకూరి రుద్రకవి

[అలభ్యమైన ఈ శతకాన్ని చెప్పిన కవి కందుకూరి రుద్రకవి. నిరంకుశోపాఖ్యానం, సుగ్రీవవిజయం, కొన్ని అష్టకాలు ఈతని రచనలు. వీటితో పాటు జనార్దనాష్టకం అనే కావ్యాన్ని కూడా రుద్రకవి రచించినట్లు ప్రతీతి ఉన్నట్లుగ కవుల చరిత్ర తెలుపుతున్నది.

రుద్రకవి బలవదరీశతకంలోని నాలుగు పద్యాలు మాత్రమే లభిస్తున్నాయి.]

1. కలశపయోధిమీదఁ దరఁగల్ మఱి హోరని మ్రోయవేయుఁ
గులతలపాన్పు పాము బుసకొట్టఁగ నేగతి నిద్ర చెందెదో
యలసతఁ దండ్రి! చీమ చిటుకన్నను నిద్దుర రాదు మాకు నో
బలవదరీ దరీకుహరభాస్వదరీయదరీదరీ హరీ!

2. కలుషసరిత్తరీ పుషితగంధకరీ మహిభృత్కరీ భవా
చలభిదురీ దయారసవిశాలఝరీ నిగమార్థమాధురీ
ఖలగజకేసరీ విభవకంపితమేరుగిరీ లతాదరీ
బలవదరీ దరీకుహరభాస్వదరీయదరీదరీ హరీ!

3. అల పగవాని తమ్ముఁడు భయాతురుఁడై చనుదెంచినంతనే
బిరబిర వచ్చితివనుచుఁ బట్టము గట్టవె లంక కప్పుడే
కొలిచిన నిన్నె కొల్వవలె కోరికలిచ్చిన నీవ యీవలెన్
బలవదరీ దరీకుహరభాస్వదరీయదరీదరీ హరీ!

పై మూడు పద్యాలను ప్రభాకరశాస్త్రిగారు చా. ప. మ. లో పేర్కొన్నారు[1]. వీటితోపాటు ఈ క్రింది పద్యాన్ని కూడా పంచాననపత్రికాధిపతి ప్రకటించినట్లు డా॥ రేపూరి అనంతపద్మనాభరావుగారు పేర్కొన్నారు.[2]

4. పిలువని కూటికిన్ వెతలఁ బెట్టు ధరావరుఁ దేలు వీటికిన్
బలములు లేని యేటికిని సారెకు బందుగులున్న చోటికిన్
బలువురతోటి పోటికి నృపాలురసాటికిఁ బోవరాదయా
బలవదరీ దరీకుహరభాస్వదరీయదరీదరీ హరీ .

1. 110 పుట. 2. కందుకూరి రుద్రకవి. 31, 32 పుటలు.

# బృందాపంభవము

పరా (వృ) తం అప్పన

---

[ఈ కావ్యంలోని రెండు పద్యాలు మాత్రమే లభిస్తున్నాయి. వాటిలో 'పోనుద్యోగము' అనే పద్యం కొన్ని లక్షణగ్రంథాల్లో మధుసేనంలోనిదిగానూ, మరికొన్నింటిలో మదనసేనంలోనిదిగానూ ఉదాహరింపబడింది.]

1. పో నుద్యోగము చేసిన
ప్రాణంబా యిదియె నీకుఁ బాథేయంబా
మానిని మందస్మితమధు
రానన చంద్రికలఁ గ్రోలి యరుగుము పిదపన్[1]

2. లేజవరాంద్ర చూపుచిలికి న్మెఱుఁగెక్కిన కల్కిరేకు జం
డా జలిపించి తక్కపితనాథుల తాల్మి చిరాలు పచ్చ తే
జీ జగరౌతు కంఫె వడిఁ జించి హళాహళి సేయఁగానియం
దే జగడంబు లేదు భటులెన్న నలంకరణార్థసాధకుల్[2]

---

1. ఆ.రం ఛం. II-37, ఈ పద్యం అ.క లో మధుసేనంలోనిదిగానూ, ల శి;ఆం.ప్ర ర.స ల.సా. వీటిలో మదనసేనంలోనిదిగానూ పేర్కొనబడింది.

2. ల.శి. V-128

# బ్రహ్మాండపురాణము

కవిమాధవుడు

[కవిమాధవుడను కవీశ్వరుడే పురాణకర్త. కస్తూరి రంగకవి, గణపవరపు వేంకటకవి-ఈ ఇద్దరు మాత్రమే ఈ పురాణాన్ని ఉదాహరించినారు. కస్తూరి రంగకవి ఈ పురాణకర్త పేరును పేర్కొనలేదు. కాని గణపవరపు వేంకటకవి తానుదాహరించిన ప్రతిపద్యంతోబాటు ఈ పురాణం కవిమాధవకృతమని చెప్పినాడు.]

1. నృపవరాగ్రణి విను మింకమీద తావకా
 న్వయమున సారసనాభుఁ డుదయ
 మంది దురాత్ముల నడఁచు[1]

2. రాక్షసేశ్వరుఁ డెదిరిన తత్క్షణమున
 మ్రాఁకుకొని విలుఁ డగ్గింప మన్నిగొందు[2]

3. రోషంబునను బ్రోవరో మునీశ్వరులార
 యని పల్కెఁదన విధి నరుగువేళ[2]

4. అబ్ధిశయన నారాయణవిగ్రహ
 యంబుజనాభ వేదాంతవేద్య.[4]

---

1. అం.రం.ఛం. -334, అం.ప్ర.ర. 13a పుట
2. అం.ప్ర.ర.21b పుట
3. అం.ప్ర.ర.52a పుట, అ.రం.ఛం. -138
4. అం.ప్ర.ర.32b పుట

# భల్లాళరాయచరిత్రము

## భట్టార్యుడు

[కవిమేధాతిథియైన భట్టార్యుడీ ద్విపదప్రబంధకర్త యని ఆంధ్రకౌముది వల్ల తెలుస్తుంది. ఇందులో ఉదాహరణంగా చూపబడ్డ ద్విపద మోహినీ సౌందర్యవర్ణనపట్టంలోనిదట.

పిండుకటకరాజైన భల్లాణుడనే శివభక్తుని కథ ఈ ప్రబంధంలోని వస్తువు కావచ్చు.

కూచిమంచి తిమ్మకవి, కొట్ర బాలకవి,మల్లవరపు వాలేశ్వరుడు, ఏనుగు లక్ష్మణకవి, చిత్తరువు గంగాధరుడు మొదలైన కవులుకూడా భల్లాణుని చరిత్రను వ్రాసినట్లుగా తెలుస్తుంది.[1]:

భట్టార్యుని భల్లాళరాయచరిత్రలోని ఒకేఒక ద్విపద లభ్యమౌతుంది.]

1. కాము మామను రాహు కబళించుమాడ్కి
కోమలి మొగము ముంగురు లాక్రమించె[2]

---

1. చూ.- ఆంధ్రకవిసప్తశతి; చిత్తరువు గంగాధరుని భల్లాణచరిత్ర శృంగారగ్రంథమాలలో నాల్గవ పుష్పంగా ముద్రితమైనది. ప్రకాశకులు: జి. యస్. శాస్త్రి అండ్ కో, మదరాసు; 1928; మల్లపరపు వాలేశ్వరుని భల్లాణచరిత్రప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో ఉన్నది. RNO. 393,
2. ఆం.కౌ.

# భావపంచాశతి

[దీని కర్త ఎవ్వరో తెలియదు. ఇందులోని ఒక్క పద్యం మాత్రమే లభిస్తుంది. లభ్యమైన పద్యాన్నిబట్టి ఇందులో వేదాంతతత్త్వం వివరించబడి ఉంటుందని ఊహించవచ్చు ]

1. జీవుఁడు కర్త నాశనము సృష్టియు వేదనువుల్ నివాసముల్
దేవత శబ్దమాత్రము ఫలించు ఫలంబిది కర్మవృత్తి దుః
ఖావళి మానిపోక యసమంచితనిర్వృతి యంచుఁ దత్త్వసం
భావము విన్యసింతురు ప్రభాకరశాస్త్రమతానువాద(కు)ముల్[1]

1. ఛం.గ్రం.D 705 (ఆం.వి.) 56b పుట.

# మదనవిజయము

## రావిపాటి త్రిపురాంతకుడు

---

[అంబికాశతకం, తారావళి, ప్రేమాభిరామం, త్రిపురాంతకోదాహరణం, మదనవిజయం-ఇవి త్రిపురాంతకుని కృతులు వీటిలో మదనవిజయం రతిశాస్త్ర గ్రంథమనీ, వాత్స్యాయన కామసూత్రాలకిది అనువాదగ్రంథమనీ మానవల్లివారు తెలిపియున్నారు అంతేకాక కవిగారు తాము చూచిన ప్రతిలో పూర్వపీఠిక లేదనీ, తాళపత్రములు బూజుపట్టి విడదీసినచో సహస్రశకలాకారములందుండెననీ, తద్గ్రంథస్వాములు తమ పైతృకధనమని దానిని తమ కీనొల్లకుండి, రెండపరనీ మారు చూపలేదనీ త్రిపురాంతకోదాహరణ పీఠికలో వ్రాసినారు[1]. ఒక ప్రాచీన కవి తెలుగులో సంతరించిన వాత్స్యాయనకామసూత్రాల అనువాదగ్రంథం మనకు లభించకపోవడం విచారకరమైన విషయం.

కవిగారు త్రిపురాంతకోదాహరణపీఠికలో మదనవిజయంలోనివిగా ఈ క్రింది రెండు పద్యాలను పేర్కొన్నారు.]

1. పతి గుణవతియగు నేనియుఁ
బతి కది రత్నంబు ప్రాణబంధువ యమృతం
బతివయ దుర్గుణి యగునేఁ
బతికెడపని చిచ్చు కాలపక యది కాల్చున్

2. గుణమున్ సుందరరూపమున్ విభవముం గూటంబు సౌభాగ్యల
క్షణముం జారుచరిత్రమున్ వినయమున్ జాతుర్యమున్ ధర్మభూ
షణముం గల్గి పతివ్రతామహిమ మించన్ గల్గెనేఁ దత్సతీ
మణిచింతామణి దానిఁ జాల్పఁ గలుగన్ మర్త్యుండె ధన్యుండిలన్

---

1. మానవల్లికవి-రచనలు; ౧౫-౧౬పుటలు.

# మదనసేనము

## నంది మల్లయ్య

[నంది మల్లయ్య, ఘంట సింగన అనే జంటకవుల్లో ఒకరైన నంది మల్లయ ఈ కావ్యాన్ని వ్రాసినట్లు జగ్గన ప్రబంధరత్నాకరంవల్ల తెలుస్తుంది. "జంటకవిత్వం మొదలుపెట్టకముందో లేక విడిపోయినతరువాతనో నందిమల్లయ ఈ కావ్యాన్ని వ్రాసిఉంటాడని ఆరుద్రగారు భావిస్తున్నారు[1]" ఐతే నిడదవోలు వారు మాత్రం సింగన్న కృతంగానే పేర్కొన్నారు.[2] ప్రబంధరత్నాకరంలోనూ, ఆంధ్రప్రయోగరత్నాకరంలోనూ మదనసేనంలోని పద్యాలు ఉదాహరింపబడ్డాయి. ప్ర మ భూ లోని ఒక పద్యాన్ని నిడదవోలువారు మదనసేనంలోనిదిగా భావించినారు.

అ.క; ల సా సం; సు.మ రం. మొదలైన లక్షణగ్రంథాల్లో ఉదాహరింపబడ్డ "పోనుద్యోగముఁ జేసిన" అనే పద్యం మధుసేనంలోనిదిగా పేర్కొబడింది. ఐతే ఈ పద్యమే ఆం.ప్ర ర;ల శి. మొదలైనవాటిలో మదనసేనంలోనిదిగా ఉదాహృతమైంది. మదనసేనమే పొరపాటున మధుసేనంగా పేర్కొనబడిందో లేక అది వేరే గ్రంథమో స్పష్టంగా చెప్పలేం. మదనసేనుడనే రాజకుమారుని చరిత్రం ఇందులోని వర్ణ్యాంశం కావచ్చు.

1. అపుడు తానావసానంబునందు మధ్య
కీలితంబయి యొప్పెఁ గెంగేలు వలికి
నలియవు గదా యటంచు నా నడిమి తీఁగ
నుపచరింపఁగ వచ్చినదో యనంగ[3]

---

1. స.ఆం.సా (6సం 253పు.)
2. ప్ర.ర పీఠిక 20పు.
3. ప్ర.ర. (జ)

2. తళతళ మను పతాకలతోడ రవికాంతిఁ
దళతళ మనెడి రత్నములతోడఁ
గనగనసొబ గధికంబైన పొదవుతోఁ
గనకనమను హేమకాంతితోడఁ
గలకలఁ బల్కు చిల్కలతోడ గృహదీర్ఘి
కలఁ గలహంస సంఘములతోడఁ
బరిపరిగతి నాడు బర్హులతో నిజో
పరిపరిగతి మేఘపంక్తితోడఁ

దముల విహరించు పారావతములతోడ
భ్రమదళి వ్రాత సుమవితానములతోడఁ
బ్రమదవనవాసనలచేతఁ బ్రమద మొసగి
యెనయు నీ మేడతోఁ బ్రీతి యెనయఁగలదె[4]

3. పరిపుల్లహల్లక ప్రభలు విండినచోట
సాంధ్యరాగద్యుతి చౌకళింప
వికచనీలోత్పల ప్రకరస్థలంబుల
గిఱికొన్న చీకట్లు గ్రేళ్లు దాట
విర్ణిద్రకుముదవనీప్రదేశంబులఁ
దేలు వెన్నెల పిల్లతీపులాడ
వికసిత కనకారవిందబృందంబులు
బెరయునీరెండఁ బింపిళ్లు గూయఁ

బగలు రేయును దమలోనఁ బగలు మాని
కలసిమెలసిన బాగున గడలుకొల్పి
వివిధమహిమలఁ దనరు నా విమలసరసిఁ
జూచి నివ్వెఱపడి రాజసూనుఁ డపుడు.[5]

4 ప్ర.ర. (బ)    5. అందే.

4. మెఱుఁగుశృంగములందు మెదలక యున్నవి
నీలమేఘంబులు నీరజాస్య
వెన్నెలపులుగులు వేకువ చంద్రుపైఁ
దేలుచున్నవి చూడు తియ్యఁబోడి
మింట నాగడపలు మెల్లమెల్లన విచ్చి
కానరావయ్యెనో కలువకంటి
పారిజాతపుఁదీఁగ బహువర్ణపుష్పభా
రంబు మోవఁగలేదు కంబుకంఠి

యనుచుఁ దమలోన గర్వోక్తు లాడుకొనుచుఁ
దనకు నుపచారములు వేయు నముఁగుఁ జెలులఁ
జూచి నవ్వుచు సహజన్య చూడనొప్పెఁ
జారుదోహదలక్షణసహిత యగుచు.[6]

5. ఏ నుద్యోగముఁ జేసిన
ప్రాణంబా యింక నీకుఁ బాథేయంబా
మానివి మందస్మితమధు
రానన చంద్రికలు గ్రోలి యరుగుము పిదపన్.[7]

---

6. అందే.

7. అ.క( II –337), ల.సా.వం. ( ii -64) సు.మ.రం ( I -198) వీటిలో ఈ పద్యం మధుసేవంలోవిదిగాను, ల.శ. (IV -408), ఆం.ప్ర.ర.(16 శ పు)ల్లోమదనసేవంలోవిదిగాను ఉదాహరింపబడింది.

6. చూచి నమస్కరించి కడు సోద్యము తావకవర్తనంబు నీ
కి చిరజీవితాగుణము నీ తనుకాంతియు నిత్యతృప్తియున్
ఖేచరముఖ్యసిద్ధులును నిర్జరభావమునట్లు గగ్గె మం
త్రాచరణ ప్రభావము... యన సేవలు జేసినారవో.[8]

7. ఆరాబాలకామారసూనారదివ్యా
మరాళధ్వజారోనమాంతాతనూజా
కరాళస్ఫురత్తీక్ష్ణకౌక్షేయధారాం
తరాళప్లవద్వైరిధావత్స్వధర్మా[9]

8. తనకు ముందఱ నింక తలవంపు లౌనని
నాతి చన్మొక్కలు నల్లనయ్యెఁ
దన యౌవనార్ధమింతటఁ దీరునో యని
పల్లవాధరి మోము వెల్లనయ్యెఁ
దనయులు లేమికిఁ దరుణి రోసినమాడ్కి
నంతంతకును నోకిలింత పుట్టెఁ
దన వంశమెల్ల వర్ణన మొందుకై వడి
పొలతి నెన్నడు మింత పొదలఁదొడఁగె

8. ఆం.ప్ర ర. 36 b పుట.

9. ఆం.ప్ర.ర. 38 a పుట.

నడపు జడనయ్యె వెడనిద్ర దొడరఁ జొచ్చె
జప్పి వాతెఱ జాలంగ నుప్పతిల్లెఁ
గాంత కప్పుడు నవమాసగౌరవమునఁ
బుత్రుఁ డుదయించె యౌవనశత్రుఁ డగుచు.[10]

ప్రబంధమణిభూషణంలోని పై పద్యాన్ని నిడదవోలువారు మదనసేనం లోనిదిగా పేర్కొన్నారు [11]

10. ప్ర.మ.భూ. 842ప. ఈపద్యంచిన[illegible]దంకొద్దిమార్పు[illegible] ప్రతిలో ఉన్నట్లుగ నిడదవోలువారు [illegible] 20పుట)

11. ప్ర.మ.భూ. పీఠిక. 20పుట[illegible]



# మరున్నందనశతకము

## చిత్రకవి పెద్దన

[లక్షణసారసంగ్రహకర్త చిత్రకవి పెద్దన చెప్పిన ఆంజనేయ శతకమే మరున్నందనశతకమని నిడదవోలు వెంకటరావుగారు ల సా.సం. పీఠికలో నిరూపించినట్లుగ వంగూరి సుబ్బారావుగారు శతకకవుల చరిత్రలో పేర్కొన్నారు.[1] కాకినాడలోని ఒకానొక ఛందోగ్రంథతాళపత్రప్రతిలో మాత్రం ఇది వెన్నెలకంటి చంద్రశేఖరకృతంగా పేర్కొనబడింది.]

1. కోపాటోపము కుప్పిగంతులు నిజాకుంఠీభవచ్చౌర్యరే
ఖాపాండిత్య మయారె నీకును నమస్కారంబు లంకాపురీ
పాపగ్రంథికులాంగనాకుచతటీపైతాపతద్గ్రాహబా
హాపాటచ్చర రామదాస తవదాసో౽హ మ్మరున్నందనా![2]

2. నీ బంటెవ్వడు వాని బంటను సుమీ నిర్నిద్రశౌర్యాధిక
ప్రాభిలోజ్జ్వలకింకరీకరణసౌభాగ్యంబు సామా...
శాబా సక్షకుమారసంహరణముష్టాముష్టిసంగ్రామబా
హాపాటచ్చర రామదాస తవ దాసో౽హ మ్మరున్నందనా![3]

---

. పుట 742; 2. అ.క. —19.

3. ఈ పద్యం కాచిరాజు బసవన లక్షణసారంలోనిదని నిడదవోలువారు తెలిపినారు. చూ ఆంధ్రపత్రిక ఉగాదిసంచిక-1954- 1955, 184పుట. ఆం సా.ప.లోని 159/7 నంబరు తా.ప్ర.లో ఈ పద్యం ఉదాహరింపబడింది. ఐతే తా.ప్ర. ఆద్యంతాలు లేకపోవడంవల్ల ఈ ఛందోగ్రంథం పేరు తెలియడంలేదు. ఇది నిడదవోలువారు చెప్పిన లక్షణసారమేనేమో!

# యథా వాల్మీకి రామాయణము

**లక్షణకవి అప్పన**

---

[యథావాల్మీకిరామాయణం పేరుతో ఒక తాళపత్రప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది1. కాని అది రామకవిప్రణీతం. ఈ రామకవి ఘనగిరి (పెనుగొండ) రామకవి కావచ్చు ప్రస్తుత రామాయణ కర్త లక్షణకవి అప్పన్న అని ఆం ప్ర. ర. వల్ల తెలుస్తుంది. ఇది అవాల్మీకాలైన కల్పనలు లేకుండా వాల్మీకానికి యథాతథమైన రీతిలో సంతరింపబడ్డ అనువాదరచన అనే విషయాన్ని దీని పేరే తెలుపుతుంది.

యథాశ్లోకతాత్పర్యరామాయణమనే పేరుతో ఒక తెనుగురామాయణం ఉన్నది. అది గద్వాల సోమభూపాలుని ఆస్థానంలోని విద్వాంసులందరూ కలిసి పూర్తిచేసిన గ్రంథం.

లక్షణకవి అప్పన రామాయణాన్నే కాక పరమభాగవతచరిత్రను కూడా రచించినాడు. ప్రస్తుతం ఈ రెండూ అలభ్యాలే. ఈతని యథావాల్మీకి రామాయణంలోని ఒక్క పద్యం ఆం.ప్ర.ర. లో ఉదాహరింపబడింది.]

1. ఉంగరవుం గురుల్ దనర యొద్దిక కట్టినవారు ముంగలన్
సాంగు బలా యనంగ దొర సంగడికిన్ గయిలాగుతోడ తా
జంగలు సాపుచున్ విజభుజద్వయి యంతమురీతి చాచి మొ
క్కొంగవయుండు దాశరథికిన్ .. గోట్ల కపుల్ భజింపగన్[2]

---

1. D303. 2. ఆం ప్ర. ర. 16b పుట.

# యయాతి చరిత్రము

రాయసం దత్తన

---

[ఈ యయాతిచరిత్రకావ్యం రాయసం దత్తనప్రణీతం. రాయసం వంశీయులు తిరుమల దేవరాయలు, శ్రీరంగ రాయలకాలంలో మంత్రులుగా ఉన్నారు. హరిశ్చంద్ర చరిత్ర [1] వ్రాసిన దేవరాజభట్టు రాయసం వంశీయుడు కావచ్చుననీ, రాయసం అహోబలమంత్రి తాను దేవరాజ కుటుంబంలోని వాడనని చెప్పుకోవడం దీనికి ప్రమాణమనీ ఆచార్య రామరాజుగారు అభిప్రాయ పడుతున్నారు.[2]

దత్తన యయాతిచరిత్రలోని ఒక పద్యాన్ని గణపవరపు వేంకటకవి తన ఆం. ప్ర. ర. లో ఉదాహరించినాడు.]

1 ధరణీధరదారుణకి
ల్యరుణజనిలకృతివరుణ నీకుబెర గజా
సురహారనందితపాదాం
బురుహాంకుశమత్స్యకులిశభూధ్వజరేఖా.[3]

---

1. ప్రబంధరత్నావళిలో హరిశ్చంద్రచరిత్రలోని రెండు పద్యాలు ఉదాహరింపబడ్డవి. చూ:— ప్ర. ర. 41 పుట.
2. ఆంధ్రకవిసప్తశతిలో 'దేవరాజభట్టు' అన్న శీర్షిక వద్ద ఆచార్య రామరాజు గారీ విషయం వ్రాసుకున్నారు.
3. ఆం. ప్ర. ర. 468 పుట.

# యయాతిచరిత్ర

సూరపరాజు

---

1. వలఁ బడ్డ జక్కవల్వలె నున్న జిలుఁగు ప
య్యెదలోని గుబ్బపాలిండ్లు మెఱయ.

(ఛం. గ్రం. డి 705. ఆం.వి)

(క. సం,వి.1-120)

# రాఘవాభ్యుదయము

నన్నయభట్టారకుడు

---

[రాఘవాభ్యుదయమనే కావ్యాన్ని నన్నయ భట్టారకకృతంగా పేర్కొన్న ఒకే ఒక లక్షణగ్రంథం ఆంధ్రకౌముది. ఈ కావ్యంలోని ఒక్కపద్యం మాత్రమే లభిస్తుంది. లభించిన పద్యం నన్నయభట్టారకుని కవిత్వాన్ని పోలి ఉండకపోవడంవల్ల ఈతడా పేరు గల మరొక అప్రౌఢకవియై ఉండవచ్చునని వీరేశలింగం పంతులుగారు అభిప్రాయపడినారు.]

1. వికలువి ఖరదూషణముఖ
సకలవనచరులు బొదివిరి సమ్మదముగ వి
ష్వకకుష్వకు మూఁగెదు మిడు
తుకపిండువితానభాతి తోచెదు బుద్ధిన్.[1]

---

1. ఆం. కౌ.

# రాజనరేంద్రచరిత్రము

[ఈ కావ్యకర్త ఎవ్వరో తెలియదు. రాజరాజ చరిత్రవర్ణనం ఇందులో వర్ణ్యాంశం కావచ్చు. ఈ రాజరాజు నన్నయను మహాభారతరచనకై ప్రోత్స హించిన రాజరాజో లేక మరొక రాజరాజో చెప్పలేము. ఈ కావ్యంలోని మూడు పద్యాలు ఒకానొక ఛందోగ్రంథంలో ఉదాహరింపబడ్డవి ]

1 అగణితభేరీధ్వనులను
బెగడొందె ధరిత్రి మిన్ను బీటలు వాఱెన్
నగములు వ్రీలెన్ దిగిభము
లు గలంగె వడఁకె సకలలోకములెల్లన్.

2. పూజించి యర్ఘ్యపాద్యము
లోజం గావించి మణిసమంచితలీలన్
తేజమున నుంచుటయు దయ
తోఁ జూచి సుధారసంబు దొలుకఁగఁ బలికెన్.

3. భూసురవర్గముం గదిసి పూజలు నేసి యొసంగె వేగ నూ
తేసి తురంగమంబులుఁ బదేసి శతాంగములుం జెలంగి వే
యేసి విలాసధేనువు లనేకధనంబులు ధారుణీతలా
ధీశుఁడు వేలువేలు నలుదిక్కులఁ గీర్తులు పిక్కటిల్లగన్.

---

1. నెం. 3448. ఆం. సా. ప; ఇందులోని కొంతభాగం ఆం.సా.ప. పత్రికలో ప్రచురింపబడింది. చూ:- సంపుటం 6. సంచిక 9-12;

# రాజరాజ్యాభిషేకము

అంగర నృసింహకవి

---

[అంగర నృసింహకవి ఈ ప్రబంధకర్త. ఈతడు క్రీ.శ. 1700లకు తరువాతివాడని వీరేశలింగం పంతులుగారూ, క్రీ.శ. 1500 ప్రాంతంవాడని విడదవోలు వెంకటరావుగారూ అభిప్రాయపడుతున్నారు. అలభ్యమైన ఈ ప్రబంధంలోని పదమూడుపద్యాలు మాత్రమేప్రస్తుతానికి లభ్యమౌతున్నాయి.]

1. శ్రీసతి చన్నుఁ గ్రేవలనుఁ జెక్కుల నొక్కటఁ బత్రభంగముల్
వ్రాసుటకున్ విరించి నిటలంబుల నొక్కట భాగ్యవర్ణముల్
వ్రాసుటకున్ చతుర్భుజవిలాసము పూనినవేల్పు సత్కృపో
ల్లాస మెలర్పఁ బ్రోచు శుభలక్షణుఁ గొప్పులవల్లభూవరున్.

కవిస్తుతి

2. భారతఘట్టోల్లంఘన
పారీణుఁ గళాధురీణబంధురధారా
ధీరప్రబంధగంధ
ద్వారూఢిప భట్టనన్నపార్యునిఁ దలఁతున్

3. అంజలి వేతుఁ బద్మజనిశాంతకరాంతనిరంతరోల్బణ
న్మంజులవల్లకీమధురమంద్రవినాదసముల్లసద్ధ్వని
వ్యంజకవాఙ్నిగుంభనసమంచితనూతనసృష్టిచాతురీ
రంజితసత్కవీంద్రబుధరాజికిఁ దిక్కనసోమయాజికిన్

4. ఇద్దగుణాం బ్రబంధపరమేశ్వరు నెఱ్ఱనప్రెగ్గడన్ మనః
పద్ధతి నిల్పి సూక్తిరుచిభాస్కరుఁడైన హుళక్కి భాస్కరున్
బుద్ధి ఘటించి సంతతము పూని భజింతు వచఃప్రసాద
సిద్ధునిఁ జిమ్మపూడి కులశేఖరు నయ్యమరేశు సత్కవిన్

కృతిపతినివాసము - కొర్త్రాపురవర్ణన

5. కుదురయ్యె నే వీటి కోటలోపల వైశ్య
సుప్రతిష్ఠితుఁడైన కూలవాణి
పాయలేదే వీటి పర్యంతవనవాటి
మిండరాయందు లక్ష్మీధవుందు
విందారు నేవీట నెందకాలమునందు
జలజాకరంబైన సాగరంబు
చదురొందు నేవీట సార్వకాలికఫల
స్ఫురితంబు వేదంగి పోఁకతోట
సురపురంబునకైన నబ్బురము లగుచు
విఱ్ఱవీగుచునుందు నే వీటి సిరులు
వసుమతీపాదపద్మసంవశితరత్న
నూపురం బగునట్టి కొర్త్రాపురంబు.

కృతిపతివర్ణన

6. మూర్ధాభిషిక్తుల ముకుటంబు లేరాజు
పాదపీఠికకు సోపానపంక్తి
చతురబ్ధివలయితక్షితితలం బే రాజు
బాహుదండమునకు బాహుదండ

భువనంబులేలు కప్పురగంధి యే రాజు
లీలాకటాక్షపాళికకు నీడ
రజనికాంతజయంతరతిరాజు లే రాజు
రూపరేఖకుఁ బ్రతిరూపకంబు
అతఁడు పట్టు తలాటకేళాదిరాయ
రాజదేవేంద్రరాజాధిరాజచంద్ర
గాయిగోవాళజగనొబ్బగండబిరుద
శాలి కొప్పులవల్లభూపాలమౌళి

గ్రంథస్థపద్యములు — కథకు సంబంధించినవి.

7. పనివడి చెప్పనేల శిశుపాలుని విక్రమచేష్టితంబు లా
తని పవిబూని దానవపదాతులు వచ్చిరి వీరె వారె యం
చనిశము తెప్పవెట్టక సురావళి దిక్కులు సూచుచుండగా
ననిమిషనామ మొక్కటియునర్థముదప్పకయుండెనిప్పుడున్.[1]

8. ఆరయ విన్నమాత్రముననైనను జూచినమాత్రనైన నె
వ్వారి మనంబులన్ బ్రణయవాసితమై యనురాగకందళం
బీరికలెత్తుఁ గారణమొకించుక లేకయుఁబూర్వకర్మసం
స్కారవిశేష మంద్రది వికస్వరమై కొనసాగు నుర్వరన్[2]

9. అమృతసరోవరంబుగ హిమాంశుని మూర్తి కరంగి లోన చి
హ్నము వికచోత్పలప్రకరమై చెలువొందిన నందులోన సం
భ్రమమున నీదులాడి జడిమంబుగ నంగము లూనునేని యా
హిమమున వించుకేని శమియించునొకో మదనాస్త్రవేదనల్[3]

1. 1 ఆశ్వా 2. 2ఆశ్వా. 3 3ఆశ్వా

10. శుద్ధాంతఃకరణైకయోగ్యమగుచున్ శోభిల్లు నస్మద్వచో
రాద్ధాంతం బిది యిచ్చగింపక వృథా ప్రజ్ఞాపరిజ్ఞానస
న్నద్ధుల్ కొందఱు కేవలంబుగ వితండావాదులై తారసం
బద్ధోక్తుల్ వచియించిరేని మదమార్పన్ వారి ఖండించెదన్.[4]

11. మహిలో నీకిట మున్ను మే వితమౌ మాన్యత్వముల్ పూనుటల్
సహియింపందగునంచు నిప్పుడును విజ్ఞాపింప మా కేఁటికిన్
గుహనానాటకసూత్రధార భువి నీ క్రొవ్వాఁడి మాయావిధుల్
బహురూపంబులుపన్నగాఁదిరుగరే బ్రహ్మేంద్రచంద్రార్కులున్

పై పద్యాలు వీరేశలింగంపంతులుగారి ఆంధ్రకవుల చరిత్ర మంది గ్రహింపబడ్డవి.[5]

12. సౌధజాలకములు సాధించి చొచ్చి రా
జాంగనాగారముల్ తొంగి చూచి
చిగురాకుబోడుల చిఱునవ్వు దొలకాడు
నిద్దంపు జెక్కుటద్దముల సీదఁ జూచి
చంచలాక్షుల గుబ్బచనుదోయిమీఁది క
ట్టాడిము త్తెపుచేరు లంటి చూచి
రాజీవముఖుల కర్ణవతంసనీలార
విందకోరకముల విప్పి చూచి

యేని చకచక విలసిల్లు నిందుకిరణ
జాలమాలాతరంగము లోలి దాయ
విరహిలోకంబు పూఁబాన్పు శరణుఁ జొచ్చెఁ
బ్రళయ మువ్విళ్లుంగ నీరకాయ పట్టినట్లు.[7]

---

4. 4 ఆశ్వా. 5. 5 ఆశ్వా. 6. ఆం.క చ. 3భాగం. పుటలు 261—264
7 ప్ర.మ భా. 864 వ.

13. వర్ధిల్లుదురుగాక వసుమతీజనులెందు
వెసఁ బుత్రపౌత్రాభివృద్ధి నొంది
మేలొందుదురుగాక బాలగోబ్రాహ్మణుల్
ధాత్రిలో నాచంద్రతారకముగ
భావింపుదురుగాకఁ బరమధార్మికవృత్తి
రాజు లన్యోన్యవైరంబు మాని
యారగింతురుగాక చేరి బృందారకుల్
క్రతుపురోడాశముల ...విందు
సకలజనులకు సౌఖ్యంబు గలుగుఁగాత
కవులకభ్యుదయంబులు గలుగుఁగాక
యవధరింతురుగాక విద్యావిశేష
తారతమ్యంబు దెలిసి వదాన్యవరులు.[8]

ప్రబంధమణిభూషణంలోని పై రెండు పద్యాలను విరదవోలు వారు రాజరాజ్యాభిషేకంలోనివిగా గుర్తించినారు[9]

8. ప్ర.మ.భూ. 865 9. ప్ర.మ.భూ. పీఠిక 22. 23 పుటలు

# రామచంద్రాభ్యుదయము

## బడబా(నల)గ్నిభట్టారకుడు

[రామచంద్రాభ్యుదయకర్త బడబాగ్నిభట్టారకుడని ఆం.కౌ. వల్ల తెలుస్తుంది. ఈ కావ్యంలోని రెండుపద్యాలు ఆం కౌ లో ఉదాహరింప బడ్డవి.

ఒకనాడీకవి సంధ్యావందనం చేస్తూఉండగా చేతి ఉంగరం జారి కొలనులో పడిపోయిందట. అప్పుడీతడా చెరువులోని నీరు ఇంకిపోవలెనని శపించగా నీరు ఇంకి పోయిందనీ, తరువాత బడబాగ్నిభట్టు తన ఉంగరాన్ని తీసుకున్నాడనీ ఈ కవి విషయంలో ఒక కథ ప్రచారంలో ఉన్నది. కొలను లోని నీటిని ఇంకింపజేయడంవల్ల ఈతనికీపేరు వచ్చిందో లేక సహజనామమో తెలియదు.]

1. ఇనవంశరాజపుడు సొం
పున విశ్వామిత్రమౌని వెంట (జని)యఁ
జ్జనకుని యింట హరశరా
సనము విఱిచి పెండ్లియాడె జగతీకన్యన్ [1]

2. .. .... ... ...రాముని
మహిమలోన మిగుల ప్రబలె కీర్తి.[2]

---

1 ఆం.కౌ. 2 ఆం.కౌ.

# రామతీర్థాశ్రయశతకము

గోగులపాటి కూర్మనాథకవి

---

[గోగులపాటి కూర్మనాథకవి ఈ శతకకర్త. 18 వ శతాబ్దికి చెందినవాడు. సింహాద్రినారసింహశతకం మృత్యుంజయ విలాస యక్షగానం, [illegible]సంవాదమనే నామాంతరం కలిగిన లక్ష్మీనారారాయణవిలాసం ఈతని ఇతర కృతులు. కూర్మనాథకవి రామతీర్థదేవస్థానాధికారిగా ఉండిన సందర్భంలో రామతీర్థాశ్రయశతకం చెప్పిఉంటాడని పండితుల అభిప్రాయం. అలభ్యమైన ఈ శతకంలోని మూడు పద్యాలు మాత్రమే లభ్యమౌతున్నాయి. ఈ శతకంలో అనుప్రాస విధిగా ఉంటుందని చెప్పవచ్చు ]

1. ఘనకోపం బతిలోభికే పరుషవాక్యప్రోద్ధతుల్ పందకే
ధనకార్పణ్యము పాపశీలునకె కాంతాబద్ధమోహంబు జా
రునకే నిర్మలసాధువంచనవిధుల్ మూర్ఖాళికే యిమ్మహిన్
మనుజస్వామికి ధర్మమా! విజయరామా! రామతీర్థాశ్రయా!

2. సములద్దైనది బారు మీ భజనచే జాగ్రైనదే నోరు గ్రీ
ష్మములో, బాటిన దేఖు సజ్జనవివాసంబున్నదే యూరు రో
గము బాగైనది వేరు మీ పదపరాగం బున్నదే నీరు ధ
ర్మముచే, గన్నది పేరు శ్రీవిజయరామా! రామతీర్థాశ్రయా!

స్వామివ్ గన్నది పూట, పుణ్యనది క్రేవన్నున్నదే బాట మా
ధామంబున్నదె పేట ధర్మసభ సత్యం బున్నదే మాట యే
సీమన్ వస్తుసమృద్ధిచే భటులచేఁ జెల్వైనదే కోట పె
న్నామమిళ్లున్నదె తోట శ్రీ విజయరామా! రామతీర్థాశ్రయా!

పై మూడు పద్యాలు ఆరుద్రగారి స. ఆం. సా. నుండి గ్రహింపబడ్డవి.[1]

1. 12 సం. 287–288 పుటలు.

# రుక్మాంగదచరిత్ర

## చెదలువాడ మల్లన

[చెదలువాడ మల్లన రచించిన ద్విపదకృతి యిది. ప్రస్తుతానికి అలభ్యం. అప్పకవి ఇందులోనుండి ఒక ద్విపదను తేలిపలికే "అయ" శబ్దప్రయోగానికి ఉదాహరణంగా ఇచ్చినాడు. ఈ ద్విపదనుబట్టి ఈ కావ్యం రామయభాస్కరునికి అంకితమీయబడినట్లుగా తెలుస్తుంది. కృతికర్తా, కృతిభర్తా క్రీ.శ. 1580 ప్రాంతానికి చెందినవాళ్లు.]

1. శ్రీకరగుణసాంద్ర చిరయశోమంద్ర
ఆకారచంద్ర రామయభాస్కరేంద్ర.[1]

లక్షణవిలాసమనే లక్షణగ్రంథంలో పై ద్విపద విప్రనారాయణ చరిత్రలోనిదిగా ఉదాహరింపబడింది.

---

1. అ. క. II –229.
2. R. 1024 కాగితం ప్రతి–(తిరుపతి, ఓరియంటల్ మాన్యుస్క్రిప్టులైబ్రరి) పుట 48.

# లక్ష్మీనారాయణవిలాసము

కవిరాక్షసుడు

---

[ఆదినారాయణచరిత్ర, లక్ష్మీనారాయణవిలాసం అనే రెండుగ్రంథాలు కవిరాక్షస కృతంగా లక్షణ గ్రంథాలవల్ల తెలుస్తుంది. ఆదినారాయణచరిత్రకే లక్ష్మీనారాయణవిలాసమనేది నామాంతరమేమో! లక్ష్మీనారాయణవిలాసం లోనిదిగా ఒక్కపద్యాన్ని ఆం.ప్ర.ర. ఉదాహరించింది. సాయంవర్ణన ఇందు లోని విషయం]

1. నగకోదండచరుండు తాండవముఖండన్మండలావృత్తి స
ల్పఁగ చేదప్పి సముద్ధతిన్ జెడిన జాల్యాధక్కనా బ్రుక్కె నా
కుగతిన్ భానుఁడు తద్వికీర్ణ మరిరజ్జుచ్ఛాయనా సంజ కెం
జిగినొప్పెన్‌దగ నప్పరంబు దినమించెన్ చక్రవాకధ్వనుల్[1]

---

1. ఆం.ప్ర.ర. 208 పుట

# వజ్రపంజరశతకము

పట్టాభిరామకవి

[ఈ శతకం పట్టాభిరామకవికృతమని శతకకవులచరిత్ర తెలుపుతుంది. మరున్నందనశతకం గువ్వలచెన్నశతకం, మలరాజుగుండా రాయణోపాఖ్యానం, శమంతకోపాఖ్యానం, కవిసర్పగారుడం, కవిమూషికమార్జాలం — మొదలైన గ్రంథాలను కూడా ఈతడు రచించినాడట. వజ్రపంజరశతకంనుండీ, మరు॥ న్నందన శతకం నుండీ అప్పకవి కొన్ని పద్యాలను ఉదాహరించడం వల్ల ఈ కవి క్రీ.శ. 1656 కంటె ప్రాచీనుడని చెప్పవచ్చు.

కాకినాడ ఆం.సా.ప. లోని ఒకానొక ఛందోగ్రంథప్రతిలో ఈ శతకం పుత్తేటి రామభద్రకవికృతంగా పేర్కొనబడింది.]

1. తల్లివి దండ్రివిం బతివి దైవమ వాప్తుఁడ వీప్సితంబు స
ధిల్లగఁ జేయు దాతవును నీవని నిన్నె తలంతుగాక నా
యుల్లము దైవతాంతరము నొందని యంచకొలంకు వాసి వ
ర్తిల్లనె యొందుచో రఘుపతీ॥ శరణాగతవజ్రపంజరా॥

2. కరిమొఱ యాలకించి కృపంగావవా, ద్రౌపది యార్తి మాన్పవో
కరుణ దలిర్ప పిన్నపుడె గౌతమసంయమి యిల్లు నిల్పవో॥
యురక యుపేక్ష నేసికొని యుండెదు నాయెడ నేను లాఁతినో॥
స్థిరతరపౌరుషా॥ రఘుపతీ॥ శరణాగతవజ్రపంజరా॥

---

1. ఆం.క.చ. 116—117 పుటలు.
2. 159/7

3. అరులకు నొద్దుకొందునొ, జరామయబాధల కొద్దుకొందునో।
యురగభయోగ్రవృశ్చికమహోద్ధృతచోరమహాభయో
త్కరముల కొద్దుకొందునొ,సదా యిక నెన్నిటికొద్దుకొందు సు
స్థిరకృపఁ గావవే రఘుపతీ। శరణాగతవజ్రపంజరా।

4. పాపముఁ బాపవే కృప సుపర్వనదీజనకాంఘ్రిపద్మ। నా
తాపము మాన్పవే జగదుదారకళానిధి రామచంద్ర। నీ
రూపముఁ జూపవే సకలరోగతమం బెడలన్ గటాక్షదృ
గ్దీపముఁ జూపవే రఘుపతీ।శరణాగతవజ్రపంజరా।

5. ఆర్తులపాల నెల్లఁ గలవంచు సదా కృతులెల్లఁ జాటు నా
వార్త వినంగ మిమ్ముఁ గొలువన్ చవిఁ బుట్టిన మీకు జానకీ
భర్తకు మీకుఁ బేరువిడఁ బాల్పడితిన్ మొఱ యాలకింపు స
త్కీర్తిధురంధరా రఘుపతీ శరణాగతవజ్రపంజరా।

6. మానము గోలు యిచ్చినను మాటికిఁ గీళ్లతుఁ గీడు చేసినన్
మేనికి హానిఁదెచ్చినను మీ తిరువశ్యము మీ పదాంబుజ
ధ్యానము నేయగా నెటులనైనను మంచిదె యన్యదేవతా
ధీనుఁడగాఁ జుమీ రఘుపతీ। శరణాగతవజ్రపంజరా।[1]

7. శ్రీగజగామినీమణిని సీతనుగా విరపాయిగా త్రిలో
కీగృహమేధిగా గరుడకేతనుగా భవరోగవైద్యుగా
నా గురువాన విన్నె మది నమ్మితి వేవొకవేల్పుఁ గొల్వ నీ
వే గతి కావవే రఘుపతీ। శరణాగతవజ్రపంజరా।[2]

---

2 అ శ –257; సు.మ రం. III –534

8. గ్రహగతులేమి సేయు మఱి గండపుదోషము లేద నుండు దు
స్సహదురితారివర్గములు సంధిలనేర్చునె లేమి చెందునే
తహతహ లేటికిన్ బొదలు తావకదాస్యముఁ గాంచువారికిన్
ఇహపర సాధకా! రఘుపతీ! శరణాగతవజ్రపంజరా [3]

9. పరనారీహరణం బొనర్చిన మహాపాపాత్ముఁ డా రావణుం
డరియౌ నాతనితమ్మునిన్ శరణుఁ బొందన్ దివ్యులున్ మెచ్చగా
పరిరక్షించిన నీ కృపామహిమ మెప్పాటన్ మహోన్నత్యమే
స్థిరగాంభీర్యగుణోదధీ రఘుపతీ! శరణాగతవజ్రపంజరా !

పై పద్యాలు పంగూరిసుబ్బారావుగారి శతకకవుల చరిత్రమండి గ్రహింప బడ్డవి.[4] సుబ్బారావుగారు వీటినొక ప్రాచీన తాళపత్రసంపుటిమండి గ్రహించి నారట.

---

3. ఆ.శం.ఛం. iii 131, —ఛం.గ్రం. 159/7 (ఆం.సా.ప.)
4. శ.క.చ. 257 పుట.

# వసంతవిలాసము

## నాచనసోమన

---

[ఈ కావ్యంలోని నాలుగు పద్యాలు మాత్రమే లభ్యమైనాయి. వసంతర్తు వర్ణనం ఈ కావ్యంలోని వర్ణ్యాంశం కావచ్చు.]

1. అత్తఱి విటనాగరికులు
చిత్తములు వసంతకేళి చివురొత్తంగా
మొత్తములు గట్టి తెచ్చిరి
ముత్తెపు ఝల్లరులతోడి బుఱ్ఱటకొమ్ముల్[1]

2. ప్రాలేయప్రతిసీర నేనఁ బరపెన్ బైపై వసంతం బిలం
గాలోన్మీలితకోరకోదరపరాగప్రౌఢకోపాగ్నియై
హాలాపానవిహారపౌరమహిళాలంకారదోస్సారమై
హేలాపల్లవహేతిఖండితమహాహేమంతసామంతమై[2]

3 శ్రీ చన్నుంగవ క్రేవఁ గ్రొమ్మెఱుఁగులన్.[3]

క.సం.వి. లోపై పద్యం మొదటిపాదంలో కొంత మాత్రమే ఉదాహరింపబడింది. మానవల్లివారు తమ క్రీడాభిరామపీఠికలో ఈ పద్యాన్ని పూర్తిగా ఉదాహరించినారు.[4] అంతేకాక ఇది వసంతవిలాసంలోని తొలిపద్యమని కూడా తెలిపినారు. పూర్తిపద్యం ఈ క్రింది విధంగా ఉన్నది.

---

1. అ క. –73; ల సా.సం. I - 232; సు.మ.రం. I -236; ల.శి. V – 326; న.వృ.ర; ల.వి; ల.సా సం (R235). 2. ఉదా.ప. 3. క. సం.వి. –18 4. మానవల్లికవి–రచనలు 74 పుట.

4. శ్రీ చన్నుంగవ క్రేవఁ గ్రొమ్మెఱుగులన్ శృంగారపుం దోటకుం
ప్రాచీనం బగుచున్న వింశతినఖప్రౌఢిన్ సుఖాంభోధివే
లాచంద్రోదయమైన దేవుఁడు కృపాలంకారచిత్తంబునం
జూచున్ మాచయబ్రహ్మధీమణిఁ గవిస్తోమైక చింతామణిన్.

5. వీణనాదముల్ వెన్నెలతేట
రాణ మీఱఁగా రమణులయాట
ప్రాణమైన పినబ్రాహ్మణువీట
జాణలు మెత్తురు జాజరపాట.

పై పద్యం బాలబోధచ్ఛందస్సులో విశాళచౌపదకు ఉదాహరణంగా చూపబడింది.[5]

5. బా.బో. 55 పుట.

# వాణీవిలాసము

## ముక్కుతిమ్మన

---

[ముక్కుతిమ్మన అనగానే జ్ఞప్తికి వచ్చే కావ్యం పారిజాతాపహరణం. దీనితో పాటు తిమ్మన 'వాణీవిలాసం' అనేకావ్యం కూడా రచించినట్లు లక్షణ గ్రంథాలు పేర్కొంటున్నాయి. అలబ్ధమైన ఈ కావ్యంలో ప్రస్తుతానికి ఒక పద్యం మాత్రమే లభ్యమౌతుంది.]

1. తెలివా తరువాతను గ్ర
చ్చలి నీ నాయకుఁడు వశ్యుఁ డగు నెట్లంటే
మలుపక విను కల గాంచిన
తెలుఁగెల్ల నటంచుఁ దేటతెల్లమి గాగన్.[1]

---

1. సు.పు రం. – 10[1]; అ.రం.ఛం. 1 – 183; ల.ల.స. $21_a$ పు. వ ల.సా;

# వామనచరిత్ర

[దీని కర్త యెవ్వరో తెలియదు. వామనావతారచరిత్ర ఇంతులోని ఇతి వృత్తం. అలభ్యమైన ఈ కావ్యంలోని ఒక్క పద్యం ల.శి.లో లభ్యమౌ తుంది ]

1. స్వస్తి యని పలుకుచుం గమ
లాస్తనకస్తూరికాదిలాంఛన మగు శ్రీ
హస్తంబు సాచి వేడిన
నాస్తి యనం బలుకనగునె యాదిమపురుషుల్.[1]

ఆంధ్రవిశ్వవిద్యాలయంలోని ఒకానొక ఛందోగ్రంథంలో ఈ పద్యం భాగవతంలోవిదిగా పేర్కొనబడింది.[2] పోతనభాగవతంలో వామనచరిత్ర ఘట్టంలోమాత్రం ఈ పద్యం కానరాదు.

1. ల.శి. IV –215; 2. ఛం.గ్రం. 705;

# వామనపురాణము

## నంది సింగన

[లింగమకుంట తిమ్మన, బౌలకవి—ఈ ఇద్దరు వామనపురాణాన్ని తెలుగులో రచించిన ప్రాచీన కవులు. తిమ్మన రచించిన గ్రంథం నష్టమైపోయింది. కాని బౌలకవి వామనపురాణం మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది [1] నందిసింగన కూడా వామన పురాణాన్ని రచించినట్లుగా అ.రం.ఛం తెలుపుతుంది ఈ ఛందంలో సింగన వామనపురాణంలోనివిగా రెండు పద్యాలు ఉదాహరింపబడ్డవి. లక్షణ గ్రంథాల్లో సింగన, మల్లన అని ఇంటిపేర్లను నిర్దేశించడంలో అక్కడక్కడా వ్యత్యయం కనిపించడంవల్ల ఈ వామన పురాణకర్త నందిమల్లయ అని ఊహించడానికి అవకాశం ఉన్నది. ఐనా నందివంశంలో కూడా ఒక సింగన ఉండి అతడే ఈ వామనపురాణాన్ని రచించినాడో స్పష్టంగా చెప్పలేం

ఆధునికుల్లో రామాపద్ధుల కొండయ్యశాస్త్రిగారు వ్రాసిన వామన పురాణం లభ్యమౌతుంది ]

1. సరస చిత్రాన్నములును రసాయనములు
భక్ష్యములు నూరు(బిండ్లును బాలు జున్ను.[2]

2. కాంతాలలామ నీ కే (?)
కాంతంబున( బల్కరింతు( గల్గినకార్యం
బంతయు మొద మలర(గ విను
మంతట నీ మదికి( దెలివిదై యుండు సుమీ[3]

---

1. R 607. An A phabet ca Index of Te ugu Manuscr pts n tne Govt Or enta Manuscr pt L brary Madras – Page 130
2. అ.రం.ఛం — 172. 3 అ.రం.ఛం. 1 — 175.

# వాసవాభ్యుదయము

### శ్రీనాథుడు

[వాసవాభ్యుదయకావ్యం శ్రీనాథవిరచితమని ఆం.ప్ర.ర. తెలుపుతుంది. శ్రీనాథుడు ధనంజయవిజయం వ్రాసినట్లుగ దంతులూరి పాపరాజు వ్రాసిన మూర్తిత్రయోపాఖ్యానంలోని "శ్రీనాథసుకవీంద్రుచే ధనంజయవిజ, యంబను సత్కావ్య మంది వెలసె" అనే పద్యంవల్ల తెలుస్తుంది ; కాని ఆతడు వాసవాభ్యుదయం వ్రాసినట్లుగ ఆధారాలు లేవు. ఐతే 'వాసవస్య అయం వాసవః' అనే వ్యుత్పత్తిని ఆశ్రయించి వాసవుడంటే ధనంజయుడని అర్థం చెప్పుకుంటే ధనంజయవిజయానికే వాసవాభ్యుదయమనేది నామాంతరమని ఊహించవచ్చునేమో పరిశీలించవలె.

ఇందులోని ఒక్క పద్యం మాత్రమే లభ్యమౌతుంది.]

1. చికిలి తొమ్మ్రి వగల మానికపు వెజ్జ
నలకజాలకజిత వినివాయ మెల్ల
లాలితాకారుడై నబాలకున కుదిరి
తాలిఁ గట్టిరి యింపెసలార నపుడు.[1]

---

1. దంతులూరి పాపరాజు వ్రాసిన మూర్తిత్రయోపాఖ్యానం ఆం సా.ప.లో ఉన్నది. గ్రంథ సంఖ్య 1960. ఈ కావ్యంలోని కొన్ని పద్యాలు ఆం.సా.ప. పత్రిక (సంపుటం 5, సంచిక 3)లో ప్రచురించబడ్డవి. చూ 319 పుట.

# విక్రమసేనము

## చిమ్మపూడి అమరేశ్వరుడు

---

[చిమ్మపూడి అమరేశ్వరుడు విక్రమసేనకర్త. క్రీడాభిరామ కర్త, కొరవి గోపరాజు, అనంతామాత్యుడు, రామరాజ భూషణుడు, కూచిమంచి జగ్గకవి మొదలైన కవులచే పూర్వకవిస్తుతుల్లో ప్రశంసింపబడ్డ కవీశ్వరుడు. గోపరాజు (క్రీ.శ. 1430–1490)చే స్తుతింప బడ్డాడు కనుక అమరేశ్వరుడు అతనికి ముందువాడని చెప్పవచ్చు సంకలన గ్రంథాల పుణ్యమా అని అమరేశ్వరుని విక్రమసేనంలోని పద్యాలు దాదాపు అరవై ఆరువరకు లభించినందుకు మనం సంతృప్తి పడవలె. వీటిలో కొన్ని పోతన భాగవతంలోనూ, జక్కన విక్రమార్క చరిత్రంలోనూ, శ్రీనాథుని భీమఖండంలోనూ కనిపిస్తున్నవి. లబ్ధమైన విక్రమసేనంలోని ప్రకీర్ణపద్యాలనన్నింటినీ ఒక క్రమంలో పెట్టి వీటికి ఒక కావ్యరూపాన్ని సంతరించినారు ఆరుద్రగారు.[1]

రామరాజభూషణుడు అమరేశ్వరుణ్ణి సహస్రముఖదృష్టి అనీ, ఆంగర నృసింహకవి వచఃప్రసాదసంసిద్ధుడు అనీ స్తుతించడం వల్ల ఈతడు మహాకవుల కోవకు చెందినవాడని చెప్పవచ్చు.

విక్రమసేనుడనే రాజకుమారుని వృత్తాంతం ఇందులోని కథాంశం కావచ్చు.]

1. అదె కైలాసము దృగ్విలాసము విహాయశ్చారిణీసమ్మద
ప్రదవిన్యాస ముదగ్రభాసము మరుద్వ్యానూసదాధ్యాస మ
భ్యుదయన్యాస మసన్నిరాసము మయూరోదారనిధ్వానవి
భ్యదహివ్రాతకృతప్రవాసము త్రినేత్రావాస ముర్వీశ్వరా[2]

---

1. స.ఆం.సా.3 సం. 100–134 పుటలు

2. 2వ–7వ. ఉదా.వ.

2. అరుణపుష్పావళి యగ్నిగా సంధించి
యళుల నుల్కాలుగాగ నావహించి
చందడి వీతెంచు దక్షిణపవనంబు
భస్త్రానిలంబుగాఁ బరిభవించి
చిలుకలు పికములు నేదోడు నేయంగ
మాధవుండను కమ్మరి గడంగి
యంగజుండను పతి యానతిఁ బసిపూని
మొగడలమ్ములు కుల మొనలు చఱచు

కొలిమియొక్కొ యనఁగఁ గరియు పరాగంబు
విస్ఫులింగములుగ విరహులలుక
నేచి పూచియున్న యీ యశోకమహీరు
హంబు గంటె మాళవాధినాథ!

3. అలకలు తేఁటిదాఁటులును హస్తతలంబులు పల్లవంబులుం
బలుకులు గీరపోతముల భాషలు మేనులు బువ్వుఁదీగెలున్
లలిఁ దమలోఁ దడంబడ విలాసవతుల్మదనాధిరాజ్యల
క్ష్మలగతి నెల్లచో విరులు గోయుట చెన్నెసలారెఁ దోటలన్.

4. అలరుల పాన్పులం దలిరుటాకుల సెజ్జల హర్మ్యవేదికా
తలములఁ దీవయిండ్ల సికతాశయనంబుల మున్వియుక్తిమై
నలఁదురి వందు శందువల నప్పటికప్పటి కింపు బెంపఁ గో
ర్కులు దనివారి వేడ్కపడఁ గూడిరి వేడుకతోడ దంపతుల్.

5. అలికలితపంకజము నొక్క యతివ దెచ్చి
చుట్ట మగునట్టి వనితకుఁ జూపుటయును
తన కురులు మోమునెదుట నడ్డంబు లేక
తోచె ననుచు నమ్ముగ్ధ యద్భుతముఁ బొందె

6. ఇఱియు కుచంబులం దొకటి యించుక పీడ్వడ నొక్కకేల లేఁ
బొఱఁ గబళించి విక్కుచును బూపున కె త్తినచేతిచంక క్రొ
మ్మెఱుఁగులు హ స్తముం గడచిమీఁదికిఁ బ్రాకగమున్నగన్నయా
గుఱుతులు డాసి కోసెఁ దుదికొమ్ములపూవులు కొమ్మ
నెమ్మితోన్

7. ఇట్టిపాపయి ల్కుందేలు మట్టి యనుచు
జనులు కనుకవి పలికెడు చందమామ
నడిమిమచ్చకు నెఱిగి పే రిడఁగ నేర్తు
రప్పురమున మేడలపయి నాడు సతులు.

8. ఏపునఁ జెలరేగి యేయు మనోజున్మ
చెఱకువిల్ రెండుగా విఱిచిపైతుఁ
బలువ లై పలుకు చిల్కల నాలుకలముల్లు
విఱిచి యూరములలో వెడల నడతు
మదమున మ్రోయు తుమ్మెదలఁ జంపక లతాం
తములలో మునుగంగ విమురింతుఁ (?)
దగులమై పీతెంచు దక్షిణాశాగంధ
వహు మహాహీంద్రుని వాతఁ ద్రోతు

నేటి కులికెదు నాయట్టి కోటి కలుగ
వెలది; నీ మదిలోపల వెఱవకుండు
మమ్మ; ధైర్యంబు వదలకు మమ్మ యెందుఁ
గత్తలము గల్గు మేనికిఁ గలదె బాధ?[3]

9. కటి వడకాడ నీల్గ నసికొను కరంబున నక్కలించి పి
న్నటి తరళంబుతోడ నయనద్యుతి ఘూర్ణితలం దెల్ర్ప నుం
గుటములఁ మోపి నిక్కుచును గొబ్బివ్వరి చన్నులచాయమోముచ
క్కటికెసగంగఁ జొచ్చె నొకకామినితోయజషండమిమ్ములన్[4]

10. ఎమలినీకాంత యెంతయుఁ గంది వంద
వారుణీసక్తుఁడై వసువ్యయము చేసి
యరిగినట్లు సరాగియై యంబరంబుఁ
దొఱగి పశ్చిమజలధిలో నుఱికెఁ దరణి.

11. కలయంగ నలఁదిన కస్తూరిపెల్లున
జలముల దెల్లను గలఁగఁ జేసి
కుచమండలంబుల కుంకుమచర్చల
నీ రెల్ల జేవురునీరు చేసి
తనులిప్తసురభిచందనకర్దమంబున
వారి నెల్లఁ బులకవందు (?)నేసి
మూలల నవపుష్పమాలికావితతుల
వనమెల్లఁ దెట్టువ గొనఁగఁ జేసి

3. ప్ర.ర. (ఆ) 4. 9ప–11ప. ఉదా.ప

యలక లలికవీథి నంటఁ గస్గవలఁ గెం
పెలయఁ గామచిహ్నా లెల్ల బెరయ
నలరువాతు లమర జలకేళి సాలించి
కొలను వెడలి రింతు లలసగతుల.

12. కులశైలంబులలో సువర్ణగిరిదిక్కుంభీంద్రవర్గంబులో
బలభిన్నాగము లోకపాలకులలోఁ బర్జన్యుఁ డుగోగ్రగం
బులలో శేషుఁడు పెంపుఁ గన్నకరణిం బూజ్యాధిపశ్రేణిలో
వెలసెన్ విక్రమసేనభూవిభుఁడు దోర్వీర్యప్రతాపంబునన్[5]

13. కేలిఁ దెప్పము సేసి క్రాలి లీలావతి
నీఁదించుచును నొక్క యింతి డాసి
చేయిచ్చి యిందు విచ్చేయు మంచునుఁ దన్వి
నడిపించుచును నొక్క పడఁతి సూది
ముదితచేకూడను ముద్దులాడుచు నొక్క
తరుణికి నిమ్మలఁ దమ్మ యొసఁగి
రమణి పాపటఁ బుష్పరజముఁ బోయుచు నిదె
మిగిలెఁ గొమ్మని యొక్క మగువ కిచ్చి

కదలఁ బడినట్టు లొక్కతెఁ గౌగిలించి
ముంపు మునిగిన ట్లొక్కతె మోవి యాని
లలితనాయకకేలీవిలాస మమర
లీల జలకేళి సలిపె భూపాలసుతుఁడు.[6]

---

5. ప్ర.ర. (జ) ఉదా.ప. 6. 13ప–15 ఉదా.ప.

14. కొలఁదికి మీఱఁ బెద్దయగు కోటతనర్పున వస్తుసంతతో
జ్వలతరసత్ప్రభాతి రవిచంద్రరుచుల్ సొరనేరకున్న సం
ధ్యలు దివసత్రియామలనుదత్పురి పౌ(వా)రజనంబెఱుంగఁ ద
మ్ములముచవిన్ విహంగగతిఁ బూవులతావి రతిప్రసంగతిన్

ఈ పద్యం కుమారసంభవంలో (VII— 105) కనిపిస్తుంది.

15. క్రాలుఁగన్నులు ముద్దుమొగములు దమకు
నసదృశ ప్రభావమునఁ జెల్వొగుటఁజేసి
మునిఁగి మీలను దలచెత్తి వనరుహములఁ
చూలపఱచిరి వనకేళివేళ సతులు.

16. గొనయముతమ్మిసూల్ చెఱకుఁగోల ధనుర్లత పూవులమ్ము లే
టునునొకమాటు తా నతనుఁడున్ మునునుగ్రు జయించె జీవరా
శి నొడుచు నేమి చెప్పనని చేయు నుతుల్ తగు మోహనప్రవ
ర్తన గల కాముఁడీవుత ముదంబున మీకిలఁగామసౌఖ్యముల్[7]

17. చనవున రెండు వక్త్రములు చన్నుల పాల్గుడువంగ నొక్క మో
ము నగఁగ నొక్కయాననముముద్దనటింపఁగనొక్కయాస్యము
న్గనఁగ సిదేమి పల్కదని యాలపవంబునఁ బెక్కలించు(?)ను
బ్బుననగుషణ్ముఖుం దెలమిఁబొందిత్రిశక్తులుమాకునీవుతన్.[8]

18. చూపులకట్టు పూఁదూపులఁ జేపట్టు
నబలల చూడ్కుల యాయుధములు
తాయంబునకు గండుఁగోయిలఁ గూయించు
బాలల పలుకుల మూలమంత్ర

---

7. ఉదా.ప. 8.17ప–32ప ; ఉదా.ప.

మెదిరికిఁ దేఁటులనెదయాట లాడించు
నబలల యలకల యా_ప్తబలము
పవరణకుం జంద్రుఁ జాలించు మగువల
మొగముల సేనకుఁ దగిన మొగము

భావభవునకు; నటుగాక బలమె బలము
గాఁగఁ దిరిగెనే వీరిచేఁ గాసిఁబడదె ?
యనఁగ సౌందర్యసంపద లభినవముగ
వఱలుదురు తత్పురంబున వారసతులు.

19. తరుణవయస్కుల యౌవన
పరిపాకుల వృద్ధజనుల భటులను నిజసో
దరులను గురులనుగాఁ జూ
తురు పురము పతివ్రతాసతులు పుణ్యవతుల్

20. తరుణుండగు శీతలకరు
మరగి వియల్లక్ష్మి తన్ను మాని ముదుకఁడున్
ఖరకరుఁడును నని ద్రొబ్బిన
కరణిన్ రవి పశ్చిమాద్రికడఁ గ్రుంకె నృపా! [9]

21. తఱులు వడి యుత్తరాయణదక్షిణాయ
నముల రవితేర విడిలిన నఱవ లట్లు
మెఱయుఁ గనుఁగొనఁ గొమ్మలు మింటి కిడిన
కుదురువిధమునఁ దనరారు కోటమీఁద

---

9 పోతన భాగవతం. x —1287.

22\. దక్షిణపవనంబు తనుగంధమున నూని
మలయాచలముమీఁది మరులు మానఁ
దివిచిపట్టిన లేఁతచివురుల చాయకుఁ
గరతలంబుల కాంతి వరము లొసఁగఁ
గుసుముల్గోయుచో గోళ్లమెఱుంగులు
తవి మొగ్గలకు గవుసెవియ లొసఁగ
బలువగఁ జెలగెడు పలుకులు రాజకీ
రములకు నొజ్జతనములు సేయఁ

గురులు నలులపిండు బెరయఁగ వనమయూ
రముల గతులు వేఁద గమనలీల
నసఁగి పెనఁగి ప్రీతి వనకేళి సలిపిరి
వనజముఖులు వేడ్క పనుపు సేయ

23\. దళమైన చీఁకటిగుళియలు నేసి ప
ద్మాసనుం డాయువు వోసె ననఁగఁ
దొలుకారుమెఱుఁగులు కొలఁదికి నటికి వి
రించి వాల్గనుల నూరించె ననఁగఁ
జంద్రికాసార మజ్జుఁడు గట్టిగఁ బద
నిడి యాణిపాణియుఁ బదసె (?) ననఁగఁ
జాటించి విధి రాగపరమాణువులఁ బల్ల
వితమూర్తి గాఁగ నిర్మించె ననఁగఁ

బొలుచు నలులను మదనునమ్ములను ముత్తి
యముల విద్రుమవల్లిక నపహసించి
తరుణి యలకలు జాడ్కలు దశనములును
యధరమును బ్రస్తుతింప నా యలవి యెట్లు ?

24. దానానేకపబృంహితస్వనము గంధర్వావళీహేషిత
ధ్వానంబున్ మృదువేదనాదమును గాంతానూపురారావమున్
గానానూనరవంబుఁ దూర్యబహుశంఖస్ఫారరావంబుఁ బె
ల్లై నీరాకరఘోషమో యనఁగ నిత్యంబుం జెలంగుం బురిన్

25. ధర వియోగుల నెల్లఁ బరిమార్పఁ బూని హృ
ద్భవుఁడు గట్టిన వీరపట్ట మనఁగ
విరహులపై దండు వెడలుచో మదనున
కెత్తిన కెంజిపురెల్లి యనఁగఁ
దోయధి వెడఁ గ్రుంకఁ దోచు పురందర
కుంభిసింధూరితకుంభ మనఁగఁ
గులిశాయుధుని పెద్దకొలువునఁ జెన్నొంద
దీపించు మాణిక్యదీప మనఁగఁ

గుముదినీరాగరససిద్ధఘుటిక యనఁగఁ
గాము జనరంజనౌషధీకబళ మనఁగఁ
బొడుపుఁ గెంపున బింబంబు పొలుపు మిగులఁ
జంద్రుఁ డుదయించెఁ గాంతినిస్తంద్రుఁ డగుచు.

26. ధమ్మిల్లభారముల్ కమ్మపూవులతోడఁ
జాఱికొని వెన్నులఁ జాలసి వ్రేల
నలికతలంబులఁ జోలాడుకుంతలములు
ఘర్మజలంబులఁ గలసి యంటఁ
గహ్లారదళముల కాంతి మిన్నక కొన్న
చెన్నునఁ గనుఁగవ జేగురింప
సోచెడువల్లులఁ బోలెడు మేనులఁ
బయ్యటగాలిచేఁ బ్రస్ఫురింపఁ

ఘనపయోధరములఁ గాశ్మీరచర్చలు
గలుఁగ నలసగతులు చెలువ మొందఁ
బుష్పఁబోఁడు లంతఁ బుష్పాపచయకేళి
సోలి వచ్చి రా నృపాలుకడకు.

27. ధరణీశ ! లవణాబ్ధిపరివేష్టితక్షితి
వఱలిన నేరెడుగఱితికొలది
నొక్కొక్కదిక్కున కొక్కొక్క లక్షయో
జనములు తన్మధ్యమున సువర్ణ
సారమై యున్నది చతురుత్తరాశీతి
సాహస్రయోజనసంఖ్య మొదలి
వలము పదాఱువే ల్గలిగి వెడల్పు ము
ప్పదిరెండువేలుగాఁ బాఁతు లోఁతు

మొదలి లమునంతయై తుదిఁ బదాఱు
నేసి వేలుగా మేరువన్ శిఖరి యొప్పు
దానిపై బ్రహ్మపురి చతుర్దశసహస్ర
యోజనస్థితిఁ గనుఁగొనఁ దేజరిల్లు

28\. నలువగు రక్తి మించిన మనంబున నుబ్బను లావు పుట్టి చెం
గలువ వికాసవేళ ము రుకంబు(?)నటింపఁగఁ బువ్వుఁబోఁడి మొ
క్కలమునఁ బేర్చి నాధునధికారముఁ గైకొని కేళి సల్పెన
చ్చలమున సిగ్గు చాలమియుఁ జన్గవహారము లోలిఁ జెప్పఁగన్

29\. నీర నగ్ని యునికి యారయ విస్మయం
బనుచు బాడబాగ్ని కడలి యప్పు
రంబుఁ జొచ్చె నొక్కొ రత్నాకరము మణు
లనఁగఁ జెలువ మమరు నాపణములు.

30\. నూఱు క్రతువులు సేయని పాఱుటిల్లు
కోటి పడగలు లేని కిరాటగృహము
జాతిరత్నంబు గాని పాషాణకులము
వెదకి చూపిన వీటఁ బన్నిదము గలదు.

31\. నెఱవుగా విరియక నెగడు నెత్తావి తు
మ్మెదలచే మునుమును మీఁదు వోక
యకరువు నెఱయక మకరంద మొలుకక
నెఱిదప్పు నొరగక కఱకు లేక

బింకంబు లొక్కింత ప్రిదులక జిగిసొంపు
చెదరక జేకులు చిక్కువడక
పొరటతో రాయక పొలుపుసొం పెడలక
ఉడియు క్రీగాంచే సూరగిలక

కరము శోభిల్లు రుచిరమంజరులు గోసి
వనిత యొక్కర్తు తనదు లావణ్యరసము
నెలమి నుద్యాన మొక క్రొత్త చెలువు దాల్ప
లతలలో నాడు జంగమలతికవోలె.

32. పర పై యొప్పెసలారు మానికపు సోపానంబులం బ్రజ్వల
ద్వరపద్రోపలసైకతంబులను సౌవర్ణారవిందంబులన్
హరినీలాసితవారిజంబులను జక్రాంగాదివాఃపక్షివి
స్ఫురణం గల్గు సరోవరంబుఁ గనియెన్ భూవల్లభుం డయ్యెడన్

33. పరముఁడు కంధరస్థలముపై నిడి వేడుక ముద్దులాడఁగాఁ
గరమున మౌళిగంగయుదకంబులు మెల్పునఁ దీర్చి యూది ని
కరములు భూషణేందువకు కొరవ (?) తారకలీలఁ జేయు త
త్కరిపడనుండు మత్కృతికిఁ దా సుముఖస్థితితోడఁ దోడగున్

34. పరిణతఫణిలతాపత్రంబుఁ గదిసిన
చివురునాఁ జెక్కునఁ జేయి చేర్చి
కందర్ప మదకరి కరముపై జక్కవ
లెఱఁగొనఁ దొడఁగుచ మిఱియ మోపి

10. 33ప–34ప; ప్ర. ర (జ)

దవనంబు పొరకలఁ గవిసిన మంచునాఁ
బలుచని చెమట మైఁ గలసి మెఱయఁ
గలువతేకులు మౌక్తికముల పీనెడివనాఁ
గన్నుల బాష్పంపుఁగణము లురల

వేఁడినిట్టూర్పు గాడ్పులు విరహవహ్ని
శిఖలు ప్రబలంగ వలవంత చింత నొగిలి
యేకతం బున్నదాని రాజేంద్రతనయఁ
గనిరి లతికాగృహంబులో వనజముఖులు.

35. పలుచని చంద్రికారసము ప్రిన్నని నున్నని తేట క్రొమ్మెఱుం
గుల తుదలు న్విదిర్చు నెలకొమ్ములకాంతి పసిండినిగ్గుతోఁ
గలిపి యలంతి వన్నెయిడి కాయజు నిల్పిన రత్నపుత్రిక
న్నలువ సజీవిఁ జేసెనొకొనాఁ దగు నాతివిభాతి చూడ్కికిన్[11]

36. పాంథుల హృదయముల్ పల్లటంబులు సేయ
దర్పకు పనిచిన దండనంగ
విరహిమృగంబుల సురిగింపఁ దివిరెడు
కాయసంభవుని మొక్కల మనంగఁ
గడు నల్గి జైత్రునాగారంబు ముద్రింప
మనసిజు పనిచిన యనుఁగు లనఁగ
సహచరుండగు గంధవహుఁ గానఁగా మీన
కేతను పంచిన దూతలనఁగ

11. 35వ–39వ. ఉదా. వ.

నళినవాకారసౌందర్యసుభగలీల
లతిశయంబుగ మెలఁగుచు నసమబాణు
పుష్పలావికాజనములవోలె నెఱసి
కోమలాంగులు బువ్వులు గోసి రెలమి

37. పూవుల పోఁడిపులై చిలుకబోదలు కోయిలపిండు మందలై
తావుల క్రొవ్వులై యలివితానము గానము తానకంబునై
కావను బంధుఁజాలుటఁ దిరికాలముఁ గల్గ వరంబుఁ గన్నయు
న్లై వనరాజి పొల్పగుఁ బురాంతికభూముల నెల్లఁ జూడఁగన్.

38. పొదవుగ నెల్లయంగళులఁ బోఁడిపులు వోసిన నూత్నరత్నముల్
గదఁక ననేకవేషములు గైకొని వచ్చిన యర్థికోటికిన్
విడికిళు లాదిగాఁగ బలివెట్టుదు రప్పురి వైశ్యభామిను
ల్గదపక హస్తకంకణరుఖధ్వను లొప్పఁగ నెల్లయప్పుడున్.[12]

39. ప్రత్యగ్రరచనాతిభాసురప్రాసాద
విర్జితగోత్రావనీధరంబు
ప్రాకారశిఖరాగ్రబంధురమణిగణ
ద్విగుణితతారకావిభ్రమంబు
పరిఖాజలాంతరపరిబింబితద్రుమ
స్మారితపాతాళభూరుహంబు
వరపుష్పసౌరభావర్జిత మధుపకా
వ్యీకృతాశావారణేంద్రగండ

12. జక్కన విక్రమార్కచరిత్రలో ఈ పద్యం కనిపిస్తుంది. చూ: I—74ప.

మప్సరఃస్స్పృహణీయ లీలాతిశయవి
లాసినీజననేత్రవిలాస జనిత
కుసుమశరబాణవైహ్వాత్య మసదృశార్థ
నిర్జితాలక ముజ్జయినీపురంబు.

40. ప్రాణంబు లెడల నభ్యాసంబు సేయు మా
ర్గంబన నిట్టూర్పుగాడ్పు లెసఁగఁ
గవ్యశాలను సేయి గ్రమ్మకై వడిఁ గామ
శిఖిఁ గ్రాఁగి మైదీగె చెమట వొడమ
మదనునమ్ములు నీరుపదను వెట్టినక్రియ
వాలుఁ గన్నులు బాష్పవారి మునుఁగఁ
బగ లేదుటయు నెడఁబడు రథాంగము చంద
మునఁ జన్నులు ముఖోద్గముగ వడంక

ప్రాణ మెడలి నెఱపు వడియొడలు (?)
భూషణములతోడి పొత్తు విడిచి
లాఁతు లైరి సఖులు లలఁతులు వాయని
ప్రాఁత లైరి నిషధరాజసుతకు.[13]

41. బలిమి రాహు సుధాంశుబింబంబు వెలిచి
పాఱఁ గడు డాసి వెనుకొనుపగిది నొక్క
యెడ సఖులు గూడి చెలరేఁగి యాఁడుచోట
నీలవేణియు మొగమును నెలఁత కొప్పె.[14]

---

13. ప్ర.ర. (జ): 14. 41ప.—43ప. ఉదా.ప.

42. భట్టనారాయణభాషారమాదేవి
లబ్ధవర్ణుల కర్థలబ్ధిఁ జేయు
బాణకాగ్భ్యమినీప్రసవమంజరి విశా
రదుల కలంకారరమణఁ జేయు
రాజశేఖరభారతీజహ్నుకన్యక
సుకవీంద్రులకు భావశుద్ధిఁ జేయు
మాఘవాణీశీతమారుతగతి సార
మతులకు రోమోద్గమంబుఁ జేయు

నని యెఱింగి వారి యడుగులు దలఁచి న
మస్కరించి దండి మఱి మురారి
వామనుని గుణాఢ్య క్షేమేంద్రు విల నలం
కారవిదులఁ దలచి గారవమున.

43. భూమినిండె మింటఁ బూర్ణమై కర్కట
మకరమీనరాశి మహితమైన
హరియశస్సుధాబ్ధియందుల తుంపురు
లనఁగఁ జుక్క లొప్పె నాకసమున.[15]

44. మకరధ్వజుని విల్లు మనము వాయిని విడి
నమలింపుగాఁ జేయు నల్లఁజెఱకు
మదనబాణావళి మనము క్రుమ్మళ్లపైఁ
దొలుపారఁ దఱిమెదు పుష్పచయము

15. ఈపద్యం పోతన భాగవతంలో కనిపిస్తుంది. X–1291.

మనసిజాతుని యెల్లి మనము వినోదార్థ
మై వచ్చి యాడెడు మావిచిగురు
మరుతేరి హయములు మన యిండ్లలోఁ బంజ
రంబులఁ బొరలు కీరవ్రజంబు

తా ననంగుఁ డట్టివాని యలంచుట
యేమి? యతని కడిమి యేమి? యతని
వీర మేమి? ధరణిఁ బిచ్చుక యలుకేమి
వాలఁగ............నేమి వాలుఁగంటి[?] [16]

45. మదవతీగండూషమదిరాభిషేచన
వడి నంకురించిన వకుళములను
నతివల మృదుపాదహతి నూత్నకోరక
స్ఫురణఁ గైకొన్న యశోకములను
సుదతుల క్రేగంటి చూడ్కి పైఁబాఱినఁ
దిలకించి యలరిన తిలకములను
నవ్వుల నెవ్వీగుఁజవ్వుల సోఁకునఁ
గొమరొంది ననిచిన కురవకముల

నెరగఁ జరణములను నెఱకలు విరిసిన
మొగడలందునుండి మొఱయు తేఁటి
కొదమ లెలమిఁ బొంది ఘూర్ణిల్ల నధికవి
భూతిఁ దనరి చూతపోతములను.[17]

---

16. ప్ర.ర.(జ) 17. 45వ—52వ. ఉదా.వ.

46. మరలఁగఁ బోదు రిండ్లకును మాపపునంతకుఁ జేలలోపలం
దిరిగి యొకింత లేఁతవడ దేరెడు మోములఁ జెన్ను సేయుచున్
బరిగొని క్రాలు దృగ్రుచుల పెల్లునఁ జీకటి నెల్లఁ బాచినం
దెరువరు లర్థిఁ గూడఁ బఱతేరఁగఁ బామరభామినీజనుల్

47. ముత్తా కేకుజము ల్పదల్చె? మొగడల్మొన్నే మహీజంబులం
దొత్తెం? బువ్వులుపిందఁగాఁ బెరిగెనే యుర్వీజముల్? పూఁపలన్
మొత్తంబై విలసిల్లె నే ధరణిజంబుల్? గాయలం బండులం
జిత్తానందముఁ జేర్చె నే క్షితిజముల్ చెల్వొందగాఁ జెప్పుమా!

48. మొగములు విరిదమ్ములఁ గుచ
యుగములు గోకములఁ జూడ్కు లుత్పలముల మం
దగతులు హంసలఁ దోల వ
రుగుగతిఁ జొచ్చిరి సతు ల్సరోవర మెలమిన్

49. వామనానేకపము చక్రవాళకుధర
ధాతుతటముఁ గోరాడుచోఁ దరులు విఱిగి
కూలుటయు మింటి కెగవెడు ధూళివోలెఁ
బర్వె నెఱసంజ పడుమఱ పట్టుకొనుచు.

50. సతులు చల్లఁబోరాడుచో జలకణములు
నెఱికురులమీఁద నిండి క్రిక్కిఱిసి చెలువ
మమరెఁ గనుగొన నింద్రనీలములతోడఁ
గలయఁ గ్రుచ్చిన మౌక్తికంబులను బోలె.

51. సారథి శతవృద్ధు చక్రంబు లొనఁగూడి
జరగవు రథమున సంఘటించి
యుదకంబునోఁకున కోర్వని యరదంబు
చేతికి బిరుసైన తాతివిల్లు
గఱితాకు కోర్వక గడగడ వడఁకుచు
మువ్వంకఁ బోయెడి చివ్వనారి
మేష్ట సిరును లేక మెదలాడ నోపక
వర్ణహీనంబైన వారువములు

నిట్టి సాధనములు నీకు నెట్టు లొదవెఁ
ద్రిపురముల నెట్లు గెలిచితి దేవదేవ !
యనుచు నగజాతచెలు లాడ నలరు శివుఁడు
చిత్త మిగురొత్త మనల రక్షించుఁగాత !

52. సుదతులు దస్సినచో నలంతలు వోవ
సొబగుఁడై చలిమిరి చూపి చూపి
యువిదలు తిలకించి యున్నచో వేడుకఁ
గొలఁది మీఱఁగ నొజ్జఁ గుదిసి కుదిసి
సొబగుల పెనకువచోఁ దాన వలఁతియై
యెఱుకువ వాసన కెక్కి యెక్కి
వెలఁదులు ముదమున విహరించుచో నోయ
గంబున వీథులఁ గ్రాలి క్రాలి

యతులితంబైన శృంగారరతుల విజవి
భూతి పొందాన నేసి తత్పురములోనఁ
బవలు రేయును నుడుగక తవిలి తిరుగు
మిండడునుఁబోలె మందానిలుండు లీల

53. హరగిరిసురగిరిరోహణ
గిరు లీనినకొదమ లనఁగ గృహములు పురి న
చ్చెరు వగును కుడ్యరత్న
స్ఫురణను విలసిల్లి తగిన పొదవులతోడన్ [18]

ప్రబంధమణిభూషణంలోని క్రింది ఐదు పద్యాలు విక్రమసేనంలోనివే అని విరదవోలువారు చెపుతున్నారు. [19]

54. శరధిప్రఖ్యము వేదమూర్తులు కుభృత్సంకాశముల్ మారుతో
ద్ధురవేగంబులు కిన్నరేశధను లుద్ధూతారు లభ్రంకష
స్ఫురణౌన్నత్యము లభ్రగేహనిభముల్ పుణ్యాప్తముల్ తత్పురీ
పరిఖావిప్రగణాశ్వవైశ్యసుభటప్రాకారసౌధోన్నతుల్. [20]

55. వికచారవిందదీర్ఘికలకో విహరించి
పలిఁ గమ్మఁదావుల వనగి పెనగి
కుసుమితనవలతావిసరంబుఁ గదలించి
యల దేవియల పోన నలముకొనుచు

18. ప్ర.ర.(జ): ఉదా. ప.

19. ప్ర మ.భూ; పీఠిక 16–17పు. 20. ప్ర.మ.భూ. 137 ప.

సహకారపాదపచ్ఛాయలకై యేగి
శశికాంతవేదుల సంచలించి
సురతకేళిశ్రాంతి సొగియు ముద్దియలపై
చిట్టాడు తనువుల చెమట లార్చి

చంచరీకంబురీతిఁ బర్జన్యుభాతి
విరహపరితాపహారుమాడ్కి సురటిపోల్కి
నప్పురంబున సకలజనానుమోద
కరణ దక్షుఁడు దక్షిణగంధవహుఁడు.[21]

56. రత్నసుందరి వక్త్రేందురమ్యలీలఁ
గాంచి విలసిల్లె నృపనేత్రకైరవములు
పొంగె రాగాంబుధులు నిట్టఁ బుష్పధన్వు
నగ్గముకువారి చేష్టల నభినుతింతు.[22]

57. కప్పురపు ధూళి యొక్కఁడు
కుప్పం బ్రస్వేద మొదలఁ గూరకయున్నన్
మెప్పువడఁ గుండలద్వయి
నొప్పగ వీడ్వడగఁ దాల్చు నొక్కం డొంటిమన్.[23]

58. మంచాంతరమ్ముఁ దన పా
దాంచలమున మెట్టి గర్వహాసవికాసా
భ్యంచితవదనుండై యా
డించున్ కరవాల మలపు డిగ్గం ద్రోవన్.[24]

---

21. ప్ర.మ భూ. 147 వ. 22. అందే. 492 వ. 23. అందే. 493 వ.
24. అందే 494 వ; ప్ర మ భూ.పీఠిక. 18. పు.

ప్రబంధమణిభూషణంలో పేర్కొ-బడ్డ ఈ క్రింది మూడు పద్యాలను కూడా విడవపోయవారు విక్రమసేనంలోనివని ప్ర మ భూ పీఠిక ( 8 పు)లో ఉదాహరించినారు. కాని ఇంతకుముందు విక్రమసేనంలోనివిగా చెప్పిన ఐదు పద్యాలతోపాటు వీటిని ఉదాహరించక విడిగా ఉదాహరించడానికి కారణమేమిటో లేక ఈ పద్యాలు విజయసేనంలోనివని. ఉదాహరించడానికి బదులుగా పొరపాటున విక్రమసేనంలోనివని చెప్పినారో

59. సుందరీసమితికి మందయానంబు ల
యిరవులఁ గఱపెడు గురువు లనఁగ
మధుకరబృందంబు మదజలక్షేపణఁ
జేసి యాకర్షించు సిద్ధు లనఁగ
జనుల చూడ్కి-కి గురుశైలభావంబులు
చూపియాడెడు బహురూపు లనఁగఁ
బరవీరభటుల నుద్ధురభీషణాకృతి
భంగుల వెఱపించు గొంగలనఁగ

గతుల యొప్పును దానాంబుగంధములును
నున్నతుల యొప్పుఁ జేష్టాసముద్ధతులను
నతిశయిల్లనుఁ బరిఁ బొలుపారుఁ జిత్త
రంజనాకృతు లగు భద్రకుంజరములు.[25]

60. రమణివంశక్రమాగతరాజ్యలక్ష్మిఁ
గీర్తి లక్ష్మి సపత్నిగాఁ గీలుకొలిపి
యేలఁగల పట్టి లేమికి నీ మనంబు
కలఁగు నోడకంబము మీఁది పులుగుపోలె.[26]

---

25. ప్ర. మ. భూ. 104 ప.

26. ప్ర.మ.భూ. 171 ప.

6 . లావణ్య మెల్లఁ బ్రతిబిం
బావహ మయి రూపుదాల్చి యాత్మజుఁ దంక
శ్రీ వహియించుటకం జెను
భావింపఁగ నొందు గలదె పరమప్రియమై. [7]

2. వల్లభ నీకు మున్నుగ దివంబునకుం జని యేన యచ్చటన్
వల్లభనై చరింతు సురభామల కుంతలమీరి చెన్నుగన్. [8]

3. మా కెల్లం గలహంబు గూడ దిఁక నీ మర్యాదఁ జెల్లింపవే [9]

ఈ క్రింది మూడు పద్యాలను ఆరుద్రగారు విక్రమసేనంలోనివిగా పేర్కొన్నారు. [0]

64 అమరు లమృతాబ్ధిలోపలి యమృతరసము
వెండిచేరుల పటికంపు కుండఁ గట్టి
చేదుకొనియెదరో నాఁగ శీతరోచి
మెల్లమెల్లన రుచులతో మిన్ను ప్రాకె.

65. ఉదయరాగ మించించుక యుజ్జగించి
యిందుఁజంద్రుఁడు గన్నులపండు వయ్యె
ధావనానంతరస్నిగ్ధదాక్షిణాత్య
రాజశుద్ధాంతదంతవజ్రముల కాంతి. [31]

66. తనరి రాగిల్లి ముక్తుఁడై తరతరంబ
నిర్మలత్వము బొందుచు నీరజారి
పరమయోగియుఁబోలె సత్పథమునందు
నడువగాఁజొచ్చెఁ గువలయానంద మెసఁగ.

---

27. ప్ర.మ.భూ. 172వ. 28. ఆం ప్ర. ర: 458 పు. 29. అహో. పం.
30. వ. ఆం. సా. – 3 సం; 115–117 పుటలు.
31. భీమఖండము I –43.

# విక్రమార్కచరిత్రము

కవిభల్లటుడు

---

[ఆంధ్రశబ్దచింతామణి, ఆంధ్రకౌముది, అప్పకవీయం – ఈ మూడింటి లోను కవిభల్లటుని ప్రసక్తి కానవస్తుంది. తొలి రెండుగ్రంథాల్లో ఈతని అభిప్రాయం పేర్కొ్కబడగా అప్పకవీయంలో ఈతని 'కవిభల్లటవక్కిక' పేర్కొ్కబడింది. దీన్నిబట్టి ఇతడొక ప్రాచీనవ్యాకరణకర్త అని స్పష్టమవుతుంది. ఇతడు పదమంజరి, గణమంజరి అనే లక్షణ గ్రంథాలను; విక్రమార్కచరిత్రం, వేతాళపంచవింశతి, శూద్రకరాజచరిత్రం అనే కావ్యాలను కూడ రచించినట్లుగా తెలుస్తుంది. ఐతే ఇవన్నీ ప్రస్తుతం అలభ్యాలు. పై వాటిలో ఒక్కొక్కకావ్యం నుండి ఒక్కొక్క పద్యం మాత్రమే లభిస్తుంది.]

1. చెప్పకున్న నీవు జీవంబు విడుతువు
చెప్పినపుడు తనకు జీవహాని
చెప్పి మున్న నీకు జీవంబు,విడిచెద
నీవు చన్న వెనుక నిలువలేను.

వీరేశలింగం పంతులుగారు ఈ పద్యం కవిభల్లటుని విక్రమార్క చరిత్రంలోనిదట అని ఉదాహరించినారు.[1]

2. కీర్తి విలసిల్లె విక్రమక్షితివరుని.

---

1. ఆం.క.చ. (1 వం.) పుట 713.

2. ఆంధ్రకౌముది అనే వ్యాకరణంలో ఈ పద్యం భల్లటకవి విక్రమాదిత్య చరిత్రలోనిదిగ పేర్కొ్కబడింది.

# విజయరామచరిత్రము

శశాంకుడు

---

[విజయరామచరిత్రమనే పేరు గల కావ్యమొకటి మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది.[1] కాని దాని కర్త ఎవ్వరో తెలియదు ఈ విజయరామచరిత్ర కర్తశశాంకుడనేక్కవి. ఈ రెండు విజయరామచరిత్రలు ఒక్కటేనో చెప్పలేం?]

1. కైకయీనందనుం డతికౌతుకమున
మునిజనవినుతుఁడు రఘురామునకు మ్రొక్కె.[2]

---

1. An Alphabet cal ndex of Telugu Manuscr pts-R No. 583,
2. ఆం.కా.

# విజయసేనము

### తిక్కన

[పెదపాటి జగ్గన కూర్చిన ప్రబంధరత్నాకరంలోనూ: అప్పకవీయం, ఆంధ్ర ప్రయోగ రత్నాకరం మొదలైన లక్షణగ్రంథాల్లోనూ విజయసేనంలోని పద్యాలు ఉదాహరింపబడ్డవి. ఇది తిక్కన కృతమని నిశ్చయంగా చెప్పడానికి అంతగా ఆధారాలు లేవు లక్షణగ్రంథాల్లోమాత్రం ఇది తిక్కనకృతంగానే చెప్పబడింది కొన్ని లక్షణగ్రంథాల్లో దీనికి విజయసేనచరిత్రమనే పేరు కూడా కనిపిస్తుంది. విజయసేను డనే రాజకుమారుని చరిత్ర ఇందులోని వర్ణ్యాంశం. ఈ కావ్యం లోనివి మొత్తం పద్దెనిమిది పద్యాలు మాత్రమే ఇప్పటికి లభ్యమైనాయి. వీటిలో వైశ్యవర్ణనం, గణపతిస్తోత్రం, పరిఖా వర్ణనం మొదలైన విషయాలు వర్ణితాలు.]

1. అరిమానసమ్ములు దరికొని యేర్చు నె
 వ్వని యుజ్జ్వలాకారవైభవంబు
 బుధుల లజ్జానతిఁ బొందునట్లుగఁ జేయు
 నెవ్వని పాండిత్య మెసకమెసఁగ
 నే వదాన్యులనైన నెవ్వని వితరణం
 బులు వందిజనుల చాపల మొనర్చు
 వనితాజనము మానధనముఁ గో[illegible]
 చ్చలవిడి నెవ్వాని వి[illegible]సనంబు



అట్టి విజయసేను నభిరామమూర్తి వి
ద్యానిరూఢమతి వదాన్యవరుఁడు
మధురవిభ్రమైకవిధి యను జగమెల్ల
నతఁడు చిత్రగుణసమగ్రుఁ డగుట[1]

2. అల్లనఁ దొండ మెత్తి శివు నౌదల యేటి జలంబు పుచ్చి నం
పుల్లతఁ బాదపీఠకము పొంతనయున్న సహస్రనేత్రుపైఁ
జల్లి శివార్చనాకమలసంహతిఁ బోషణ వేయునట్లు శో
భిల్లు గజాననుండు మదభీప్సితసిద్ధికరుండు గావుతన్[2]

3 ఉత్సాహప్రభుమంత్రశక్తుల నజేయుండై పరీక్షించినన్
దిత్సావ్యగ్రుఁడు గాక విగ్రహముచో దేశంబుఁ గాలంబు సం
పత్సామగ్ర్యముఁ జూపి శక్యము దెసన్ బ్రారంభియై భూప్రజా
వాత్సల్యార్ద్రమనస్కుఁడైన (పతి) శశ్వచ్ఛ్రీసమేతుం డగున్[3]

4. కిసలయకదళీబిసబిం
బసుధాంశుప్రాయవస్తుబహువిధరూపో
ల్లసము మద ముడుప నజుఁడొక
యసమాకృతిఁ దాల్చె ననఁగ నంగవ యొప్పెన్[4]

5. కొనియెద మన్న బండరులు కోటుల కమ్ముదు రమ్మఁబూని తె
చ్చిన సర కెంత పెద్దవెల చెప్పినఁ గొండ్రు తగంగ విచ్చి, న
చ్చినవెల తీర్చి లక్ష్మి తమ చెప్పినయట్టుల చేయు సొంపు పె
శ్కొన గణుతింపరాదు, పురికోమటులం బ్రణుతింప నొప్పదే?[5]

---

1. ప్ర.ర. (జ). 2. ఉదా.మాల శ. IV -148; అ.రం.ఛం. III - 153; అం.ప్ర.ర.14$_8$ పు; ప్రపమ టీ.30 వ. 3. ప్ర.ర. (జ)
4. ప్ర.ర. (జ) ఛం.గ్రం.D 705 (అం.వి) 50 bపుట.

6. గీర్వాణాచలసానువాత్మరదనక్రీడాహతం బైన న
య్యుర్వీరంధ్రమునం దనంతఫణరత్నోద్యత్ప్రభ ల్పర్వి దృ
క్పర్వంబై పొది గట్టి పేర్చిన మదిం గంజంబ యంచున్ కన
ద్గర్వోన్మీలితనేత్రుఁడై మెఱయు వేదండాననుం గొల్చెదన్[6]

7. తరుణుల వీఁగు జన్నుఁగవ తాఁకున మన్మథచక్రవాకబం
ధురగతిలీలఁ గామినుల తోరపుటూరుల ఘట్టనంబులన్
కరివరహస్తకాండపటుఘట్టనలన్ బరిఖాతరంగముల్
దిరుగుడువడ్డ తీరములఁ దెట్టువుగట్టు సరోజరేణువుల్[7]

8. పద్మంబులను వప్రపద్మరాగప్రతి
బింబములను తగ బెరసి మెఱయఁ
గల్లోలములను రంగన్మకరాయిత
తుండములను నటు తొట్రుపడఁగ
బిసములు విహరణరసనమాగతరసా
తలనాగశిశువులు చెలిమి సేయఁ
జక్రయుగ్మంబులు జలకేళిలోలవి
లంబినీస్తనములు తడఁబడంగ

పొంపు మీఱినట్టి పెంపును గంభీర
తయును బరపు (బోవు) వేడ్కఁ దగిలి జనులు
సంస్తుతింప నఖిలసన్నివేశస్థితి
నప్పురంబు పరిఖ యతిశయిల్లు.[8]

---

6. ఉదా. వ. 7. ప్ర.ర. (జ) ఈ పద్యం తిక్కన నిర్వచనోత్తరరామాయ
ణంలో కానవస్తుంది. 1–151 8. ప్ర.ర. (జ)

9. మదనవశీకారమంత్రదేవత దృష్టి
గోచరమూర్తిఁ గైకొవియెనొక్కొ
సితకరబింబవిస్ఫృతసుధాధార వి
తంబినీరూపంబుఁ దాల్చెనొక్కొ
విధికామినీసృష్టి విజ్ఞానపరసీమ
భాసురతనులీలఁ బడసెనొక్కొ
శృంగారనవరస శ్రీవిలాసోన్నతి
మందరాకారంబు నొందెనొక్కొ

కాక యొక వధూటి కడుపునఁ బుట్టిన
భామ కేల యిట్టి రామణీయ
కంబు గలుగు ననుచుఁ గన్నియపై మహీ
పాలసుతుఁడు దృష్టి పఱపె నర్థి[9]

10. మహిమ చెడదు స్వామ్యమాత్యసుహృత్కోశ
రాష్ట్రదుర్గబలపరాయణులకు
నీవు విదియు నెఱిగి కావింపు సప్తాంగ
సంగ్రహంబు నీతిశాస్త్రనిపుణ[10]

11. పరధనపరాంగనాజన
పరిహారము పరమధర్మపథ మందురు స
త్పురుషులు మఱవక నీనిం
బరికింపుము వినకు మెపుడు పైశున్యంబుల్[11]

9. వ్ర.ర. (ఙ). 10. వ్ర.ర. (ఙ) 11. వ్ర.ర. (ఙ)

12. వల్లభుఁడే(వి)గుదుర్లభుఁడు వావిదెసం దగులాదియిమ్మెయిన్
దల్లడ మంద్రెదేల యుచితస్థితి కన్నను( బాపఁ జూచినన్
దల్లియు బంధులోకమును దండ్రియు నేమను వారెఱింగిరే
నుల్లమ యిట్లు నీకుఁ దగునో తగదో పరికించి చూడుమా![12]

ఈ క్రింది మూడు పద్యాలు తిక్కన విజయసేనంలోనివని విడదవోలు వెంకటరావుగారు పేర్కొన్నారు.[13]

13. అమ్మెద నవినఁ బద్మాక్షుకౌస్తుభమైన
వెలవక కొనియెదు వెరవు గలిగి
విలువ యిచ్చెద మని వేడినఁ బలిజాన్ను
గమ్మపసిండియు నమ్మఁ గలిగి
యే వస్తు వెంత ప్రౌఢ్దెందఱుఁ బనుదెంచి
యెంతటి కడిగిన నెదురఁ గలిగి
తన యింట లేని యర్థము అర్థపతి యింట
నైన వెదకిన లేవగుట గలిగి

తమ కులాచారచారువర్తనము కొలకు
వంగడుల యొప్పునకును బేహార మాట
గావి లాతంబునకు వాట గా దనంగ
వఱలుదురు పురవరంబున వైశ్యవరులు

14. ఉన్నచో గతిమాలియునికి యిష్టం బవి
గ్రుమ్మలు నేర్చిన కొండ లనఁగ
గాలిచేఁ దూలెడు కష్టంబు వోవగ
ఘనమైన నీలమేఘంబు లనఁగ

---

12. అ.క. III –254; ఆ. రం. చం. III –139;
చం. గ్రం. D.Nor706– (ఆం.వి.) 43b పుట.
13. ప్ర.మ.భూ. పీఠిక 14–15 పుటలు.

ఏను రూపమై యున్కి వెల్లదనం బని
కడు నల్లనైన దిగ్గజము లనఁగ
తిమిరారి యట యని ద్యుమణితో మార్కొని
నిలిచిన యిరులు మన్నీ లనంగ

దానవారి నాభిదప్నమై వీథుల
నేఱులట్ల పొంగి పాఱుచుండ
బవనిఁబోయి వచ్చు ప్రథమకేళిజయ
సారణములు పురము వారణములు.

15. ఘనసారకస్తూరికాగంధముల వన్య
గంధబంధములఁ గలిపి కలిపి
కుసుమితవల్లికాలసితవీథులఁ దొచ్చి
చని సరోగృహముల మునిగి మునిగి
సమధికాహార్యాంగసంగీతములతోడ
కన్నెతీగెల కాట గఱపి కఱపి
కుముదకుట్మలకుటీకోరకంబులు దూఱి
యలిదంపతుల నిద్రఁ దెలిపి తెలిపి

యనుదినమ్ము నప్పురాంతికమ్మున గట్టి
వాలువోలె విప్రవరుఁడువోలె
నట్టువొజ్జ వోలె వచ్చిన చెలివోలె
మలయుచుండు మందమారుతంబు

ఈ క్రింది పద్యాలు విజయసేనం లోనివిగా మానవల్లివారిచే కుమారసంభవం (ప్రథమభాగం) అనుబంధంలో ఉదాహరింపబడినవి.[14]

16. పల్లవపుష్పసంపదలఁ బంచి వసంతుఁడు కాపురాకకై
యెల్ల వనంబు సంకటము లేఁదగఁదా రొదికంబు మీఱ న
ట్లల్లన క్రోలి క్రోలి మలయానిలుఁ డందుఁ బరాగపత్రముల్
దుల్లఁగఁజేసె సత్క్రియఁ బటుత్వము కాముఁడు విచ్చలింపగన్

17. కలయంగ ధారుణీతల మగ్నిత ప్తమై
యుప్పరిపెన మట్టు లబ్ధియుండుఁ
గులపర్వతంబులు కొలిమిలోఁ గ్రాగిన
యినుపముద్దల క్రియ నెసఁగియుండ.

14. మానవల్లికవి – రచనలు(పీఠికలు) పుటలు 22,24.

# విరాటపర్వము

పర్వదేవుడు

---

[చూ:— ఆదిపురాణము]

1. వచ్చునె నాటకశాలకు
నిచ్చట నవినట్లు రాద యే పీగతి నా
పచ్చవి .... .... .... ....
. . త్త నెఱుఁగ విదె రాకుండన్[1]

2. ఇక్షురసాబ్ధి నీ రెట్టిదో యని మది
నూహించి యువ్విళులూరకుండ
విరసంపు ముదిమికిఁ బరిహారం బగు రసా
యనముమీదికిఁ జిత్త మరుగకుండఁ
దివిరి దేహమ్ము వేధించు సిద్ధరసంబు
కందువ యచ్చోటి కందకుండ
వాయువుఁ జిరతరస్థాయిగాఁ జేయు సు
ధారసంబున వేడ్క దగులకుండ

నఖిలజనులకుఁ బంకేరుహాసనుండు
నేర్చి యన్నింటి రుచు లొకఁగూర్చి తెచ్చి
సంచితంబులుగా సంగ్రహించె ననఁగ
భరితజలములై పురసరోవరము లొప్పు[2]

---

1. భం. గ్రం.159/7 కాకినాడ,118 పుట. 2. ఉదా.వ.

# విశ్వేశ్వరశతకము

విశ్వేశ్వరుడు

[విశ్వేశ్వరుడనే కవిత ఈ శతకకర్త అనీ, ఈతడు క్రి. శ. 1400 ప్రాంతానికి చెందినవాడనీ తెలుపుతూ నిడదవోలు వారి శతకంలోని ఒక పద్యాన్ని ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ఉదాహరించినారు1.]

1. లీలాలాలితసంపదల్ పయిపయిన్ లేకున్న లేకుండనీ
శ్రీలంగన్నుల కామినుల్ వశగతిం గాకున్నఁ గాకుండనీ
జాలిం బొందగనేల నెల్లరుచులన్ జాలించి నిన్నాత్మలో
నాలోకించు తలంపు నాకొసఁగు విశ్వానందవిశ్వేశ్వరా!

---

1. ఆంధ్రపత్రిక - జయసంవత్సరసంచిక (1954-55) 183 పుట.

# వీ థి నా ట క ము

శ్రీనాథుడు

---

[లాక్షణికులు శ్రీనాథుని వీథినాటకం లోనివిగా అనేక పద్యాలను ఉదాహరించినారు. క్రీడాభిరామం శ్రీనాథవిరచితమేనని, దానినే శ్రీనాథుని వీథినాటకమని వ్యవహరిస్తూ వచ్చినారని కొందరి అభిప్రాయం. ఏమైనా లక్షణగ్రంథాల్లో శ్రీనాథుని వీథినాటకం లోనివని ఉదాహరింపబడ్డ పద్యాలన్నీ మనకు క్రీడాభిరామంలో కనబడడంలేదు. కనుక లాక్షణికులు శ్రీనాథుని వీథి నాటకంలోనివని చెప్పుతూ ఉదాహరించిన పద్యాలన్నీ ఒక్కచోట కూర్చితే పరిశోధకులకుపకరిస్తుందనే దృష్టితో వాటినన్నింటిని దిగువ ఉదాహరిస్తున్నాము.

శ్రీనాథకవివిరచిత వీథినాటకము (శృంగార పద్యములు) అనే పేరుతో వావిళ్ళవారు ఒక చిన్న పుస్తకాన్ని ప్రకటించినారు. దానికి మూలమేమిటో తెలియదు.]

1. కుసుమం బద్దిన చీరకొంగు వొలయం గ్రొవ్వారుపాలిండ్లపైఁ
ద్రిసరంబు ల్వొలుపార వేణి యవటూదేశంబుపై రాయగాఁ
బస నెవ్వాడొ యొకండు రాత్రి రతులం బల్గాసి గావించిన
వ్వసివాళ్వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనం గంటిరే ॥

---

1. అ.క. III – 189; మ.పా. 69; అ.పా.వం. (కూ.శి.) II–276. కు.మ.రం. III - 242.

కందుకకేళి సల్పెడు ప్రకారమునం బురుషాయితక్రియా
కాండపకేళి సల్పెదు విధంబున కాపరభామ లేఁత నీ-
వెందఁ బ్రిహాళవేళ రచియించెను గుబ్బలమీది హారముల్
కుండలముల్గురుల్ గదల గోమయపిండములింటిముందటన్

3 వాహకుం డెక్కి విడిచిన వారువంపు
గొదమయుం బోలె రతికేళిమదము దిగ్గి
యలసభావంబుతోడఁ గర్ణాటవేశ్య -
వచ్చుచున్నది యదె విప్రవర్య కంటె.[3]

4. కోయిల పంచమస్వరముఁ గూర్చిన భంగినిఁ గంఠమెత్తి రా
మాయణ మాఱు కాండములు నచ్యుతజాగరవేళఁ బాడు నా
రాయవితంతురత్న మనురాగముతోడ 'నమశ్శివాయ శా
న్తాయ సమస్తదోషహరణాయ, సమానమె దాని కెవ్వరున్[4]

పై నాలుగుపద్యాలు క్రీడాభిరామంలో కనిపిస్తున్నాయి.

5. ఒచ్చెం బింతయు లేక హంసనడతో వొయ్యారముం జూపుచుం
బచ్చ ల్దాపిన కీల్కడెంపు నగతో బాగైన నెమ్మోముతో
నచ్చంబైన మడుంగుఁ గట్టి చెలితో నామాటలే చెప్పుచున్
వచ్చెం బో కుచకుంభము ల్గదలఁగా వామాక్షి దా నీళ్లకున్[5]

6. హా జలజాక్షి హా కిసలయాధరి హా హరిమధ్య హా శర
ద్రాజవిభాస్య హా సురతతంత్రకళానిధి యెందుఁ బోయితే
రాజమహేంద్రవీధి కవిరాజు ననుం గికురించి భర్గకం
ఠాజిరకాలకూట ఘటికామయమైన యమాసచీకటిన్.[6]

---

2. ఆ.క III—379 3. ఛం గ్రం. 159/7 ఆం సా వ.
4. ఛం గ్రం. 159/7 ఆం సా.ప. కాకినాడ 5. ల.సా వం.(కూ). I -66.
6. ల.వం. (R 235—తిరుపతి) 27 పుట; ల.వి. ( R. 1024 తిరుపతి)

పై రెండు పద్యాలు వావిళ్లవారి 'శ్రీనాథుని వీథినాటకం'లోనూ ఉన్నాయి.

7. తెలికల మించగిఁ దొకఁడు తియ్యని నూనెకు వంబికమ్మి కో
కల కొక సాలెవాడు పరుగందిన వెచ్చముఁ బెట్ట పైఁ ఖ్యఁడా
వులఁ బిదుకంగ గొల్లఁ దొక దొక్కిన దానికి రంగరంగ యీ
పడివెల ..........................పలురాతలఁ జేసిపెట్టరో[7]

8. వారక వారకామినుల వర్తులచారుకుచోపగూహముల్
గోరక కోరకోల్లసితకుంజములన్ జిగురాకు పానుపుల్
జేరక వారు కేరళకళింగకుళింగ నరేంద్ర మందిర
ద్వారవిహారులై చనవు లందక నందకపాణిఁ గొల్వరో[8]

పై పద్యం వేములవాడ భీమకవి రచితమని కవుల చరిత్రంవల్ల తెలుస్తు
న్నదని శ్రీ రావూరి దొరస్వామిశర్మగారు చెపుతున్నారు. (చూ:- అ.క.ఛా.ప్ర.
134 పుట)

9. చంద్రఖండములతో సరివచ్చు ననవచ్చు
విమలదంష్ట్రాప్రరోహములవానిఁ
బవడంపు గొనలతోఁ బ్రతివచ్చు ననవచ్చు
కుటిలకోమలజటాచ్ఛటలవాని
నింద్రనీలములతో నెనవచ్చు ననవచ్చు
కమనీయతరదేహకాంతివాని
నుడురాజరుచులతో నొఱవచ్చు ననవచ్చు
చంచన్మదాట్టహాసములవాని

7. ఛం. గ్రం. 159/7 ఆం.సా.ప. కాకినాడ

8. ల.సం. (R 235,తిరుపతి)27,28 పుటలు;ఛం.గ్రం,173/6ఆం.సా.ప.

సిగ్గుమాలిన మొలవానిఁ జిఱుతవాని
నెల్లకాలంబు మురికినా దేలువాని
నర్థి మోహూర నవతారమైనవాని
భైరవునిఁ గొల్వ వచ్చిరి భక్తవరులు.[1]

1. ప్ర.ర. (జ): జగ్గకవి ఈ పద్యాన్ని వల్లభరాయని వీథినాటకంలోనిదిగా ఉదాహరించినాడు.

# శత (కంధర) కంఠ రామాయణము

## భీమన

("ఆంధ్రకౌముది" అనే వ్యాకరణ గ్రంథంలో "భీమకవికృతే శత కంఠరామాయణే" అని ఉండడంవల్ల భీమకవి శతకంఠ రామాయణాన్ని రచించినట్లు తెలుస్తుంది. దీనికే శతకంధరరామాయణం అనే నామాంతరం ఉన్నది. ఇది ప్రస్తుతం అలభ్యం. ఇందులోని మూడు పద్యాలు మాత్రం లక్షణ గ్రంథాల వల్ల లభ్యమౌతున్నాయి.)

దవసీమన్ విహరింపు రామనరు సీతాదేవి సౌమిత్రులు
ద్దవిడిన్ బోవగ మింటనుండి దివిషద్వాదంబు వీక్షించి సం
స్తవముల్ సేసె[1] ..............................................

కలఁగకుఁడీ నభశ్చరులు కంపము జెందకు డెప్డుఁ గిన్నరుల్
దలఁకకుఁ డీశ్వరుల్ మునులు తత్తరమందకుఁడేన వచ్చి మీ
యలజడు లెల్లబాపి మిము నందఱఁ గాచెద నంతవట్టు మీ
గలిబిలి మాని యుండుఁడని కైటభమర్దనుఁ డోలిఁ బల్కినన్[2]

భువిఁ బట్టి పీఁచ మడఁచెను
దివిజారాతుల దినేశదీప్తు లదర రా
ఘవుఁ డనుచు మునులు పొగడిరి
దివిని దివౌకసులు మిగుల దీవించి రొగిన్

పై పద్యం భీమన శతకంధరరామాయణంలోనిదని ఒక లక్షణ గ్రంథంలో ఉదాహరింపబడినట్లుగ వీరేశలింగం పంతులుగారు పేర్కొన్నారు.[3]

1. ఆం.కౌ. 2. ఆం.కౌ. 3. ఆం క.చ. (1భా) 386 పుట.

# శతపక్షిసంవాదము

## క్షేమేంద్రుడు

(క్షేమేంద్రుడనేది లక్కాభట్టుకుగల బిరుదనామం. లక్షణ శిరోమణిలో ఉభయకవి లక్కాభట్టని పేర్కొనబడియుండడంవల్ల ఈతడు సంస్కృతాంధ్రాలలో కవియై ఉండినట్లుగ ఊహించవచ్చు. శతపక్షిసంవాదం, శూద్రకరాజ చరిత్రం, ముద్రామాత్యం ఈతని కృతులని మానవల్లి కవిగారు తెలిపియున్నారు.[1] కాని లక్షణ గ్రంథాల్లో శూద్రకరాజ చరిత్రం కవిభల్లటకృతంగా కనిపిస్తుంది. పై గ్రంథాల్లోని పద్యాలు వెల్లంకి తాతంభట్టు రచించిన కవిచింతామణిలో ఉదాహరింపబడినట్లుగ వీరేశలింగం పంతులుగారు ఆం.క.చ లో పేర్కొన్నారు.[2] కాని కవిచింతామణికర్త పై గ్రంథాల్లో ఏ ఒక్కదాని నుండి కూడా ఉదాహరణపద్యాలు గ్రహించినట్లుగా కానరాదు.

1. ఒకమతమున మధ్యానా
మికలను నిరుద్వేల సవ్యమిడి మతి యపస
వ్యకరముగ నిడఁ ద్రిపుంద్రము
ప్రకటమహాపాతకప్రపంచముఁ జెఱుచున్[3]

2. పిపీబంధము వీడు మోవి యదురున్ నేత్రంబు లల్లాడు చన్
గ్రేవల్ గానఁగవచ్చుఁ గ్రొమ్ముడి విరుల్ పృథ్వీస్థలిన్ జెందు స
ద్భావాగారము లోను చెమ్మగిలు చిత్తం బుత్తలం బొందు నా
నావిభ్రాంతులు పుట్టు నింతులకుఁ జెంత న్వింతవా రుండినన్[4]

---

1. సకలనీతిసమ్మత పీఠిక. 2. 106 పుట
3. ల.శి. iv -102; ఛం. గ్రం. 159/7 ఆం.సా.ప.
4. ల.శి. iv -348, ఛం.గ్రం. D 705 ఆం. వి.

3. పద్మాసమానయగు మన
పద్మావతిఁ జూచి ధరణిపాలసుతుండు
ద్యన్మోదంబునఁ దన ముఖ
పద్మము నలరించె ననుచుఁ బరిజనులలరన్[5]

4. అమలివాక్షరరూప యాద్యంతపకలలో
కైకసంస్తుత్య సురౌఘవంద్య
కమలాసనార్థితకాంతార్ధవరదేహ
కౌశిక ప్రియ రవికైరవాప్త
శిఖినేత్ర ............ శీల వ్రతస్థిత
శేఖరీకృత సురసింధుమథన
గురుమంత్రసుస్థిర గూఢపాద్భూషణ
గోపతిద్విజ ........ గోత్రపీల

భృగువసిష్ఠాదిమునిప మనోభీష్టఫలద
ఋగ్యజుస్సామనుతపద....భక్త
సమితి రక్షింపుమనియెడి సంజ్ఞలెల్ల
కూడఁ జెప్పిన యీ .... గుణము మైత్రి[6]

---

5. ల శ iv 413:
6. ఆం. ప్ర.ర 306: క.వా: ల. పా. సం. (R 235)

# శమంతకమణిచరిత్ర

వణుకూరి గుర్వరాజు

[ఈ కావ్యంలోని ఒకేఒక పద్యం లభించింది. వణుకూరి గుర్వరాజు ఈ కావ్యకర్త. ఈ పద్యం కావ్యావతారికలోనిదై ఉంటుంది. ఇందులోని సీతాయి అనే పదప్రయోగాన్ని బట్టి ఈ కవి అర్వాచీనుడని ఊహించవచ్చు. ఇంతకంటే ఈ కవి వివరాలు తెలియవు.]

కాయవచోమనఃస్ఖలనకల్పితదోషము లెల్లఁ బాయగా
నా యెదలోన నిత్యము సనాతనధర్మముఁ బూని యర్మిలిన్
బాయక కొల్తు రామనరపాలు నిరంతరసౌఖ్యదాయి సీ
తాయి సమస్తశోభనవిధాయి మహాఫలసిద్ధిదాయిగన్[1]

1 అక iii –287: మ. మ. రం. iii–54

# శశిబిందుచరిత్రము

## చరిగొండ నృసింహకవి

[శశిబిందుచరిత్రం చరిగొండ నృసింహకృతమని ఆంధ్రప్రయోగ రత్నాకరంవల్ల తెలుస్తుంది: అప్పకవి ఉదాహరించిన మూడు పద్యాలు, గణపవరపు వేంకటకవి ఉదాహరించిన రెండు పద్యాలు (అసంపూర్ణాలు) - మొత్తం ఈ కావ్యంలోనివి ఐదు పద్యాలు మాత్రం లభ్యమౌతున్నాయి. శశిబిందువనే రాజు చరిత్ర ఈ కావ్యంలోని వర్ణ్యాంశం—నృసింహకవి ఈ కావ్యంలో శృంగారరసాన్ని అతివేలంగా వర్ణించి ఉంటాడనడానికి అతని 'పయ్యెదఁ బాపి' అనే పద్యం ఉదాహరణం.

నిడదవోలువారు ఈ కావ్యాన్ని చరిగొండ ధర్మనకృతంగా పేర్కొన్నారు[1]. ఆధారమేమిటో తెలియదు.

ఈ కావ్యం మహబూబ్ నగర్ జిల్లాకు చెందిన 'కాటికాయల' అనే గ్రామంలో ఒక వర్తకుని దగ్గర ఉన్నట్లు గోలకొండకవుల సంచిక తెలియజేస్తుంది.[2]

నాకౌకసు లైనను నీ
ధాకకు నిల్చెదరె కటకటా మము బోంట్లం
జేకావి సంరక్షింపక
నీ కిటు లుచితంబె యురవణింప నరేంద్రా.[3]

---

1. సకలనీతిసమ్మతం పీఠిక 64 పుట
2. 401పుట. 3. అ.క. II -145

2. పయ్యెదఁ బాపి గుబ్బలను బాహులఁ బట్టగ విచ్చి మోవిపైఁ
దియ్యని మోవియు న్మనసు దీరగఁ గ్రోలగ విచ్చి యిప్పుడో
తొయ్యలి నీవి ముట్టిననుఁ ద్రోచెద వేనుగు విచ్చి యంకుశం
బియ్యక కయ్య మాడఁదగునే నను నీగతి నేచఁ బాడియే.[4]

3. నూపుంబువ్వను సంపెఁగ
పూవు గెలిచి బిరుదుముత్తెపుంజల్లి దగన్
దా వైచె ననఁగ ముంగర
తో వనరుహనేత్ర నాస తుల లే కొప్పున్.[5]

4. నాస్తికుండు దురాత్ముఁ డవివేకి కొండీడు
పాషండుఁ డన్యా .... పరుఁడు[6]

5. నీకు పరిపాటి గలరె మనీషిచంద్ర
యనుచు బెల్లించి చేఁ గల్గువంత లాగి[7]

---

4. అ.క. ii– 227: సు.మ.రం. iii–360
5. అ.క. ii – 264
6. అం.ప్ర.ర. 376పు
7. అం.ప్ర.ర.

# శివదేవధీమణీశతకము

శివదేవయ్య

---

[శివదేవయ్య ఈ శతకకర్త. ఈతడు ఓరుగంటిని పరిపాలించిన గణపతిదేవునికీ, రుద్రమదేవికీ మంత్రిత్వం నెరపినవాడు. తిక్కనకు సమకాలికుడు. గణపతిదేవుని దీక్షాగురువైన విశ్వేశ్వరదీక్షితు లితడే యని చిలుకూరి వీరభద్రరావుగారి అభిప్రాయం. ఆంధ్రకవితాపితామహుడన్న బిరుదాన్ని పొందిన వాళ్లలో ఈయన మొదటివాడట. ఈతని శతకంలోనివి రెండే రెండు పద్యాలు ప్రస్తుతానికి లభ్యమౌతున్నాయి.[1]]

1. అరయఁగఁ బిన్ననాట సిరియాళుఁడనై యెలఁ బ్రాయమందు సుం
దరుఁ డను నంబినై పదను దప్పిన గుండయగారి చందమై
ధరఁ జరియింపఁ గల్గిన తథాఽస్తు వృథాపరిపాకరూపదు
ష్కరజననం బిదేమిటికిఁ గాలుపనే శివదేవధీమణీ !

2. ప్రాణ నపానుఁ గూర్చి యల పాముఁగదల్చి తదూర్ధ్వకీలితో
ద్యాణము నొత్తి మేను దృఢమై నిగుడం బిగియించి దృష్టులం
ఘోణము జేర్చి యా ప్రణవఘోషణమున్ విని యందు మానస
క్షీణము సేసినం బవనసిద్ధుఁ డనా శివదేవధీమణీ![3]

---

1. శ.క.చ. (అనుబంధం) 728 పుట
2. శ.క.చ 73, పుట. ఛం.గ్రం. M NO. 32h, D. No 705. 493 పుట.
3. శ.క.చ. (అనుబంధం) 727 పుట.

# శుద్ధాంధ్రరామాయణము

## అడిదము బాలభాస్కరుడు

---

[అడిదం బాలభాస్కరకవి ఈ అచ్చ తెనుగు రామాయణకర్త. ఈతని కుమారుడైన అడిదం సూరన ''ఇది శ్రీమదశేషమనీషి హృదయంగమ మృదుపదనీరంధ్రశుద్ధాంధ్రరామాయణ ఘటనా వైదుషీ ధురంధరాడిదము బాల భాస్కరతనూభవ....'' అనే తన క.వం.వి' గద్యలో తన తండ్రి అడిదం బాలభాస్కరకవి శుద్ధాంధ్ర రామాయణం వ్రాసినాడనే విషయాన్నే కాక ఆ రామాయణం అశేషమనీషిహృదయంగమమనీ, మృదుపద నీరంధ్రమనీ తద్వైశిష్ట్యాన్ని ప్రశంసించినాడు. ఐతే ఈ కావ్యం మనకు లభ్యం కాలేదు. సూరన క.వం.వి. వల్ల ఇందులోని ఒక్క పద్యపాదం మాత్రం తెలియవస్తుంది.]

1. నిగిడిరువైపుల న్వేదల నేటయి నీటగు పీటికోట[1] .

---

1. క.వం.వి. i -22.

# శూద్రకరాజచరిత్రము

## కవిభల్లటుడు

---

[నిడదవోలువారు కవిభల్లటుని శూద్రకచరిత్రంలోనిదంటూ క్రింది పద్యాన్ని తమ తెనుగుకవులచరిత్రలో పేర్కొన్నారు. ఈ పద్యంలో శూద్రకుని పేరు కనిపిస్తుంది కనుక ఇది శూద్రక చరిత్రంలోనిదే అని చెప్పవచ్చు. కాని ఆ.రం.ఛం.లో మాత్రం ఈ పద్యం బ్రహ్మాండ పురాణంలోనిదిగా పేర్కొనబడింది.[2] క్షేమేంద్రుడు కూడా ఒక శూద్రకరాజ చరిత్రము వ్రాసినట్లుగా తెలుస్తుంది.]

1. సమదేభారి మసంగి పై నుఱికినన్ శంకించి భూపాలుఁ డో
లము గన్నం గని దాని శూద్రకుఁడు లీలం ద్రుంచె నే నప్పుడ
త్యమలోద్యత్ప్రసవార్థినై కుసుమగ్రంథఘ్రాణలుబ్ధభ్రమ
ద్భ్రమరభ్రాజితపాటలీవిటపమధ్యస్థుండనై చూచితిన్.[3]

ఈ పద్యభావమే ఉన్న మరోపద్యం ఒకానొక ఛందోగ్రంథంలో[4] క్షేమేంద్రుని పద్యంగా పేర్కొనబడింది. ఆ పద్యంలోనూ శూద్రకుని ప్రవక్తి కనిపిస్తుంది. కనుక క్షేమేంద్రుడు కూడా శూద్రకరాజు చరిత్రము చెప్పినట్లుగా భావించవచ్చు. క్షేమేంద్రుని పద్యం చూడండి.

అతిరౌద్రాకృతి(గెల్వ)సంగిన మదేభారాతిపై దాటినం
బతి వంచించిన దాని శూద్రకుఁ డెదన్ ఖండించె నే నప్పుడా
తతసూనగ్రహణగ్రహగ్రసనచేతస్కుండనై పాటల
క్షితిజాభ్రంకషకోట్యదభ్రవిటపాసీనుండనై చూచితిన్

---

1. 307 పుట; 2. '' –381; 3 ఛం.గ్రం. D 705(ఆం.వి. )51b పుట.
4. అందే 41 b పుట

# శేషభాగవతము

[అం.కా. లో శేషభాగవతంలోవిదిగా ఒక పద్యం ఉదాహరింపబడింది. ఇందులోనే చిత్రశేషభాగవతంలోవిదిగా మరో పద్యం కవిపిస్తుంది. ఈ రెండు భాగవతాలూ ఒక్కటేనో. వేర్వేరో చెప్పలేము. వీటి కర్తలెవ్వరో కూడా తెలియదు.]

1. హరి సర్వత్రి మెలంగుచున్ భువి సముద్యత్ఖడ్గధారన్ సదా
సురవిద్వేషులఁ దుౙింప నేటికి వినన్ జోద్యంబు నా కయ్యెడిన్
పరమానందరసై కకందకరుణాపాథోవిధీ సంయమీ
శ్వరకౌటిల్యమునున్ వినా ఘనమనీషన్ నీ వెఱింగింపవే.[1]

1. అం.కా.

# శ్రీకృష్ణవిలాసము

వెన్నెలకంటి వెంకటాచలం

---

[‘కవిత పుట్టిల్లు వెన్నెలకంటి యిల్లు’ అన్న ప్రఖ్యాతిని పొందిన వెన్నెలకంటి వంశంలో జన్మించిన వేంకటాచలకవి శ్రీకృష్ణ విలాసకర్త. క్రీ.శ. 1600 ప్రాంతానికి చెందినవాడు. ఈతని శ్రీకృష్ణవిలాసకావ్యం లభ్యం కాలేదు. గురజాడ శ్రీరామమూర్తిగారు ఈ కావ్యంలోనుండి 14 పద్యాలను తమ ‘కవిజీవితము’లలో ఉదాహరించినారు. మానవల్లివారు మరో రెండు పద్యాలను పేర్కొన్నారు. మొత్తంమీద ఈ కావ్యంలోని 16 పద్యాలు లభ్యమైనాయి. వీటివల్ల వెన్నెలకంటివారి వంశావళితో పాటు ఎన్నో చారిత్రికాంశాలు కూడా తెలుస్తున్నాయి.]

1. కాళిదాసునిఁ దిక్కనకవి నన్నపార్యుని
        భారవి భవభూతి పాండుసుకవి
    మల్హణు బిల్హణు మాఘు మయూరుని
        చోరుని నాచన సోము భీము
    పింగళి సూరన్న పెద్దనామాత్యుని
        పొలుపొంద బమ్మెరపోతరాజు
    వంచేటి రంగన్న భాస్కరమంత్రిని
        వెల్లంకి తాతప్ప మల్లుభట్టు

మహిమ మీఱంగ నాస్థానమండపముల
సకలరాజులచేతను సన్నుతింపఁ
బడిన సుకవుల నందఱఁ బ్రస్తుతింతు
వింపు మీఱంగఁ గృతి రచియింపఁ బూని

2. విక్రమార్కచరిత వేడ్కతో నందిన
సిద్ధిరాజు జగత్ప్రసిద్ధిరాజు
అతని పెదతండ్రి యైన సూరపరాజు
పరమశైవశాస్త్రపారగుండు.

3 సురుచిరసద్గుణాఢ్యుఁ డగు సూరసుధీమణిసంభవుండు శ్రీ
హరిపదసేవకుం డమరనార్యుఁడు పుత్రులఁ గాంచె మువ్వురన్
స్థిరతరసత్కవిత్వశుభశీలుఁడు సూరపమంత్రి చంద్రశే
ఖరబుధవర్య ధీవినయకర్ముఁడు తిర్మలమంత్రిసత్తమున్

4. వీరలు మువ్వురలోపల
సూరప విఖ్యాతయశుఁడు సుకవిస్తుతుఁడై
యారయ విష్ణుపురాణము
ధీరతఁ దెనిగించె నధికతేజ మెలర్పన్

5 సూరప కాంతిచే సూర్యప్రకాశుండు
వేదాది విద్యల వెలసినాడు
విష్ణుపురాణంబు వేడుకఁ దెనిగించి
విమలయశంబున వెలసినాడు
రావూరి బసవన్న రమణతో నిచ్చిన
యల మొగుళ్లూ రగ్రహార మొందె
వెలుగోటి తిమ్మభూవిభునిఁ జేకొనియెఁ దా
నాందోళికాఛత్ర మగు పదవిని

కవిత పుట్టిల్లు వెన్నెలకంటి యిల్లు
ననెడి పౌరుషనామధేయంబు నిలిపె
సరసగుణములు గలిగిన సాధుసుకవి
మాననీయుఁడు సూరనామాత్యవరుఁడు.

6. పరఁగ గ్రద్దలూరు బాలజ్యోత్స్యులు వేఁడఁ
జంద్రశేఖరయ్య జగతిలోన
దత్తవృత్తిఁ గొనియెఁ దగఁ బ్రసిద్ధికి నెక్కె
మొదలిపేర నతఁడు బొదలుచుండె.

7. ఘనులు నేగురిలోపల గంగరాజు
అతని పుత్రుఁడు వెంగన యనెడువాఁడు
సరసుఁ డై నట్టి వేజెళ్ల సర్వఘనుని
మంత్రియై యొప్పె రాజసన్మానమునను.

8. వేజెళ్ల సర్రాజు విభవాధిపత్యంబు
పూనిన సర్వజ్ఞపుణ్యమూర్తి
పొలుపొంద నా కృష్ణభూపాలు బాలుని
దొరఁ జేసికొని కార్య మరసి నడపె
శ్రీ రంగరాయలచే నొప్పుఁ గొని తెచ్చి
పంచసన్నెల దాలు పరఁగఁ జేసి
కొండవీటి సరద్దు గుడ్లూరి దనుకను
నేలించె కృష్ణభూపాలు నెమ్మి

సకలప్రజ్ఞానదక్షుఁడై జనులఁ బ్రోచె
రాజసన్మానములచేతఁ దేజ మలరె
బంధుజనముల సకలసంపదలఁ దనిపె
మహితయశుఁ డగు వెంగయమంత్రి యపుడు.

9. రంగప్ప రూపసంపద
రంగప్పడు బుద్ధి సమరరాట్ప్రతిముండౌ
సంగరవిజయుఁ డుదారుఁడు
రంగుగ నా గోలకొండరాజులు మెచ్చన్

10. రామన్న మర్యాద రామన్న వేజెళ్ల
నారాయణేంద్రుండు గారవమునఁ
జను లీయ నాయన సంస్థాన కర్తయై
పాలించుఁ బ్రజల సంపదలఁ బొదల
గోలకొండ వజీర్ల గూఁడి దుర్గాలపై
ముత్తిక హత్తించి మొత్తి మొత్తి
కదు మన్నె సర్దార్ల వడి చెదగాఁ గొట్టి
రాజుల మెచ్చులు రమణ నందె

పొదిలి లింగప్పతోఁ గూడి భూములెల్లఁ
గొట్టి విప్రుల కన్నంబుఁ బెట్టి మించె
కలియుగంబున వెన్నెల కంటి రామ
మంత్రికివి పీడు లే రవి మహికి నెక్కె

11. పరఁగ వేజెళ్ల కృష్ణభూపాలు కరుణ
కరణ మన నేర్పు మీఱంగ ధరణిప్రజల
వరసి పాలించి శుభముల నలవరించి
మించి బంధులఁ జాలఁ బోషించె నెలమి.

12. ములుగు గురులింగమూర్తికిఁ
బొలుపుగ శిష్యుండ నభవు పూజాపరుఁడై
యెలమి నష్టాంగయోగము
లలవడి తన్మయత నొంది యానందించున్

13. యమనియమాదియోగము లహర్నిశముల్ సలుపంగఁ గొంత చి
త్తము విమలత్వ మొంది వితతస్ఫురితేంద్రియజాలభీషణ
క్రమ మడగంగఁ బూర్వఘనకల్మష దూరత చేయనంత త
త్త్వముమది నాటగా దనదు భావమునన్ గనియెన్ సదాశివున్

14. అట్టి నను( గూర్చి జలదంకిపట్టణమున
నున్న జానకి రామేశుఁడో య్యనొయ్యఁ
బలికె నీ చేత నుడువగాఁ బడిన కృతికి
నన్ను నధినాథుఁ జేయు మటన్న నలరి.

పై పద్నాలుగు పద్యాలు గురుజాడ శ్రీరామమూర్తిగారి కవిజీవితముల నుండి గ్రహింపబడ్డవి [1]

15. ఆకాశనది యని యనిమిషాంగన లెల్ల
వేడుకతో జలక్రీడ సలుపఁ
బాలమున్నీ రని పంకజనాభుండు
ఫణిశయ్యఁ గావించి పవ్వళింపఁ
బాదరసం బని మోదించి సిద్ధులు
మించి ఘటంబుల నించుకొనఁగ
యమృతపుసోనని యఖిలామరశ్రేణి
చెలఁగి పానంబులు నేయుచుండ

1. 681-694 పుటలు

వెల్లి విరియుచు నుబ్బుచు విశదకాంతి
బొదలుచును దివ్య మగుచును భూరిమహిమ
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్చవెన్నెల విమలమై పెచ్చు పెరిగె.

16. నిజరూపరేఖల నెలఁతల వలపించు
చాతురి గల భద్రజాతివిటుల
వలసిన ధనము నవ్వారిగా నొసగుచుఁ
దరుణులఁ గరగించు దత్తవిటుల
మణిమంత్రములచేత నణుమధ్యల గరంచు
మగటిమి గల కూచిమారవిటుల
వలరాజుకళ లందు నెలవులు భేదించి
నతులఁ దేలించు పాంచాలవిటుల

వరుస నందఱు దమ జాతివారి వారి
జాతవదనలఁ గూడి సంజాతమదన
కదనకేళివిహారసంపదలఁ బొదలి
మెదలుదురు వీట నధికసమ్మదము బొదవ

పై రెండు పద్యాలు శ్రీకృష్ణవిలాసంలోనివిగా మానవల్లివారిచే ఉదాహరింపబడినవి [2]

"ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధ శంకరభవనానంద ములగు గురులింగార్యపాదారవిందధ్యానపరాయణ హరితసగోత్ర సుజనవిధేయ జగ్గనామాత్య పుత్ర వెన్నెలకంటి వేంకటాచలనామధేయప్రణీతంబైన కృష్ణవిలాసంబను మహాప్రబంధంబునందు....ఆశ్వాసము"

"పై ఆశ్వాసాంతగద్యం కూడా గురజాడవారి కవిజీవితము'ల నుండే గ్రహింపబడింది[3]

---

2 కుమారసంభవప్రథమభాగానుబంధం. 3. 681 పుట.

# సత్యావధూప్రణయము

## అల్లసాని పెద్దన

[లక్షణశిరోమణి అనే ఒక్క లక్షణగ్రంథం మాత్రమే ఈ కావ్యాన్ని పేర్కొన్నది. శ్రీకృష్ణుడు సత్యావధువుతో గావించిన ప్రణయవర్ణన ఇందులో వర్ణ్యాంశం కావచ్చు. ఈ కావ్యంలోని ఒకేఒక పద్యం లభిస్తుంది. అది గ్రంథారంభంలోనిది. ఆంజనేయుని స్తుతి ఈ పద్యంలోని విషయం.]

1. కనువిందై యభిషిక్తుఁడైన విభు నాజ్ఞం గొల్వులో సీత యి
చ్చిన ముక్తామణిహార మెవ్వడు ధరించెన్ మేరుకూటంబుఁ జు
ట్టిన మిన్నే అనఁగా మెడన్ బెడఁగుఁ బుట్టింపంగ నయ్యాంజనే
యు నజేయున్ గరుణావిధేయు నిరపాయుంగొల్తు వాంఛాప్తిన్.

---

1. ల.శి IV - 67

# సునందనచరిత్ర

## శ్రీనాథుడు

[ శ్రీనాథుడు నందనందనచరిత్రము రచించినట్లుగ ఆంధ్రకవిసప్తశతి పేర్కొంటుంది. కాని లక్షణగ్రంథాలు శ్రీనాథుని సునందనచరిత్ర అనీ, నందనచరిత్ర అనీ పేర్కొన్నాయి[2]. కాని నందనందనచరిత్ర అని మాత్రం పేర్కొన్నట్లుగ కానరాదు. రంగరాట్ఛందఃకర్త ఒకచోట శ్రీనాథుని సునందన చరిత్ర అనీ, మరోచోట శ్రీనాథుని నందనచరిత్ర అనీ పేర్కొన్నాడు[3]. మొత్తంమీద శ్రీనాథుని ఈ గ్రంథాన్ని పేర్కొనడంలో లక్షణకర్తలో, లేఖకులో పొరబడ్డారనే చెప్పవలసి ఉంటుంది.]

1. శాశ్వతవిశ్వవిశ్వంభరాచక్ర మీ
   రాజకుమారుఁ డేలంగఁగలఁడు.[4]

2. రామానుజుండు నిరంతరము పదాఱు
   వేల నూటెనమండ్రు వెలఁదు లతని.[5]

3. అనవరతమును లోభత్వమున మెలంగు
   నాస్తికున కెన్న కీర్తి యెందైన గలదె[6]

1. 275 పుట. 2. సునందనచరిత్రము పేర్కొన్న లక్షణగ్రంథాలు.
అ. న. ల. సా. (R 552 తిరుపతి) అ. అ.ర.ం ఛం. iii - 274.
నందనచరిత్రము పేర్కొన్న లక్షణగ్రంథం. 1. ఆం. ప్ర.ర.

సునందనచరిత్ర iii - 274; నందనచరిత్ర. iii - 342.

సు. మ. రం. ii - 277; అ. రం. ఛం. iii - 274; న. ల. సా. (R 552 తిరుపతి) 28 పుట.

సు. మ. రం. ఈ పద్యాన్ని మరుత్తచరిత్రలోనిదిగా పేర్కొన్నది.

అ. రం. ఛం. iii – 342; ఆం. ప్ర. ర. 135 పుట

ఆం. ప్ర. ర. 370 పుట. ఇందు నందన చరిత్ర అని ఉన్నది.

# సునందనోపాఖ్యానము

హుళక్కి భాస్కరుడు

---

[ ఈ కావ్యంలో పద్యాలు ఆం. ప్ర. ర. లోనూ, ఆ. రం. ఛం. లోనూ ఉదాహరింపబడ్డవి. దీని కర్త హుళక్కి భాస్కరుడని ఆంధ్రప్రయోగ రత్నాకరం వల్ల తెలుస్తుంది. భాస్కరరామాయణకర్తల్లో ఒకడుగా హుళక్కి భాస్కరుడు ప్రసిద్ధుడే. ఐతే ఇతడు సునందనోపాఖ్యాన కావ్యాన్ని రచించినట్లుగ తెలియజేసే ఇతరాధారాలేవీ కానరావు. ఇతడు 'దశగతు'లనే గ్రంథాన్నికూడా అనువదించినట్లుగ మెదేపల్లివారు[1], మానవల్లివారు[2], చిలుకూరి వీరభద్రరావు గారు[3] తెలుపుతున్నారు.

అలబ్ధమైన ఈతని సునందనోపాఖ్యానంలోని ఆరు పద్యాలు మాత్రమే (వీటిలో కొన్ని అసంపూర్ణాలు) లభ్యమౌతున్నాయి. ]

1. భూతలపతి మదిలోపల
సీతము చాలించి యమ్మెయిన్ విప్రగురు
వ్రాతముల ధనము లంతయు
నాతతదుర్మతి హరించి యలమట విడియెన్[4]

2. ఇప్పుడేను దలంచిన యభీష్టమెల్ల
చేకుర నొనర్చి నీవు రక్షింపవయ్య[5]

---

1. భాస్కరరామాయణ పీఠిక.
2. క్రీడాభిరామపీఠిక, మానవల్లికవి – రచనలు – పుట 67.
3. ఆంధ్రుల చరిత్ర.
4. ఆం. ప్ర. ర. 148 పు; ఆ. రం. ఛం. iii – 347.
5. ఆం. ప్ర. ర; ఆ. రం. ఛం. iii –352;

6. స్నాతయగు సతిగూడు వర్తనము మాని
యన్యసతిఁ గూడువాఁడు సామాన్యుఁ డంద్రు[6]

7. అంజెలమిడి నడుపులు బెద
రుంజూపులు కప్పు నెఱిగురుల్ సిబ్బపులుటు
బ్బుం జనుగుబ్బలు గల చెం
చుంజవరాలిఁ దిలకించి చొక్కె నృపాలుర్[7]

8. కృష్ణుఁడు వచ్చినంత మునిబృందము డెందము లుల్లసిల్లగా
జిష్ణునిఁ గూడి[8]

9. నిఖిలజనములు గనుఁగొన నీ బలంబు[9]

---

6. అం.ప్ర.ర. 40 ౨ పు.
7. అం.ప్ర.ర.
8. అ.ప్ర.ర. 46 ౨ పు.
9. అం. ప్ర. ర. 14 ౨ పు: అ. రం. ఛం. iii — 848

# స్మరతత్త్వసారము

[ ఈ గ్రంథాన్ని రచించిన కవి ఎవ్వరో తెలియదు. ఇందులోని ఒకే ఒక పద్యం ఒకానొక ఛందోగ్రంథంలో[1] ఉదాహరింపబడింది.]

1. మలయసమీరు వేడియును మావుల వేదియు రాజకీరకో
కిలముల వేఁడియున్ మకరకేతను వేదియు మాన్పవేడియున్
మ్మలయ సమీరు వేఁడియును మావుల వేఁడియు రాజ కీరకో
కిలముల వేఁడియున్ మకరకేతను వేఁడియు మ్రొక్కిరంగనల్

1. ఛం. గ్రం. D. No. 705 (అం.వి) 67b పుట.

# హరవిలాసము

ఠీమన

[ అలబ్ధమైన ఈ కావ్యంలోని రెండు పద్యాలు మాత్రమే ఆ.రం.ఛం. వల్ల తెలియవస్తున్నాయి.]

1. ఎంతయును దుస్తరంబు దు
రంతరసంసారవారిరాశి యది వెసన్
గంతుకొను మానవుం డొక
యింత శివస్మరణ చేసి యేచిన భక్తిన్[1]

2. భువిలో మిత్రుండగు వాఁ
డవిరతమును వేఱు లేక యాత్మీయమహో
త్సవముఖకృత్యంబులవ
ద్యవసాయం బెఱుకపఱుపఁదగు సంప్రీతిన్[2]

---

1. ఆ. రం. ఛం.- iii – 344; ఛం. గ్రం. D 705. పు. 50b
2. ఆ.రం.ఛం.- III-346

# హరికథాసారము

అల్లసాని పెద్దన

---

[ఆంధ్రప్రబంధకవుల్లో అగ్రస్థానాన్ని అలంకరించిన అల్లసాని పెద్దన పేరు చెప్పగానే మనకు జ్ఞాపకం వచ్చే ప్రబంధం మనుచరిత్రం. పెద్దన వ్రాసిన ప్రబంధం ఇదొక్కటేనా అంటే కాదు. సకలకథాసారసంగ్రహం, సత్యావధూ ప్రణయం, హరికథాసారం అనే ప్రబంధాలు కూడా పెద్దన రచించినట్లుగ లక్షణగ్రంథాలవల్ల తెలుస్తుంది. సకల కథాసారసంగ్రహం, సత్యావధూ ప్రణయం – వీటిలో ఒక్కొక్క పద్యమూ, హరికథాసారంలో పద్నాలుగు పద్యాలూ లక్షణగ్రంథాల్లో ఉదాహృతాలై ఉన్నాయి. వటపత్రశాయిగా పవ్వళించిననాటినుంచి బలరామావతారంలో ప్రలంబాసురుని సంహరించేదాకా హరికథలన్నీ హరికథాసారంలో ఉన్నట్లుగా భావించవచ్చుని ఆరుద్రగారు తెలుపుతున్నారు.[1] ]

1. శయధృతఫణివలయ భవా
వ్యయరహిత విశుద్ధసంవిధాత్మక మాయా
మయ నానావిధలీలో
దయ సదయకటాక్ష శైలతనయాధ్యక్షా[2] ।

2. అఖిలహరికాంక్షితాశ్రీయపర్ణశా
లోపకంఠమునకు లోకభర్త
చేర నేగి యచట వారువంబును డిగ్గి
యధివసించి యుండునట్టి యెడను.[3]

---

1. స.ఆం సా॰ VII సం. 178పుట;
2. ఆ.రం.చం. III -338; అ.ప్ర.ర. 13 పు.

3. బాలరసాలకిసాలము
గ్రోలుచుఁ బలికెడి పికంబు కో యనఁ జాలా
జాలిపడి యాన యతిమధు
రాలాపము లనియె నాదరణమున వినఁగన్[4]

4. అంబరము వగుల నార్చి ప్ర
లంబాసురుఁ డాగ్రహము వెలయఁ గదిరినవే
ళం బలరాముఁడు చేముస
లంబున వాని తలఁ ద్రుంచె లా వమరంగన్[5]

5. గంధయుతవాక్యవిలస
ద్గ్రంథనవ యంధ్రకవితాపితామహ మాపై
గ్రంథము ఘటింపు మని శ్రీ
గంధము కపురపువిడెము కరుణ నొసంగెన్[6]

6. ఆ దేవోత్తముఁడు సుధాం
భోధి వటైకాగ్రిమదళమున బాలుండై
చేదోయిచేత దక్షిణ
పాదముఁగొని నోటఁ జేర్చెఁ బకపక నగుచున్[7]

7. ఆ త్రినేత్రుఁడు వనజాతదళాక్షుని
గూర్చి తపముఁ గైకొనిన చోటు[8]

---

3. అ.రం.ఛం. iii - 351. అ.ప్ర.ర. 14a పు; 4 అ.రం ఛం iii-356 అం.ప్ర.ర. 14 b పు.
5. అ. రం. ఛం. III -42; వ. ల. సం. 36పు; అం.ప్ర.ర. 16a పు.
6. అం. ప్ర. ర. 21b పు; సు. మ. రం. I 253; అ. రం. ఛం. III 66; అం. ప్ర. ర. 22a పు.
8. అం. ప్ర. ర. 23a పు; అ. రం. ఛం. III -73.

8. వసుదేశ్వర వినుము ప్రచే
తసుఁడు వ్యాసుల కతండు తన తనయుండై
సీకుకుల కర్తాపసమణి
వసిష్ఠునకుఁదెలిపె నతఁడు వరతంతునకున్[9]

9. కుందాత్మ చలింప కదికొనె
యెదుదల దొర యెదు రేగుఁదెంచె[10]

10. అతం డక్కడ సుకృత
స్నాతుండై యేగుదే పథమ్మనను మహా
ఘాత మొకటి యెదుట నిలువ
భీతుగ వన దానిఁ జూచి పేర్కొని పలికెన్[11]

11. శఠకోపయతికి ఖలతరు
కుఠారరూపమతికి శఠగురుమతహృత్క
ర్మఠవిరతికిఁ జతురాగమ
పఠనాయతవియతికి యజపాధికకృతికన్[12]

12. సప్తాశ్వక్షితిపాలక
క్లప్తి యగు దశావతారలీల లడిగితే
గుప్తమ్ముగఁ దెలిపెద నని
.. ప్తద వినవలయు ననిన నతఁ డిట్లనియెన్[13]

---

9 అం. ప్ర. ర. 276; 10. అం.ప్ర.ర. 11. అం.ప్ర.ర.
12. అ. రం. ఛం. III–317; అం. ప్ర. ర;
13 అం. ప్ర. ర.

13. తెంపరియై మదియింత చ
లింపక యనిలోనఁ దెగియె నెవ్వఁడతఁడు నై
లింపసభ నుండు నమఁడు బ
దంపడి యార్యులు వచింపఁ దా విట్లనియెన్[14]

14. ఏపునఁ గృష్ణరాయజగతీశ్వరుఖడ్గము మింట మార్గముం
జూపిన భానుమండలము దొంచి హుటాహుటి శత్రు లేగుచో
రేపటి దాపనయ్యె పగలింటి మహోగ్రపుజంగ మయ్యె యో
మాపటిదాపరయ్యె మము మన్ననసేయు మటందురెంతయున్[15]

15. రాజులు నమ్మతిం దరతరంబుల ప్రాతల భక్తియుక్తులన్
రాజితశస్త్రపాణుల పరాక్రమవంతుల నప్రమత్తులన్
భోజనపేయవస్త్రపరిపుష్టులఁ దుష్టుల నైన వారిగా
వోజ..............నొద్దన పాయకయుందు భృత్యులన్[16]

---

14 ఆ. రం. ఛం. III –166, వ. ల. వం. 20b పుట

15 వ. ల. వం. (ఉ.వెం.)

16 ఛం. గ్రం.159/7 కాకివాడ

# హరిలీలావిలాసము

## తెనాలి రామలింగయ్య

[రామలింగకవికృతంగా మనకు పూర్తిగా లభ్యమౌతున్న కావ్యాలు ఉద్భటారాధ్యచరిత్రం, ఘటికాచలమాహాత్మ్యం, పాండురంగమాహాత్మ్యం. ఈ మూడు మాత్రమే. కందర్పకేతువిలాసం, హరిలీలావిలాసం,—ఈ రెండూ రామలింగకవికృతులే అని సంకలనగ్రంథాలవల్ల[1] తెలుస్తుంది. జగ్గకవి ప్రబంధరత్నాకరంలో హరిలీలావిలాసంలోనివని ఇరవై ఒక్క పద్యాలను ఉదాహరించినాడు. ఈ పద్యాలు నగరం, సూర్యోదయం, సూర్యాస్తమయం, పుష్పలావికలు, మొదలైన విషయాలను వర్ణించేవి.]

పురవర్ణన

1. వినుతమాణిక్యవందనమాలికా
కాండకల్పితరోహితాకారరేఖ
జాలకానననిర్యదాలోలవాసనా
గరుధూపపోషితకంధరాళి
చంద్రశాలాతిగర్జన్మృదంగధ్వాన
విరచితపరిఘోష విభవలహరి
సంభోగసంరంభసమయవిచ్ఛిన్నము
క్తాహారమణికృతకరకవికర
మదదమదభారమంథరమత్తకాశి
నీదృగంచలసంచితనిబిడచంచ
లాలతాతల్లజయునై యిలావివిక్త
వర్ణ యన నొప్పుఁ గాకుత్స్థవంశ్యనగరి

---

1 చూ:—ప్రబంధరత్నావళి 431-451 పద్యాలు

2. పరళదలత్సరోరుహనసారపరాగపరంపరాపరి
స్ఫురితసువర్ణవర్ణమును పూరితదిఙ్ముఖహంసవాదమే
దురమును నై యగత్త కనుదోయికిఁ బండువుసేయ మ్రోయుఁ ద
త్పురవరలక్ష్మి యెప్పుడును బూనెడు కాంచనకాంచియో యనన్

3. పున్నమచందమామఁ బొరవుచ్చి సుధారసమొయ్యఁ జిల్కుచున్
సన్నముగాఁగ నూరి ఘనసారమునం బ్రతిపాకమిచ్చి మీఁ
దన్నెఱయంగ నల్కినవిధమ్మున వెన్నెల గాయ నప్పురిన్
సున్నపుమేడలం బ్రదదమంబిశిరోగృహరాజి రాజిలున్

4. పురవిధిరక్షకుండై ఫణి
పురము వెడలి వెట్టివెట్టిపొంగారు ఫణా
ధరపరివృఢుకరణి భయం
కరమగుఁ బ్రాకారపరిధి కడు వచ్చెరువై

5. సరసుల పొందు గల్గనఁగఁజాలి బహూన్నతచారుశాఖలం
బెరిగి మహాద్విజావనమె పేర్మి విజాయతిగాఁ దనర్చి ని
ర్భరజనతాపసంహరణపాత్రములయ్యు మహీజవాటికల్
పురి వెలి నిల్చె మేటియు నపూజ్యఁడగున్ మధుపానుకూలతన్

6. వేదపురాణశాస్త్రములు వేదుకవిద్యలు సర్వయజ్ఞసం
పాదనశక్తి నిత్యనిరపాయవిధిప్రతిపాలనంబు, దా
రాదిమతత్త్వమున్ గనుట హస్తగతామలకంబుఁ గంట, ధా
త్రీదివిజావతంసుల కరిందమ మప్పురిఁ గల్గువారికిన్

7. ఏటి మహానుభావుఁ డిహిహీ జమదగ్నితనూజుఁ డేదుము
మ్మాటులఁగాని శత్రుమదమర్దనదక్షుఁడు గాడు గోత్ర మే
తూఁటుగఁ జేతఁ దల్లిమెడఁ ద్రుంచెఁ గదా యని యాపదింతురా
గాటపు పంతగాండ్రు కులగణ్యు లగణ్యులు పుణ్యు లప్పరిన్

8. యుగములు వేయు వోవు నొక యుద్ధరువుల్ గణుతించునంతకే
యుగములు లక్ష చెల్లఁ బోరినున్న ధనంబు మితింప నమ్మహా
యుగశతకోటు లేఁగు వితరోన్నతవస్తువు లెన్నఁ గీన వె
త్తిగ నలకాధినాధులు గదే పురిలో మను వైశ్యపుంగవుల్.

9. చంగునఁ దాటు దే యనిన సప్తసముద్రములైన వేగ వా
గెం గుదియింప నిల్చు నడుగెంటనె శస్త్రనిపాతధీరతన్
సంగరరంగవీథిఁ దమ స్వామికి గెల్పు ఘటించునట్టి యు
త్తుంగతురంగరత్నములు తొంటి హయాకృతి శార్ఙ్గిపుట్టువుల్.

10. ముదురుఁజీకటి మన్నె మూకకుఁ గైజీత
మొసఁగు కుంతలముల యొప్పు వెలయఁ
బండువెన్నెలరాజు బంటుగా నేలు చ
క్కని మొగంబుల విక్కుఁగవి భజింపఁ
బసిడిగ్రుచేనిఁ జేపట్టు కుంచము వేయు
జిగిమించు చన్నుల బిగువు విగుడ
గబ్బి యేవికదొర గారాము గాఁ గ మ
న్నించు లేనడవుల నేర్పు మెఱయ

నూరువులె గాదు రంభ మైయొఱపుఁ దమ వ
శమ్ము గావింపఁ బదనఖచయమె కాదు
విలసనముఁ దార పాటింప వీటఁ బద్మ
పత్రనేత్రలు చాలఁ జూపట్టుచుంద్రు

11. ఆ కరివేల్పుసామి చరణాబ్జములన్ జనియించినారు మం
దాకిని తోడునీడలయినారు నిజంబుగఁ గమ్మకట్టి దా
మై కమనీయకీర్తి మహిమాతిశయంబున మించినారు భ
ద్రాకృతు లద్రిధీరులు ప్రభద్రుల మాద్రులు శూద్రులప్పురిన్[2]

12. మదభిన్నకటగళన్మౌక్తికంబుల తోట
    తోట రాల మస్తవిధూననముల
ఆనమత్కృతలంబులగు పదక్రమముల
    ఘణఘణంకృతి నాభిఘంట లులియఁ
గీర్తిచంద్రికల యాకృతి దట్టమై ధళ
    ధళఁ బర్వ దంతకుంతముల రుచులు
పుష్కరఫూత్కారముల నకాలపువాన
    కారు లెల్లెడఁ దము శార కురియఁ

దమకుఁ బరవాహినులలోను దఱియఁ జొచ్చి
క్రీడలాడుట యుచితంపు జాడ లనఁగఁ
బెరిగి పరయూథజాలంబుల పరసలీలఁ
గ్రాలఁ జనుచుండు నప్పురి గంధకరులు.

---

2 ఈ పద్యం కూచిమంచి తిమ్మకవి లక్షణసారసంగ్రహంలో బిందు యతికి ఉదాహరింపబడింది చూ ॥ — 155

13. వలమానచంపకోత్పలమాలికాదిసం
గ్రథనచాతురి నెఱకవులఁ బోలి
దళము గెలిచిన సూత్రమున నూల్కొల్పు నే
ర్పున యోధవీరుల పొలుపుఁ దెలిపి
ఖండితత్వమున రాగము గల పల్లవా
వళిఁ గోయుటల వేశ్యవలపు నెఱపి
పలుతావు లరసి యెత్తులు పచరించు పెం
పున జూదరుల తేవ పొదమఁజేసి

తమ నిజాంగమరీచులు తత్తదన్య
పుష్పములసావి నిక్కంపుఁబువ్వు లమరు
పేరఁబేర్కొను పొరులఁ గేరి కేరి
నవ్వుదురు పుష్పలావికానలినముఖులు

14. రాసి సహస్రభామఫణరత్నములెల్లను బోవఁదన్నుచున్
వాసరభోగిఁ గాలఫణివైరి కడున్ వడి నొక్కి నక్కఁగాఁ
జేసినఁ గ్రమ్ము తద్రుధిరశీకరపూరవిజృంభణం బనం
గా సముదగ్రతం బొలిచెఁ గ్రమ్మి జపోపమసాంధ్యరాగముల్.

ప్రాతఃకాలవర్ణన

15. తెలతెలవాఱ నొయ్య నరుదెంచు నిశాంతరతాంత కాంతలౌ
చెలువల కింపుగా మెలఁగుఁ జెక్కులఁ గూరిన చూర్ణకుంతలా
వళి సరసంబుగా జడియు వాడినసెజ్జలమీఁది ప్రావిరుల్
దొలఁగగఁజేయు నూడిగపుఁ దొయ్యలులం బలెవేఁ ఁదెమ్మెరల్

16. పిరింకఁ దొరఁగె వెన్నెల మానికంబుల
వేఁడి రాతూపుల విడిసె పహ్ని
కలఁగె జీవంజీవముల నిండు మనములు
జక్కవపులుఁగుల జాలి వదలెఁ
గనుమూసెఁ గుముదకాననవిభావిభవంబు
శ్రీలక్ష్మి నిలిచె రాజీవపీఠి
వాజువాఱఁగఁజొచ్చె వరుణుని దిక్కువ
నేర్పడి దీపించెఁ దూర్పువలను

తార లడివోయె వికసించెఁ దరుల విరులు
చంద్రికలు గందెఁ గొలఁకులు చాలఁదేరె
దీపరుచి దాఁగెఁ దలపూపె రేపటెండ
చందురుఁడు వ్రాలెఁ బొడిచెఁ గంజాతహితుఁడు.

సాయంవర్ణన

17. ఎంతయు రాజుతోఁ డిపగ యేకొదవో? మధుపప్రసక్తి య
త్యాంతముఁ గల్గు తమ్మిలప్రచారము గాదని చూడ నోడి దే
శాంతరమేగె వాఁగ నపరాశఁ బతంగుఁడు దాఁగె నట్టి వృ
త్తాంత మెఱింగి సిగ్గొలసినట్టులు గందె సరోరుహంబులున్

18. ఉడుపథంబను ములుదోసతొడిమ యూడఁ
దామరసబంధుఁడను పండు తనకుఁ దానె
వికృతి గనుపింపఁ గనుపట్టు విపత్తుఁ లనఁగఁ
దనరె నెఱసంజఁగెం పగు తారకములు

19. కాలధనంజయుండు తనుఁగాంచి దివాకర మత్స్యయంత్రమున్
గీలెడలించి సంధ్యయను కృష్ణ నుదంచితరూపవిభ్రమ
శ్రీలలితాంగినిం దగ వరించి తమోమయధార్తరాష్ట్రభూ
పాలకసేనసేయు సితభల్లములో యనఁ బర్వెఁ దారకల్

భోజనవర్ణన

20. ఆలఘృతంబు వేఁడియగు నన్నము నుల్చినముద్దపప్పు క్రొం
దాలిపుకూర లప్పడము ద్రబ్బెడచారులు పానకంబులున్
మేలిమిపిండివంటయును మీఁగడతోడి దధిప్రకాండమున్
నాలుగు మూడుఁతోయముల నంజులు కంజదళాక్షి పెట్టగన్

21. వర్షర్తురాత్రివర్ణన
భానుశశిమండలంబుల లోనడంచి
యిరులుపెనువానఁ గురియుచు నేపు చూపు
రాత్రి వర్షర్తువునఁ బట్టెఁ బ్రతిగృహాక
రములఁ బటుదీపవైడూర్యరత్నసమితి.

# హరి (ర) విలాసము

నాచనసోమన

[లక్షణగ్రంథాల మూలంగా నాచనసోమనకృతంగా తెలియవస్తున్న అలభ్యగ్రంథాల్లో హరివిలాసం ఒకటి. అం. ప్ర. ర. లో ఇది హర విలాసమనే పేర్కొనబడింది అ. రం. ఛం. లో ఒకచోట[1] హరివిలాసమనీ, మరోచోట[2] హరవిలాసమనీ కనిపిస్తుంది. ఐతే ఈ కావ్యంలోని "ఏకీంక నేమ, క్ష్మాస్థిగాగ హర్యశ్వకారలీల లెల్ల, తెలవిడిగవచియించెద దెలిసికొమము" అనే పద్యాన్ని బట్టి ఇది హరివిలాసకావ్యమని ఊహించవచ్చు. కాని, 'అభవుఁడాహవ' (8వం); 'శంబరవైరి' (10వ.) అనే పద్యాల్లో మాత్రం హరుని ప్రసక్తి కానవస్తుంది.]

1. జయవిజయవినుత జన్మా
వ్యయ దూరానందరూపభాసుర దత్తా
భయ హరిహయముఖనిర్జర
నయనన్నక్షత్రయూథ నళినీనాథా ।[3]

2. భూకాంతవర్య పుణ్య
శ్లోకులు నీవలనవె ఫలోన్నతి చాలం
గై కొందురు నిజముగ నవి
రేఖల తెలుఁగెల్ల విస్తరింపఁ గడంగెన్[4]

3. మౌని తిలక సజ్జనసం
తానమహీరుహ భవత్సుధాలాపము నా
వీనులకు విందొనర్చెను
మేనునఁ గల తాప మణచె మృషగాదు సుమీ ।[5]

---

1. III—214 ; 2. III—540 ; 3. అం. ప్ర. ర; అ. రం. ఛం. III—349.
4. అం. ప్ర. ర. 146 పు. 5. అం. ప్ర. ర. 146 పు.

4. చెంగలువల తళతళమను
కంగవనిద్దాపసింది కలకల నగు మే
నంగజుని కుంభికుంభము
లం గేరు సురోజములు నెలంతకుఁ దనరెన్[6]

5. సకియా ! వినవే నీతో
నిఁక యేమి వచింతు నాదు హృదయేశ్వరునీ
దకు తోడి తెమ్ము లేదే
నీ కదలు ప్రాణములు మేన నిలువకయైనన్[7]

6. జపము చాలించి యత్తపసి యచ్చరకన్ని
యను కంట వింపెసలారఁ జూచె
చూచి వెంబడి[8]

7. జయమగుటకు నీ మది సం
శయమేటికి విను మనుచు సమంచితకరుణా
లయుఁడగు మునీంద్రుఁ డెంతయుఁ
ప్రియముగ మంత్రంబుఁ జెప్పె నృపవరుఁ డెలమిన్[9]

8. అభవుఁ డాహవమదోద్ధతుఁడైన యంధకా
సురుబారి గొనకేల శూల మూవి[10]

9. రేదొరయల్లుడు మెఱయన్
గేదఁ గిఱేకు తెలిగచ్చునె జనుగుమ్మెన్
పైదలి గుబ్బల నడుమను
వాదుడుకగు బలము చుట్టువారు వరాంగన్[11]

---

6. అం.ప్ర.ర.236పు 7.అం. ప్ర.ర. 19పు. 8. అం. ప్ర.ర. 336 పు.
9. అం. ప్ర. ర. 346 10. అం.ప్ర.ర. 346 11. 35 పుట.

10. శంబరవైరివిభంజన
సాంబశివా యంధకారిశాసన గజచ
ర్మాంబరధర యని పీదు ప
దంబుల్ పూజించువాఁడు ధన్యుఁడు సుమ్మీ[12]

11. గౌడనరపాల మౌళిశేఖరుల వార్త
కృష్ణకథ విన్నయట్టి నీ కింక నేను
క్లృప్తి గాక హర్యవతారలీలలెల్ల
తెలివిడిగ వచియించెద తెలిసికొనుము[13]

12. అంజెదవుగాక నసుఁ జెం
తం జేరఁగనీక యెంత తగ్గిన మిరియా
లుం గొన్నల సరిగావే
లంజెతనమునందుఁ గొమిరెలం గెలువనొకో[14]

12. అం. ప్ర. ర. 366పు. అ. రం. ఛం. III–214. 13. అం. ప్ర. ర. 41 అ పు.

14. ల. సా. సం. I–83. వీరేశలింగం పంతులుగారీ పద్యాన్ని వసంత విలాపం లోనిదిగా అం.క.చ. (1 భాగం)లో తెలిపినారు. (పుట 355)

# హరిశ్చంద్రోపాఖ్యానము

(హరిశ్చంద్రకథ)

చంద్రమౌళి

---

[గౌరన ద్విపద హరిశ్చంద్రోపాఖ్యాన ప్రభావంతో చంపూరూపంలో వెలసిన కావ్యం ఇది. చంద్రమౌళికవి దీని కర్త ఈతడు తురగారాజకవి. అయ్యంకి బాలసరస్వతులచే పూర్వకవిస్తుతిలో స్తుతింపబడినాడు.]

1. అలసత బొంకు నాస్తికత యాయతచింత యయుక్తి కారితా
కలనము దీర్ఘసూత్రము వికాసము బొందమి దుర్వ్యయంబు పె
ల్లలుక నిరర్థకార్యరుచి యర్థమతచ్యుతి మంత్రహాసి ప్రా
జ్ఞుల వెలి శాంతసౌమ్యకృతి శూన్యత నా నివి రాజదోషముల్[1]

అతటా చేరెడు నేలకుం [illegible] సప్తాంభోధివేష్టితభ
త్సకలద్వీపకలాపభూపమకుటాంచత్పద్మరాగోజ్జ్వల
ప్రకటానర్ఘనిసర్గశ[illegible]తోత్పాదుఁ డైనట్టి రా
జుకు[illegible] యేడ్చెఁ గన్నుఁగవ నశ్రుల్ కాల్వలై పారగన్[2]

---

1. ప్ర. ర. (అ) : ఛం.గ్రం.D. 705. (ఆం. వి) 57అ పుట
2. వ.ఆం. పా. వం. III. 89పు.

# అనుబంధము

నృసింహపురాణము
భీమన

1. భూపాలవర్య శుభోదయం బొదవు నీ
వీ మంత్ర మింత పఠించినంత[1]

2. వరనాథ యతని దానమ్ముల చేత న
వాప్తకాములు గాని యగ్రజన్ము.[2]



పద్మపురాణము
అయ్యలరాజు సింగన

ఆ శతమన్యువైభవుఁ డహర్పతితేజుఁడు చంద్ర చంద్రికా
........మానకీర్తియగు గౌరయమల్లనమంత్రి దిక్కులన్
వాసికినెక్క భక్తిని హిరణ్య.... గుడికట్టి....రా
మేశుఁ బ్రతిష్ఠఁజేసి నుతికెక్కెను నమ్ములపూరు వాకిటన్[3]



మిత్రవిందాపరిణయము
చక్రపాణి రంగనాథుడు

1. వనమాలిఁ గొలుచునంతననె యెల్లప్పుడ
వాప్తకాములు గానివారు లేరు.[4]

---

1. ఆం. ప్ర. ర (నెం. 695) 17a పుట
2. ఆం. ప్ర. ర. (నెం. 695) 18 a పుట
3. ఆం.ప్ర.ర.26b పుట.
4. ఆం.ప్ర.ర. 15a

వజ్రపంజరశతకము

- - - - - - - - - - - - మ
త్క్రవ వినుఁ గొల్చినన్ బదునాకొండవచోటి ఫలంబులిత్తువో
దివిజకులాప్తదా రఘుపతీ శరణాగతవజ్రపంజరా.[1]



విజయవిజయము
చిమ్మపూడి అమరేశ్వరుడు

1. ఉబుకకువె తల్లి నే వా
విం బలిగొనెద సుమ్ము భృత్యునిగ లేనియెడన్
బొబగుగ నా సరి రొవెలం
ది బవరమునకు దిగుడుగ మదిఁ దలంపగదే.[2]



శంతనుచరిత్ర
సోమయాజి అనంతయ్య

1. ఈ నెలమెకమ్ము సాహస
మేనొక్కఁడ తెలుపువాఁడనె వెంటరు వి (?)
యానాదుల తెలిపిన నీ
మానసమున కెఱుఁగవచ్చు మనుజాధీశా ![3]

1. అం.ప్ర.ర. 488 పుట.
2. అం.ప్ర.శ. 18 b పుట. 3. అంశ్వ.ర. 25b పుట.

2. అందములు పెక్కు వేలుపుఁ
దంద్రిరువారంబు గర్వితత్తడి యొందన్
దండధరు జక్కి యెక్కటి
తుండింపఁగ మావినాఁద దోసంబనుచున్[1]



యమకశతకము
గణపవరపు వేంకటకవి

1. కమ్మవి తమ్మిదొద్దువిని గమ్మక నమ్మక.... దెమ్మియై
యిమ్మెయియిమ్మెయింగదిమియిమ్మెయిగుమ్మెనురమ్మురమ్ము వే
రమ్ము కరమ్ము నెమ్మది తిరంబుగ నమ్మి నమ్ము నెంచ చి
త్తమ్మున నుంచి కేలి విరత మ్మిక వేంకటశైల నాయకా[2]॥



శ్రీగిరిశతకము

1. చరితమెల్ల విన్ద్రదజాలంబు తలఁపెల్ల
నెల్లిదంబుమాట లెల్ల దంభ
మిట్టి కుమతిఁ గొలిచి యెవ్వాఁడు మననోపుఁ
జిరతరప్రకాశ శ్రీగిరీశ.[3]

---

1. అం.ప్ర.ర. 28b పుట;
2. అం.ప్ర.ర. 28a పుట.
3. వ.పీ.వ. 241 పద్యం.

శ్రీరంగమాహాత్మ్యము

తెలుగురాయలు

1. ఆ యిక్ష్వాకుపరంపర
లీ యలసినచోట భూతలేశ్వరులగుటన్
పాయని కృపతోడుత నా
రాయణుఁడరుగు దేరఁగలఁడు రంగమునందున్[1]



శ్రీరామాయణము

కర్త ....?

1. బలియునకుఁ దనకు నడుమై
నిలిచిన సామంతుఁ జెఱుప నేరమి వచ్చున్
పులిబోను తలుపు తెఱచినఁ
బొలియింపదె మీద నుఱికి పురుషనిధానా.[2]



ఆదినారాయణచరిత్రము

కవిరాక్షసుడు

1. శ్రీయుతలోచనోజ్జ్వలమరీచులు భానుమరీచి విస్ఫుర
త్తోయజకాంతితోడఁ దులఁదూగగ పద్వనిపట్టు గట్టి య
త్యాయత శంఖ చక్ర రుచిరాసి గదాధరుఁడేగుఁదెంచె నా
రాయణుఁ డార్తరక్షణపరాయణుఁడౌ కరిరాజు పాలికిన్.[3]

---

1. అం.ప్ర.ర. 32b పుట.
2. వ.సీ.వ. 806 పద్యము.
3. అం.ప్ర.ర. 15a పుట; ఛం.గ్రం. 159/7 కాకినాడ: D705. అం.వి.

శ్రీకృష్ణ (లీలా) విలాసము
కటికనేని రామయ్య

1. సమయవరుండు పశ్చిమదిశాసతి కంఠతలంబునందుఁ గుం
కుమకలితాంశుసూత్రమున గూర్చి కట్టిన తాళి సంజయున్
ప్రమద మొనర్పఁ బోవఁ గుచపాళిని దా నరమాటు జెందె నా
సమరగఁ గానవచ్చె నపరాద్రి మణుంగున భానుదర్ధమై

2. ఆ రామామణివేణి రాహువు లలాటార్ధేందునిం బట్టు దీ
క్షారంభంబున రాఁ దలంచి యసమత్వాశంకచేఁ బుత్రులన్
ప్రారూఢిం బనుపన్ శ్రవఃకుహర విర్వ్యాతాత్ములై దృక్కనో
భూరాజద్విశిఖార్తి విల్చెనన నొప్పున్ దీర్ఘ సుభ్రూలతల్[1]



తందశతకము
భాస్కరుడు

1. పేకేటి మృగాంకుఁడు జడి
పాతుల పాటొందఁ గల్పమాదికి నొందన్
కాకోదరపతి నీ యశ
మాకలితద్యుతులు మీఱ నల్లయవేమా![2]

1. ఈ పద్యాలు "కువలయానంద ప్రకాశిక"లో ఉదాహరింపబడినట్లుగ ఆరుద్రగారు పేర్కొన్నారు. (స.ఆం.సా;సం. xii 297 పుట.
2. ఆ.శి. lv — 152.

మహాభారతము

కర్త-?

[ వార్తాకవి రఘునాథయ్య లక్షణదీపికలో[1] పదిహేడు మహాభారత పద్యాలు లక్ష్యాలుగా ఉదాహరింపబడ్డవి. వీటిలో ఐదు పద్యాలు కవిత్రయ భారతంలోనూ, ఒక పద్యం అథర్వణభారతంలోనూ కనిపిస్తున్నవి. తక్కిన పదకొండు పద్యాలు ఏ భారతంలోవో చెప్పలేం. కవిత్రయ భారతం తప్ప ప్రసిద్ధంగా ఉన్నవి — విన్నవి అథర్వణ భారతం, సర్వదేవుని విరాటపర్వం మాత్రమే. బహుశః ఈ పద్యాలు ఈ రెండింటిలోవి కావచ్చేమో! ఆ పదకొండు పద్యాలను దిగువ ఉదాహరిస్తున్నాను.]

1. దుర్జనుఁడగు రాధేయుఁడు
గర్జించిన నేమి దీఱు కాండవఘ్నునకై
నిర్జరనాథునిఁ దఱిమిన
యర్జును సాహసము లెఱుఁగరా మీ రెల్లన్.

2. ఓ కమలాక్ష వింటివె సుయోధనుతో కురుసేనలెల్ల చీ
కాకు పడంగ ధర్మజుఁడు కౌతుకమందఁగ నీవు మెచ్చ నా
నాకవిభుండు లేఖతతి యచ్చెరుపాటున నమ్మఁ జూడనే
నీ కమలాప్తనందను వధించెద శౌర్యము నిర్వహించెదన్.

3. పాయక ధరణీభారము
మాయింపఁదలంచి భద్రమహిమలు భువిలో
నీ యిరువు రిపుడు నర నా
రాయణులై యుద్భవించి రవనీనాథా!

---

1. దీని కాగితపుప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో ఉన్నది. నెంబరు D 1329. శ్రీరావూరి దొరసామిశర్మగారి వద్దనున్న దీని ప్రతి నుండి ఈ పద్యాలను వ్రాసి పంపినవారు డా॥ జి. లలితగారు. వీరిద్దరికీ నా కృతజ్ఞతలు.

4. ఆ సవ్యసాచి నొంచెడి
యాసం గర్ణుండు కర్ణు నడఁచెదనని పె
ల్లీసునఁ గవ్వడియును నా
తేసి శరంబులను విరువురేసిరి పెలుచన్.

5. ఖండనమున నెదిరిన రిపు
మండలములనెల్లఁ గినిసి మర్దించి మదో
ద్దండుండై కవ్వడి మా
ర్తాండసుతుం దొదరి పోరె నాకులు మెచ్చన్.

6. దేవదత్తంబు పూరింపఁ ద్రిదశగణము
వదరె వినువీథి పరగ సద్ధతి వదంతె
నంబువిధు లింకె జగము లల్లల్లనాడె
కులనగంబులు కంపించె కురువరేణ్య!

7. అంగాధినాథుపలుకుల
కుం గనలుచుఁ గెరలి నోళ్లు గఱచుచు రిపుసే
నం గనుఁగొని రెండవ సా
రంగధరుని లీల ద్రోణుఁ డరదము బఱపెన్

8. ప్రాణభయాతురులకు వ
జ్ఞానులకును హీనులకు ఖ్యాపద్వేషులకున్

9. ప్రాణముకొన్నను నెక్కుడు
మానము మానవులకెల్ల మఱి ధరలోపన్
దానము పాపహరంబును
జ్ఞానంబున నూర్ధ్వలోక సంపదఁ గాంచున్.

10. ఆఱు రసంబులం జవులయందలి క్రొత్తలు పుట్ట విచ్చలున్
వేఱొక భంగి పాకముల విన్నను వొప్పఁగఁజేసి చేసిన
పిమ్మటఁగఁ దానసిన్నొకవివింబురిఁ గావవియిట్లు గాగిమేల్
కాఱియ బెట్టు....వ వొడికంబుగ వండుదు కూడుగూరలున్.

11. తక్కుట నైవికు లాతవి
వొకవి దిగవిడిచి పారిరో లావునఁ దే
రుక్కును మీఱఁగఁ ద్రోవది
పెక్కంద్రాగ బడిరొ పెనసి పీనుంగులుగన్.



ముద్రారాక్షసము

(కర్త-?)

1. మనుజాధీశ్వరుకంటె మంత్రిబలసామర్థ్యంబు నర్థంబు రా
జ్యనియోగంబును నగ్గలంబగుచు నాజ్ఞోల్లంఘనోద్యుక్తుఁడై
మను దుష్టవ్యవసాయుఁడేమది మదోన్మత్తాత్ముఁడై కూలఁగ్ర
క్కున మున్నాతనిఁ జెందదీకుఁడు నదీకూలావనీజాకృతిన్.[1]



1. చం. గ్ర

# ఉదాహృత కావ్యాలు

# ఉపయుక్త గ్రంథసూచిక


అప్పకవీయము (1962)

కాకునూరి అప్పకవి: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు.

ఆంధ్రకవిసప్తశతి (1956)

బులుసు వెంకట రమణయ్య: బాలసరస్వతి బుక్ డిపో, మదరాసు.

ఆంధ్రకవుల చరిత్రము

కందుకూరి వీరేశలింగం పంతులు

ఆంధ్రకౌముది

మండ లక్ష్మీ నృసింహాచార్యులు. (కాగితపు ప్రతి నెం. 1223; మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము.

ఆంధ్ర వాఙ్మయ చరిత్రము (1957)

వంగూరి సుబ్బారావు—కమల కుటీర్, నరసాపురము.

ఆంధ్ర ప్రయోగరత్నాకరము

గణపవరపు వేంకటకవి. (తాళపత్రప్రతి నెం. D 695, D 696 సరస్వతీ మహల్ లైబ్రరీ, తంజావూరు.

ఆనందరంగరాట్ఛందము (1922)

కస్తూరి రంగకవి -వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్

ఉదాహరణపద్యములు

కాగితపుప్రతి, ఆంధ్రసాహిత్య పరిషత్తు గ్రంథాలయము, కాకినాడ

కవిచింతామణి (1982)

తాళంభట్టు- ఆం. ప్ర. ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, హైదరాబాద్.

కవిజన సంజీవని (1930)

ముద్దరాజు రామన-వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.

కవిజీవితములు (1955)

గురుజాడ శ్రీరామమూర్తి, వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

కవితరంగిణి

చాగంటి శేషయ్య

కవి వాగ్బంధనము

తిక్కన సోమయాజి. (తాళపత్ర ప్రతి; నెం. 703. సరస్వతీ మహల్ లైబ్రరీ, తంజావూరు.)

కవిసంశయవిచ్ఛేదము (1955)

అడిదము సూరకవి — వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.

గోలకొండకవులసంచిక (1934)

సంపాదకులు:—సురవరము ప్రతాపరెడ్డి— గోలకొండపత్రికా కార్యాలయము, హైదరాబాద్.

ఛందోగ్రంథము

తాళపత్ర ప్రతి. నెం. 159/7 ఆంధ్రసాహిత్య పరిషత్తు గ్రంథాలయము కాకినాడ.

ఛందోగ్రంథము

నెం. D .705. M .328. ఆంధ్ర విశ్వవిద్యాలయము. విశాఖపట్టణము.

ఛందోగ్రంథము

(నెం. R 235; శ్రీ వెంకటేశ్వర ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారము, తిరుపతి.)

ఛందోగ్రంథము

నెం. 173/6 ఆంధ్రసాహిత్య పరిషత్తు గ్రంథాలయము, కాకినాడ

ప్రబంధ మణిభూషణము (197.)

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ హైదరాబాదు.

ప్రబంధ రత్నాకరము (వ్రాతప్రతి)

ఆంధ్ర సాహిత్య పరిషత్తు గ్రంథాలయము, కాకినాడ.

మరుగుపడిన మాణిక్యాలు (1961)
డా. బి. రామరాజు, ప్రచురణ : గోలకొండ పత్రిక.

ప్రబంధ రత్నావళి (1976)
సంపాదకులు :— వేటూరి ప్రభాకరశాస్త్రి. శ్రీ ప్రభాకరపరిశోధకమండలి
హైదరాబాదు.

మానవల్లికవి—రచనలు (1972)
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు.

బాలబోధచ్ఛందస్సు
నెం. R 1212 శ్రీవేంకటేశ్వర ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము.
తిరుపతి

రెడ్డి సంచిక (1947)
సంపాదకులు : వద్దాది అప్పారావు, ఆంధ్రేతిహాస పరిశోధకమండలి,
రాజమహేంద్రవరము.

లక్షణదీపిక
వాస్తాకవి రఘునాథయ్య: (కాగితపు ప్రతి; నెం. D 1329 మదరాసు
ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము—మదరాసు)

లక్షణవిలాసము
కాగితపు ప్రతి; నెం. R 1024: శ్రీవేంకటేశ్వర ప్రాచ్యలిఖిత
పుస్తక భాండాగారము; తిరుపతి

లక్షణశిరోమణి (1979)
పొత్తపి వేంకట రమణకవి; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ,
హైదరాబాదు.

లక్షణసారసంగ్రహము (1971)
కూచిమంచి తిమ్మకవి; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ.
హైదరాబాదు.

వీరభూపాలీయము

కాగితపు ప్రతి నెం 1319. మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము

శతకకవుల చరిత్ర ( 957)

వంగూరి సుబ్బారావు: కమల కుటీర్, నరసాపురము.

సకలనీతిసమ్మతము (.970)

మడికి సింగన: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు.

సకలలక్షణసారసంగ్రహము

ఉప్పులూరి వెంకటరెడ్డి: కాగితపు ప్రతి—శ్రీవేంకటేశ్వర ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము తిరుపతి.

సమగ్రఆంధ్రసాహిత్యం

ఆరుద్ర: శేషాచలం అండ్ కంపెనీ.

సరసాంధ్రవృత్త రత్నాకరము లేదా మాల్యాద్రి నృసింహచ్ఛందము;

వెల్లటూరి లింగయమంత్రి. (కాగితపుప్రతి. నెం D 1229 శ్రీవేంకటేశ్వర ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము, తిరుపతి.

సుకవిమనోరంజనము

కూచి[redacted] ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు.

సులక్షణసారము 1972

లింగమగుంట తిమ్మకవి: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.

✿

# ఉదాహృతకావ్యకర్తృసూచిక

స





# పద్యానుక్రమణిక

